పద్మశాలికుల పురాణమగు

# శ్రీ భావనాఋషి మాహాత్మ్యమ్

అఖిలభారత పద్మశాలి మహాజన సభవారి
అభిమతానుసారము


కావ్యస్మృతి పురాణతీర్థ
కీ॥ శే. బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మ గారిచే


పరిష్కరింపబడినది.


ప్రకాశకులు :
మహాత్తమ పబ్లికేషన్స్
రామారావుపేట : : కాకినాడ-4

ప్రథమ ముద్రణము : 1000 ప్రతులు.

వెల : రెండు రూపాయిలు.

# విషయసూచిక




| | | | పేజి |
|---|---|---|---|
| 1. | ప్రస్తావన | | i |
| 2. | పీఠిక | ... | x |
| 3. | ప్రార్థనాదికము | | 1 |
| 4. | ప్రథమోధ్యాయము | | 3 |
| 5. | ద్వితీయోధ్యాయము | ... | 20 |
| 6. | తృతీయోధ్యాయము | ... | 36 |
| 7. | చతుర్థోధ్యాయము | ... | 56 |
| 8. | పంచమోధ్యాయము | ... | 68 |
| 9. | షష్ఠోధ్యాయము | ... | 89 |
| 10. | సప్తమోధ్యాయము | ... | 127 |
| 11. | అష్టమోధ్యాయము | ... | 154 |
| 12. | అనుబంధము ౧ | ... | 1–16 |
| 13. | ,, ౨ | ... | 1–5 |
| 14. | ,, ౩ | ... | 6–8 |


కాకినాడ:
మాస్టర్‌మన్ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

# ప్రస్తావన

"భావనాఋషి పురాణము" అని వ్యవహరింపబడు చున్న "శ్రీ భావనాఋషి మాహాత్మ్యమ్" అను సంస్కృత గ్రంథము 1893 వ. సంవత్సరమున ప్రకటింపబడినది. ఆ గ్రంథమును పురాణం కొండప్ప యనునతడు (సమయకుల జుడు) చిత్తూరు జిల్లాలోని నారాయణవనము అను గ్రామము లోని కొందఱు పద్మశాలీయుల ధనసహాయముతోడను, కొందఱు వైష్ణవపండితుల సహకారముతోడను, మద్రాసులో ముద్రణగావించి ప్రకటన చేసెను.

ఆ గ్రంథములో పద్మశాలీయుల వంశక్రమము తప్పుగానున్నది. దానికి మూలమగు తాళపత్రగ్రంథములో లేనివి కొన్ని అప్రస్తుతమైన కథలు చేర్చబడినవి. ఇంకను మఱికొన్ని దోషములుకూడ నుండెను. భట్టిప్రోలు వాస్తవ్యులు, వైయ్యాకరణేత్యాది బిరుదాంకితులునగు శ్రీమాన్ జొన్నాదుల రామస్వామిశాస్త్రిగారు ఈ గ్రంథమును పేరాలవాస్తవ్యులు, మా చినతాతగారునైన శ్రీమాన్ అవధానం కార్యంపూడి రాజమన్నారుకవి శతావధానిగారి దృష్టికి తీసికొనివచ్చిరి. ఈ గ్రంథముపైన తర్జన భర్జనలు గుంటూరు జిల్లాలోని భట్టిప్రోలు వగైరా గ్రామములలో ఎక్కువగా జరిగినవి.

శ్రీమాన్, అవధానం, కార్యంపూడి, రాజమన్నారు కవి, శతావధానిగారు, వారి గురువర్యులైన శ్రీమానద్దంకి కుమార తిరుమలాచార్యులు అయ్యవార్లంగారితో సంప్రదించి, అద్దానిని సంస్కరింపవలయునని యత్నముచేసి యుండిరి. కాకినాడలోని, పీఠికాపురమహారాజావారి కళాశాలలో నాంధ్రపండితులు, 'ఆంధ్రపాణిని' బిరుదాంకితులు, 'ఆంధ్రాక్షరతత్త్వ' గ్రంథకర్తలు నగు బ్రహ్మశ్రీ పాడి వేంకటస్వామి సుధీమణిగారు, 1913 లో ప్రకటింపబడిన 'భద్రావతీ పరిణయము' అను వీధినాటకమునకు పీఠిక వ్రాయుచు, "భావనాఋషి పురాణము"ను గ్రంథము విషయమై చర్చచేసి, అయ్యది సంస్కరింపబడవలసి యున్నదని వక్కాణించిరి.

శ్రీమాన్ రాజమన్నారు కవిగారు తలపెట్టిన సంస్కరణము, వారు జీవించియుండగా జరుగలేదు. తరువాత కొంతకాలమునకు వారి అన్నగారి కుమారులు, మా పెదతండ్రిగారునైన "పద్మశాలి పితామహ" శ్రీమాన్, అవధానం, కార్యంపూడి వేంకటకృష్ణకవి, శతావధానిగారు ప్రప్రథమంగా అఖిలభారత పద్మశాలి మహాసభ, 1921 వ సంవత్సరములో కడప జిల్లాలోని పుల్లంపేటలో జరిగినప్పుడు ఈ గ్రంథమును సమగ్రముగా పరిశీలించి, సంస్కరించి ప్రకటించుటకు ఆ మహాసభవారిచే తీర్మానము చేయించిరి. అయినను, 1923 వ సంవత్సరములో, మంగళగిరిలో ద్వితీయ

అఖిలభారత పద్మశాలి మహాసభ జరుగునాటికి, ఆ గ్రంథ సంస్కరణ విషయమైన కృషి జరుగనందున, ఈ క్రిందివారు సభ్యులుగాగల ఒకకమిటీని సంస్కరణకై ఏర్పాటుచేయించిరి.

(1) శ్రీమాన్ కార్యంపూడి వేంకటకృష్ణకవిగారు-పేరాల
(2) ,, కార్యంపూడి రమాకాంతకవిగారు-పేరాల
(3) ,, కొర్నిపాటి ఘంటయ్యగారు-రాయవరము
(4) ,, నూకల చిన్నయ్యగారు-అప్పయ్యరాజుపేట
(5) ,, గుడ్డంటి గోకర్ణకవిగారు-పేరాల
(6) ,, కొత్రపు కమలనాథయ్యగారు-అయిలవరము
(7) ,, ఇసునూరి సుదర్శనముగారు-చీరాల
(8) ,, కాటాబత్తుని రామయ్యగారు-అద్దేపల్లి.

ఈ కమిటీకి శ్రీమాన్ కార్యంపూడి వేంకటకృష్ణ కవిగారే మార్గదర్శకులుగానుండి, మహాసభవారి ఆదేశానుసారము కడప వాస్తవ్యులు కావ్యస్మృతి పురాణతీర్థ బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారిచే సంస్కరణ చేయించి, పీఠికనుకూడ వ్రాయించి, ముద్రణకు సిద్ధముచేసి, పద్మశాలి మహాసభవారిచే అంగీకరింపజేసి యుండిరి.

తరువాత 1929 వ సంవత్సరములో హైదరాబాదు నగరమున జరిగిన ఆఱవ అఖిలభారత పద్మశాలి మహాసభలో, ఈ గ్రంథమును ముద్రించి ప్రకటించుటకు తీర్మానించిరి.

ఆ గ్రంథముద్రణ కగు ధనమును కూడ యిచ్చుటకు ఒక ప్రముఖుడు వాగ్దానము చేసెను. కాని అది జరుగలేదు. తరువాత పది సంవత్సరముల వరకు పద్మశాలి మహాసభలు సమావేశము కాలేదు. 1939 వ సంవత్సరములో శ్రీమదహోబిలక్షేత్రమున జరిగిన సప్తమ పద్మశాలి మహాసభలో మరల ఈగ్రంథము విషయమై ఈక్రిందివారు కమిటీ సభ్యులుగాగల తీర్మానము, ప్రథమ పద్మశాలి మహాసభాధ్యక్షులగు 'పద్మశాలికుల రత్న' శ్రీమాన్ ఆకురాతి రంగనాయకులుగారిచే ప్రతిపాదింపబడి ఆమోదింపబడినది.

ఈ గ్రంథ కమిటీలోని సభ్యులు :

1. శ్రీమాన్ కార్యంపూడి నాగేంద్రుడుగారు,
బి. ఎ. బి. ఇడి., అధ్యక్షులు.

2. ,, కార్యంపూడి రమాకాంత కవిగారు

2. ,, తాడిపత్రి శ్రీరామశ్రేష్ఠిగారు

4. ,, రాచాబత్తుని అచ్చయ్యగారు

5. ,, దోగుపర్తి గోపాలంగారు

6. ,, బిట్రా వెంకటసుబ్రహ్మణ్యస్థపతిగారు

7. ,, తుమ్మలచర్ల వేంకటసుబ్బయ్య సిద్ధాంతిగారు

8. ,, కొండాబత్తిని వీరమల్లయ్యగారు

9. ,, గుంటక నరసయ్య పంతులుగారు

10. ,, నూకల గరుడయ్యగారు

11. ,, రావిటి పరమేశ్వరయ్యగా రు

ఈ గ్రంథ కమిటీకి అధ్యక్షుడుగా నన్ను ఏర్పాటుచేసి నందున, ఈ గ్రంథ ప్రచురణకై గతకాలంలో కొన్ని పర్యాయములు ప్రయత్నములను చేసియుంటిని. కాని కారణాంతరములవలన ఆ ప్రయత్నములు కార్యరూపమును చెంది యుండలేదు. ఆ ప్రయత్నములలో నొకటిగా, కృష్ణాజిల్లా లోని 'పటమట' అను గ్రామములో ది 25-4-59 న జరిగిన గ్రంథ కమిటి సమావేశము నాటికి కమిటీ సభ్యులు పెక్కురు గతించినందున ఈ క్రిందివారిని కమిటీ సభ్యులుగా 'కో-ఆప్టు' చేసికొనడమైనది.

1. శ్రీమాన్ తాడిపర్తి శ్రీకంఠంగారు,
   బి. ఎ. యల్. యల్. బి., ఎడ్వొకేటు.
2. ,, బిట్రా కోటేశ్వర సిద్ధాంతిగారు
3. ,, కొతరపు వేంకట రామమూర్తిగారు
4. ,, మాచర్ల సీతారాము కవిగారు

ఆ సందర్భమున చేసిన ప్రయత్నము కూడ కార్యరూపము చెందియుండలేదు. తర్వాత "చేనేత ఉద్యమ పితామహ" శ్రీమాన్ గుంటక నరసయ్య పంతులుగారితోడను, శ్రీమాన్ తాడిపర్తి శ్రీకంఠంగారి తోడను పెక్కు పర్యాయములు ఈ విషయమై సంప్రదించితిని.

చివరకు ఈ సంవత్సరము (1969) జనవరి నెలలో శ్రీమాన్ గుంటక నరసయ్య పంతులుగారిని నేను మరల

ఆ గ్రంథముద్రణ కగు ధనమును కూడ యిచ్చుటకు ఒక ప్రముఖుడు వాగ్దానము చేసెను. కాని అది జరుగలేదు. తరువాత పది సంవత్సరముల వరకు పద్మశాలి మహాసభలు సమావేశము కాలేదు. 1939 వ సంవత్సరములో శ్రీమదహో బిలక్షేత్రమున జరిగిన సప్తమ పద్మశాలి మహాసభలో మరల ఈగ్రంథము విషయమై ఈక్రిందివారు కమిటీ సభ్యులుగాగల తీర్మానము, ప్రథమ పద్మశాలి మహాసభాధ్యక్షులగు 'పద్మశాలికుల రత్న' శ్రీమాన్ ఆకురాతి రంగనాయకులుగారిచే ప్రతిపాదింపబడి ఆమోదింపబడినది.

ఈ గ్రంథ కమిటీలోని సభ్యులు :

1. శ్రీమాన్ కార్యంపూడి నాగేంద్రుడుగారు,
   బి. ఎ. బి. ఇడి., అధ్యక్షులు.
2. ,, కార్యంపూడి రమాకాంత కవిగారు
2. ,, తాడిపర్తి శ్రీరామశ్రేష్ఠిగారు
4. ,, రాచాబత్తుని అచ్చయ్యగారు
5. ,, దోగుపర్తి గోపాలంగారు
6. ,, బిట్రా వెంకటసుబ్రహ్మణ్యస్థపతిగారు
7. ,, తుమ్మలచర్ల వేంకటసుబ్బయ్య సిద్ధాంతిగారు
8. ,, కొండాబత్తిని వీరమల్లయ్యగారు
9. ,, గుంటక నరసయ్య పంతులుగారు
10. ,, నూకల గరుడయ్యగారు
11. ,, రావిటి పరమేశ్వరయ్యగారు

ఈ గ్రంథ కమిటీకి అధ్యక్షుడుగా నన్ను ఏర్పాటుచేసి నందున, ఈ గ్రంథ ప్రచురణకై గతకాలంలో కొన్ని పర్యాయములు ప్రయత్నములను చేసియుంటిని. కాని కారణాంతరములవలన ఆ ప్రయత్నములు కార్యరూపమును చెంది యుండలేదు. ఆ ప్రయత్నములలో నొకటిగా, కృష్ణాజిల్లాలోని 'పటమట' అను గ్రామములో ది 25-4-59 న జరిగిన గ్రంథ కమిటి సమావేశము నాటికి కమిటీ సభ్యులు పెక్కురు గతించినందున ఈ క్రిందివారిని కమిటీ సభ్యులుగా 'కో-ఆప్టు' చేసికొనడమైనది.

1. శ్రీమాన్ తాడిపర్తి శ్రీకంఠంగారు,
బి. ఎ. యల్. యల్. బి., ఎడ్వొకేటు.
2. ,, బిట్రా కోటేశ్వర సిద్ధాంతిగారు
3. ,, కొతరపు వేంకట రామమూర్తిగారు
4. ,, మాచర్ల సీతారామ కవిగారు

ఆ సందర్భమున చేసిన ప్రయత్నము కూడ కార్యరూపము చెందియుండలేదు. తర్వాత "చేనేత ఉద్యమ పితామహ" శ్రీమాన్ గుంటక నరసయ్య పంతులుగారితోడను, శ్రీమాన్ తాడిపర్తి శ్రీకంఠంగారి తోడను పెక్కు పర్యాయములు ఈ విషయమై సంప్రదించితిని.

చివరకు ఈ సంవత్సరము (1969) జనవరి నెలలో శ్రీమాన్ గుంటక నరసయ్య పంతులుగారిని నేను మరల

కలిసికొని, ఈ గ్రంథ ప్రకటనకై ప్రయత్నము చేసితిని. శ్రీయుత గుంటక నరసయ్య పంతులుగారు హైదరాబాదు, సికిందరాబాదు నగరములలోని కొందఱు సదభిమానులైన ముఖ్యులచేతను, ఇతర పట్టణములలోని ముఖ్యులు మరికొందరిచేతను ద్రవ్యసహాయ మొనరింపజేసి సహాకరించిరి. శ్రీ బట్రెంకల రామచంద్రయ్యగారు (కలప వ్యాపారము, హైదరాబాదు) తాము రు 116 లు నొసంగియు, తమ మిత్రులు ఇరువురు కలప వ్యాపారస్థులచేత రు 51 లు వంతున ఇప్పించియు సహాకరించిరి. శ్రీ చిలకా మల్లయ్యగారు (నవజీవన్ వస్త్ర భాండార్, నిజామాబాదు) నిజామాబాదు లోని ఇరువురు సదభిమానులచేత రు 116 లు వంతున సహాయ్యము చేయించి సహాకరించిరి. వారందరి పేర్లను, విలాసములను ప్రత్యేకముగ నిందు ప్రకటించుచున్నాను.

లోగడ శ్రీ తాడిపర్తి శ్రీకంఠంగారున్నూ, నేనున్నూ తెనాలి వెళ్ళిన సందర్భమున వాగ్దానములు చేసిన వారిలో శ్రీమతి తాడిపర్తి అంజమ్మగారు రు 116 లను శ్రీ తాడిపర్తి శ్రీకంఠంగారికి చేర్చిరి. శ్రీమతి అంజమ్మగారు, వారి కుమారులు కీ॥ శే॥ వేంకటసత్యనారాయణ, బి. ఇ., గారి జ్ఞాపకార్థమై ద్రవ్యమును పంపి, తమ అభిమానమును వెల్లడి చేసిరి. ఆ మొత్తమును స్వీకరించి వారి పేరును దాతల పట్టికలో చేర్చితిని.

లోగడ నేను పుల్లంపేటలోని సంఘోద్ధారక శ్రీ నూకల వెంకటసుబ్బయ్యగారిచే స్థాపింపబడిన బహూత్తమ విద్యా దానసభ, పాఠశాలలకు ప్రధానోపాధ్యాయుడనుగా పని చేసిన కాలములో నాకు పరిచితులైన మిత్రులు కొందఱు పుల్లంపేట, మాధవరము వాస్తవ్యులు అభిమానముతో గ్రంథముద్రణకై కొద్ది కొద్ది మొత్తములను నాకందజేసిరి. వారందఱి పేర్లను, విలాసములను, ద్రవ్యసహాయ మొనర్చిన వారి జాబితాలో చేర్చుచున్నాను.

ఇట్లు ఈగ్రంథము వెలువడుటకై ద్రవ్యసహాయము చేసిన సదభిమానుల కెల్లరకు నా కృతజ్ఞతను తెలియజేయు చున్నాను. గ్రంథమును ప్రకటించుటలో కారణాంతరముల వలన జరిగిన ఆలస్యమునకు సహృదయులైన కులాభిమాను లందరు మన్నింపగలరని భావించుచున్నాను.

గత కాలములో ఈ గ్రంథ సంస్కరణకై అఖిల భారత పద్మశాలి మహాసభలచే నేర్పాటుగావింపబడిన కుల గ్రంథ సంస్కరణ కమిటీలలో సభ్యులుగానుండి, గ్రంథ సంస్కరణకై కృషిచేసి, దివంగతులైన సభ్యుల నెల్లరను ఈ సమయమున స్మృతిపథమునకు తెచ్చుకొని వారికందరకు ధన్యవాదముల నర్పించుచున్నాను.

ఈ గ్రంథమును హైదరాబాదులోని పద్మశాలిభవన మున ఆవిష్కరణము చేయించుటకై శ్రీ గుంటక నరసయ్య

పంతులుగారితో సంప్రదించి నిర్ణయించితిమి. హైదరాబాదు నగరము ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్యనగర మగుటవలనను, హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరములలోని పద్మశాలీయ ప్రముఖులే ఈ గ్రంథముద్రణమునకై ఎక్కువ ద్రవ్యసహాయ మొనరించియుండుటయు పై నిర్ణయమునకు ప్రబలకారణము. ఈ గ్రంథ ఆవిష్కరణసభకు అధ్యక్షత వహించుటకు అఖిలభారత పద్మశాలి మహాసభాధ్యక్షులు 'పద్మశాలి కులరత్న' బిరుదాంకితులునగు శ్రీమాన్ ఆకురాతి రంగనాయకులుగారు దయతో నంగీకరించిరి. ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గములో జనసంబంధశాఖామాత్యులగు శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీగారు గ్రంథావిష్కరణమును గావించుటకు దయతో నంగీకరించిరి.

అఖిలభారత పద్మశాలి మహాజన సభ వారి అభిమతానుసారము ఈ గ్రంథమును పరిష్కరించుటయేగాక ఈ గ్రంథమునకు అమూల్యమైన పీఠికను కూడ వ్రాసియిచ్చిన కావ్యస్మృతిపురాణతీర్థ కీ. శే. బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారికి అఖిలభారత పద్మశాలి మహాజన సభవారి పక్షమున కృతజ్ఞతను వెల్లడిచేయుచున్నాను. వారి పీఠికను ఇందు ప్రకటించుచున్నాను. ఈ గ్రంథమును అనతికాలములోనే ముద్రణ చేయించి యిచ్చిన కాకినాడలోని

మాస్టర్ మన్ ముద్రాలయాధ్యక్షులగు శ్రీ పి. కృష్ణమూర్తి, బి. ఎ. గారికి కూడా నా అభివందనలను తెలియజేయుచున్నాను.

ఇట్లు ఇంతవరకు ఈ గ్రంథ సంస్కరణమునకును, ముద్రణమునకును, ఆవిష్కరణమునకును, సమస్తవిధముల తోడ్పడినవారి కందరకును నా కృతజ్ఞత నిందుమూలముగా తెలియజేయుచున్నాను.

ఇట్లు,

సౌమ్యసంవత్సర చైత్రశుద్ధ పాడ్యమి బుధవారము 19—3—1969.

కార్యంపూడి నాగేంద్రుడు,
అధ్యక్షుడు, గ్రంథసంస్కరణ సంఘము,
రామారావుపేట, కాకినాడ-4.

—/-

# పీ ఠి క

**పుణ్యాత్మకులారా! సత్యాన్వేషణ తత్పరులారా!**

ప్రపంచము చిత్రము. తత్పరిణామ మత్యంతచిత్రము. దానిమూల మా భగవంతునకు దప్ప నితరులకు దెలియ దనుట నిక్కము. తెలియునన్న నతిశయోక్తియేగాని స్వభావోక్తి కాదు. ఒక్క కాలమున నొక్కలోకమున నొక్క భాగము వృద్ధిగాంచును. వేరొక్క భాగము క్షీణించును. మరల నవి రెండును వృద్ధిక్షయముల మార్పుకొని వెలయును. కారణ మేమని యాకసముకేసి దృష్టి నిగుడించిన గాఢాంధకారమున మునుంగుటయే ఫలమగుంగాని వేరొక్క ఫలముఁ గాంచ ననువుపడదు. ఎందరో విమర్శకులు హస్త దృష్టిశిరశ్చాలనము లందమవై శద్యమును జూపుచు నపూర్వ విషయములఁ బరీక్షించినట్లు తెలుపుదురు. కాని యవి సామాన్యులకుం గూడ దోచునవియే కాని బ్రహ్మాండముల బ్రక్కలించిన వారికి మాత్రమే గోచరించునవి కావు. భాషా భేదమే కాని విషయము సామాన్యులకుం గూడఁ దెలిసినదియే. యోగదృష్టి నెఱింగినవి మాత్రము కావు. ఏక్రొత్త సిద్ధాంతమైనను బ్రాచీనులు చేసిన సిద్ధాంతములలో నంతర్భూతమే యగును.

నవద్వీపములని, నవద్వయ ద్వీపములని ప్రపంచము విభజింపబడినది, ఆద్వీపము లన్నింటియందు మానవుల

యాచారములు వేఱువేఱుగ నుండును. సామ్యము తెలు
చుగాఁ గానరాదు

అత్రవో వర్ణయిష్యామి వర్షేఽస్మిన్ భారతే ప్రజాః ।
ఇదంతు మధ్యమం చిత్రం శుభాశుభ ఫలోదయం ॥ ౪
నిరుక్తవచనాచ్చైవం వర్షం తద్భారతం స్మృతం। ౫
ఇత స్స్వర్గశ్చ మోక్షశ్చ మధ్యశ్చాంతశ్చ గమ్యతే ।
నఖల్వన్యత్ర మర్త్యానాం భూమౌ కర్మవిధీయతే । ౬
ద్వీపోహ్యుపని విష్టోయం మ్లేచ్ఛైరంతేషు సర్వశః ।
పూర్వాం కిరాతాహ్యస్యాంతే పశ్చిమే యవనా
స్స్మృతాః । ౧౨

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా మధ్యే శూద్రాశ్చ
భాగశః ।
ఇజ్యాయుధ వణిజ్యాభిర్వర్తయంతో వ్యవస్థితాః । ౧౩
తేషాం సం వ్యవహారోఽత్రవర్తతే వైపరస్పరం ।
ధర్మార్థకామసంయుక్తో వర్ణానాంతు స్వకర్మసు । ౧౪
సంకల్పః పంచమానాంచ హ్యాశ్రమాణాం యథావిధి ।
ఇహ స్వర్గాపవర్గార్థం ప్రవృత్తిర్యేషు మానుషీ ॥ ౧౫
బ్రహ్మాండ పురాణము ౪౯ అధ్యాయము.

ఇట్లే యెల్లద్వీపములకు భేదములు గలవు. భరత
ఖండమునందు మధ్యభాగముననుండు బ్రహ్మ క్షత్రియ
వైశ్య శూద్రులకే వేఱు వేఱు వృత్తులు కల్పింపబడియెను.

తక్కిన భాగముల మ్లేచ్ఛాదిజాతు లుందురు. కాన వారి కే కర్మములు విధింపబడలేదు. తక్కిన ఖండవాసుల కిట్టి భేదములు గానరావు.

స్మృతులలో దెల్పబడని జాతులు ప్రస్తుతము కొన్ని కలవు. అవి శూద్రజాతియం దంతర్భూతములని సామాన్యులచేఁ దలపఁబడుచున్నవి. ఆ జాతులలో నొక్కొక్క దాని కిని శూద్రజాతి విరుద్ధాచారములు కలవని కొందఱందురు. కారణములుకూడ గలవని వారే యనుచున్నారు. ఈ ప్రస్తావమునకు హేతువగు పద్మశాలిజాతి యొకఁడు కలదు. ఆ జాతికి వేదాధికారము కలదని యొకగ్రంథము ప్రకటింపబడినది. భావనాఋషి పురాణమని దానిపేరు. అయ్యది క్రీస్తుశకము (1893 సం॥ ఆగస్టు 30 వ తేది) విజయసంవత్సర శ్రావణమాసమునఁ జెన్నగరమున మాణిక్యమందిర ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది. సూతుడు శౌనకాది మహర్షులకుం దెల్పినట్లిందుగలదు. మార్కండేయపురాణాంతర్భూతమగు శ్రీ భావనాఋషి పురాణమనియు బొడకట్టెడిని. దిద్ది యిచ్చుటకు నాకడ కయ్యది చేర్పబడినది. దానితోఁడ దస్మ్యాలమగు తాటియాకుల పొత్త మొకండు పంపబడినది. ఆ తాటియాకులు ప్రాచీనములనియు బొడకట్టెడిని. దానియందు లేని విషయము లిందుగలవు. పంద్రెండు, పదుమూడు అగు నధ్యాయములు మూలగ్రంథమున లేవు. అచ్చు వేయించునపుడు పెద్దలెవ్వరో చేర్చిరని యూహింప

దగియున్నది. పదునొకండధ్యాయములయందు నందందు గొన్ని సవరణలు చేయఁబడి యుండెను. కొన్ని మూల గ్రంథము ననుసరించినవియే. కొన్ని ఛందోదోషముల వదలించునవి.

౦ ఇందలి కథాసారమును సంగ్రహించి తెలిపెదను. పంచపుట్రియను మునియు భావనాఖ్యమునియు మహాశూరులై యుండి నూతనసృష్టి నొకదాని నొనరింప నెంచి మార్కండేయమునివరు నానతిమెయి క్షీరాబ్ధియందు శయనించియున్న శ్రీ మహావిష్ణువుకడ కేగి వినుతించి మహాత్మా ! నీ నాభికమల సంభూతుఁడగు బ్రహ్మ సకలలోకములను సృజించెను. కాని మానవులకు వలయు వస్త్రములు నిర్మింపఁడు. ఆ సృష్టికి దేశికుఁడు కానరాఁడు. తంతువులు లేక వస్త్రముల నిర్మింప వలనుపడదుకదా. మాకు దంతువుల నొసంగుమని యాచించిరి. వారి ప్రార్థనలకు నానందించి స్వనాభికమల నాళమునుండి తంతువులందీసి వారల కొసంగెను.

ఇత్యుక్తః పరమప్రీతో హరి రాలోచ్యవై తదా।
స్వనాభి పద్మనాళస్య తంతూన్ కాభ్యాః దదౌ తతః॥౪౩
స్మేరా నన స్తత శ్చాహవచనం స ప్రతిజ్ఞకం।
భవత్కులప్రసూతాయే తే సర్వే మామకాస్స్మృతాః॥
త్వదాది మానాం సర్వేషాం శేస్యుః పద్మతంతవః।
కోశస్య వాసుదేవీయో మదీయాస్య త్కులోద్భవాః॥

యువాంతుకులజా తా నామాదౌ పూజ్యౌ భవిష్యథః ।
భవంతౌ కులదేవౌ చ యువయోర్మహిమాపరః । ౪౯
యువాంతు పద్మకోశీయైః పూజనీయౌ ద్విజాదిభిః ।
యోహ్యేన పూజయత్యేతౌ మమద్రోహీ భవేద్ధ్రువం॥ ౫౦

* * * *

ఏతేష్వబ్జ తంతవోపి రా ప్రభయా విశదాస్సదా ।
సత్వస్వభావాదృశ్యంతే హ్యతోహంసా ఇవాభవన్ ౫౧
యదర్థం జన్మసంప్రాప్త భవతోర్మునిసత్తమాత్ ।
అచిరేణైవకురుతం బ్రహ్మణా సమచోదితం । ౫౩
ఆతస్సర్వగుణోపేతాన్ తంతూన్ సంగృహ్య

వై యువాం ।
గచ్ఛతాం కనకాద్ర్యాఖ్యాం పురీమితితదాహరిః ॥ ౫౪
ప్రేషయామాసతౌ వీరౌ నిపృత్య కలశాంబుధేః ।
తతోభూమింగతౌ వీరౌ స్మారంస్మారం వచోహరేః ॥
ప్రాప్తౌ చ కనకాద్ర్యాఖ్యాం బ్రహ్మణా నిర్మితా పురీం ।
స్వర్ణశాల సమాయుక్తాం స్వర్ణహర్మ్యోపశోభితాం॥ ౫౬
విచిత్రభవనోపేతామలకేవ భవంగతాం ।
తతః పంచపుటీ ధీమాన్వాక్యమేతదువాచహ । ౫౭
భావనా వీరవీరేశ శృణు మద్వచనం హితం ।
తంతుభిర్వర్ణనాదత్తైః ప్రతిద్వయం సమాహితైః ॥ ౫౮
వస్త్రాణి చ విధాయత్వం విష్ణవే శంకరాయ చ ।
బ్రహ్మణేచ దేవేభ్యో హ్యన్యేభ్యో దాతుమర్హసి॥
౫౯

సర్వేషాం ప్రీతిపాత్రం వై భవాన్ భవితుమర్హసి ।
గచ్ఛామ్యహం బలిం జేతుం జిత్వాతం సర్వతోదిశం॥ ౬౦
చరామి వ్యవహారార్థ మర్థసాధన తత్పరః ।
ఇత్యుక్త్వా భావనావీరం గతః పంచపుటి స్తదా ॥ ౬౧
తతఃస భావనావీరః స్మృత్వా మనసిచ స్వయం ।
విద్యాలాభాయ గతవాన్ కైలాసే శివసన్నిధిమ్॥ ౬౨

* * * *

నమస్తే గిరిజానాథ విజ్ఞప్తి మవధారయ ।
హరిర్మే పరమప్రీత్యా ప్రాదాత్తంతూన్ పరః పుమాన్॥ ౬౪
శాంభవీంభోభవ ద్విద్యాం దాతుమర్హసి శంకర ।
ఇత్యుక్తః ప్రత్యువాచైవం శివస్తం భావనామునిం॥ ౬౫

* * * *

అగ్రహీత్పరమాం విద్యాం ఈశ్వరస్య నియోగతః ।
తతోగత్వాఽన యావీరః కరకాద్రి పురంతథా ॥ ౭౪

*

హరే మురారే దేవేశ విజ్ఞప్తి మవధారయ ।
త్వదాజ్ఞయాహం సంగృహ్య తంతూన్ త్వన్నాభి సంభవాన్ ॥ ౭౭
నివేద్యభర్గే వృత్తాంతం విద్యాప్రాప్తా తతోమయా ।
అతః పుష్పాణి వస్త్రాణి శాంభవ్యా విద్యయాహరే। ౭౮
త్వం గృహాణేప్సితం వస్త్రం కర్మమే సఫలం కురు ।
ఏవముక్తః ప్రహృష్టాత్మా హరి స్తద్వస్త్ర సంచయమ్ ౭౯

విలోక్యజగృహే తస్మిన్ పీతం వసన మాదరాత్ ।
ధృత్వాకటితటే విష్ణుర్విద్యుత్వానివతోయదః ।
బాలాతపేన సంపీతో నీలోగిరి రివాబభౌ । ౧౦

* * * *

అద్యప్రభృతి లోకేషు త్వత్కులేయేచ సంభవాః ।
తే సర్వే పద్మశాలీయాః మత్ప్రసాద బలేనచ ।
'బహూత్తమా' ఇతి ఖ్యాతా భవే యుర్మదను
గ్రహాత్ ॥ ౧౭

విష్ణుధ్వజం దధానాస్తే భవనా! మదనుగ్రహాత్ ।
కీర్తయంతు పరం సర్వే ప్రసిద్ధం తే యశోభువి । ౧౮

* అధ్యాయము ౫

కాశ్మీర గౌడ వంగాంగ కళింగ కురుపాండుషు ।
సంచార్య తనయైస్సాకం విచార్య చ ముహుర్ముహుః॥౧౦
వానప్రస్థాశ్రమస్థాన సద్బ్రహ్మ మునికన్యకాః ।
సమ్మతేస్తత్ర వేదోక్త విధి నాకృత కౌతుకాన్ ॥ ౧౧
తత్తద్దేశేషు తనయాన్ నివేశ్య ముదితః పునః ।
ప్రవిశ్యస్వపురీం వీరో శిష్టాన్ పుత్రాన్ వివాహయన్ ।
నాసత్యదేవ దుహిత్రారూప యౌవనశాలినీః ।
వేదోక్త సద్విధానేన శుభలగ్నే శుభేదినే ॥ ౧౩
వివాహం కారయామాస మునిస్స్వజన సమ్మతః ।
తేషాం పుత్రైః ప్రపౌత్రైశ్చ స్వవిద్యాకుశలైర్యుతః ।
భుక్త్వా భోగానసేకాంశ్చ చిరకాలం స్థితోభువి । ౧౪

* * * అధ్యాయము ౬

● అను నీ ప్రమాణము లా పురాణమునందు గలవు.
భగవంతుని నాభికమల్ల నాళములచే వస్త్రములు రచియించి

త్రిమూర్తులకు దక్కంగల దేవతలకు నొసంగినట్లు, వారి వర్త ములవలనఁ బద్మశాలీయులని భావనాముని వంశసంజాతులకు బేరలవడినట్లుఁ వారలకు వేదాధికారము కలిగినట్లు తేలెడిని. మునికన్యలను ముని తనకుమారులకు భార్యలుగా గ్రహించి నట్లును దత్పురాణము తెలుపుచున్నది.

మార్కండేయమునికి వీరి వంశములకు గల సంబంధ మేమని విచారించితిని.

ప్రాణశ్చైవ మృకండుశ్చ బ్రహ్మకోశో సనాతనః ।
మనస్విన్యాం మృకండస్య మార్కండేయో బభూవహ ।
సుతో వేదశిరా స్తస్య ధూమ్రవత్యామజాయత ।
పీవర్యాం వేదశిరసః పుత్రా వంశకరాశ్చ తాః ।
మార్కండేయాస్సమాఖ్యాతా ఋషయో వేదపారగాః

బ్రహ్మాండపురాణము ౧౧ అధ్యాయము,

ఈ ప్రమాణముల నాధారము చేసికొని యాలోచింపగా మార్కండేయులు వంశకర్తలై వేదపారగులైనట్లు తేలెడిని. వారి వంశసంభూతులు లోకమున వ్యాపించిరి. అను నీకథ నాధారము చేసికొని యీ పురాణము పుట్టి యున్నది.

వేదశిరసుని భార్య పీవరి. ఆమె తనయులే వంశకర్తలు. వారెల్లరు మార్కండేయులనఁబడుచు వేదవిదులై యుండిరి.

ఒక్క మునికి నామాంతరము గలుగవచ్చును. ఆ పద్ధతి ననుసరించి యీ పురాణమును నమ్మవలయును. కథాసంవిధానము మిక్కిలి చక్కగా నున్నది. పెక్కు స్థలము

లలో విచారించితిని. వారెల్ల మార్కండేయగోత్రమునే చెప్పిరి. "మార్కండేయాస్సమాఖ్యాతాః" అన్న వాక్యము ననుసరించి లోకమున మార్కండేయవంశ సంజాతు లనేకులు గలరని యెంచవలసియున్నది. ఈ పురాణ మాతృక యగు తాళపత్రగ్రంథము తన ప్రాచీనత్వమును స్వరూపముచేతనే వెల్లడించుచున్నది. దాని నాధారముగా నైకొన్న భావనాముని పుత్రపౌత్రాదులు వేదోక్తకర్మముల నాచరించినట్లు కన్పట్టుచున్నది.

ఈ పురాణమున నా చేసిన మార్పు లేవియు లేవు. ప్రాతపుస్తకమునగల విషయము లిందు గలవాయనియు క్రొత్తవి యేవేని చేర్పబడినవాయనియు బరిశీలించి క్రొత్త వానిని దీసివైచితిని. పొరపాటులను సవరించితిని. ఈ గ్రంథము పద్మశాలీయులకు వేదాధికారమును సూచించుచున్నది. వేదము క్రమముగా నశింపకుండుటకై కొందఱద్దానిం గోరునట్లు లాపరమేశ్వరు డొనరించెం గాబోలు. దురవగాహములగు వేదోక్త కర్మముల నవలంబింప బూనుటయే పద్మశాలీయుల శ్రద్ధాభక్తులను వెల్లడిచేయుచున్నది. భగవదనుగ్రహ ముండినగాని యే వాంఛితమైనను ఫలింపదు. అది యొదవెనేని లభింపరాని వాంఛితమే యుండదు. దాని కొఱకు బద్మశాలీయులు ప్రయత్నపడుదురుగాక. ఉత్తమవిఖ్యాతిం గాంతురుగాక.

ఇట్లు విన్నవించు విద్వద్విధేయుడు,
జనమంచి శేషాద్రిశర్మ.

# శ్రీ భావనాఋషి మాహాత్మ్యమ్

## ప్రార్థనాదికము

శ్లో॥ శుక్లాంబరధరం, విష్ణుం, శశివర్ణం, చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోప శాంతయే॥ ౧

శ్లో॥ యస్మాదిదం జగమజాయత యత్రతిష్ఠ్య ।
త్యం తే సమస్త మిదమస్త ముపైతి యత్ర ।
తస్మై నమస్సద సదాది వికల్పశూన్య ।
చైతన్యమాత్ర వపుషే పురుషోత్తమాయ॥ ౨

శ్లో॥ నమోనమః క్షయే సృష్టౌస్థితౌ సత్వమయా యవా ।
నమోరజస్తమస్సత్త్వ త్రిరూపాయ స్వయంభువే॥ 3

శ్లో॥ బ్రహ్మాణం లోకకర్తారం సర్వజ్ఞ ముపరాజితమ్।
ప్రభుం భూత భవిష్య స్యసాంప్రతస్యాచ సత్పతిమ్॥ ౪

మాతా తావదుమా, పితా పశుపతి భ్రాతా మయూరాసనః।
స్తోతాశ్చతురాననాది మరుతశ్చక్రాయుధో మాతులః।
బ్రహ్మానందమయం వపుర్భృహదహో భృత్యాగణాధీశ్వరాః।
శక్తాః కింతన సద్గుణా గ్గణపతే స్తోతుం వయం జంతవః॥ ౫

తా॥ తెల్లని వస్త్రమును ధరించినవాడును, చంద్రుని వంటి స్వచ్ఛమైన కాంతిగలవాడును, నాలుగు భుజములు గలిగియున్నవాడును, ప్రశాంతమైన వదనము కలవాడును అగు విష్ణువును విఘ్నశాంతి కొరకు ధ్యానించుచున్నాను. ౧

తా॥ ఎవ్వనివలన ప్రపంచము పుట్టెనో, ఎచ్చట స్థితిని పొందుచున్నదో, ఎచ్చట అంతమొందునో, అట్టి ఆద్యంతశూన్యుడైన పురుషోత్తమునకు నమస్కరించుచున్నాను. ౨

తా॥ సృష్టిస్థితిలయములందు జీవవ్యాపకుడై, సత్వరజస్తమోగుణరూపుడైన బ్రహ్మకు నమస్కారము. ३

తా॥ లోకకారకుడై, సర్వజ్ఞుడై, భూతభవిష్యద్వర్తమానములకు ప్రభువై పరాజితుడుకాని బ్రహ్మకు నమస్కారము. ౪

తా॥ ఓ గణేశా! నీకు తల్లి పార్వతి. తండ్రి ఈశ్వరుడు. అన్న కుమారస్వామి. స్తుతించువారు బ్రహ్మ మొదలగు దేవతలు. మేనమామ విష్ణువు. బ్రహ్మానందమయమైన శరీరము. సేవకులు ప్రమథాదిగణములు-అట్టి నీగుణములను స్తుతించుటకు మాకు శక్తి చాలదుకదా! ౫

—o—

# శ్రీ భావనా ఋషి మాహాత్మ్యము

## ప్రథమోఽధ్యాయః

## కథా ప్రారంభః

శ్లో॥ సర్వలోక కథాభిజ్ఞః సూతః పౌరాణికాగ్రణిః ।
నైమిశే సమువాచేదం శౌనకాదీన్ తపోధనాన్ ॥ ౧

తా॥ సకలలోకములందలి కథలను తెలిసినవాడును, పౌరాణికులలో శ్రేష్ఠుడునైన సూతుడు నైమిశారణ్యములో శౌనకాదిమహామునులకు ఇట్లు చెప్పినవాడాయెను.

శ్లో॥ పురాస్రష్టుం మతిం చక్రే భగవాన్ పద్మసంభవః ।
అభిధ్యాయ మహాబుద్ధా స్వతుల్యాన్ మానసాత్మజాన్ ౨

తా॥ పూర్వకాలమున పద్మమునుండి పుట్టిన బ్రహ్మ ధ్యానముచేసి తనతో సమానులయిన మానసపుత్రులను సృష్టించుటకు నిశ్చయించెను.

శ్లో॥ భృగ్వంగిరోమరీచీంశ్చ పులస్త్యం పులహంక్రతుమ్ ।
దక్షమత్రిం వశిష్ఠంచ నిర్మమే మానసాత్మజాన్ ॥ 3
నవ బ్రహ్మాణ ఇత్యేతే పురాణే నిశ్చయం గతాః ।
భృగోః ఖ్యాతి రభూత్తస్య చేశ్వరౌ సుఖదుఃఖయోః॥ ౪
శుభాశుభప్రదాతారౌ సర్వప్రాణ భృతామిహ ।
దేవౌ ధాతృ విధాతారౌ మన్వంతర విచారిణౌ ॥
తయోర్జ్యేష్ఠాతు భగినీ దేవీశ్రీర్లోకవిశ్రుతా ॥ ౫

సాతు నారాయణం దేవం పతిమాసాద్య శోభనా ।
నారాయణాత్మజౌ తస్యాం బలోన్మాదావ్యజాయతామ్॥ ౭

తా॥ భృగువు, అంగిరస్సుఁడు, మరీచి, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, దక్షుఁడు, అత్రి, వసిష్ఠుఁడు ననుచు నీతొమ్మండ్రుగుఱ్ఱను, మానసపుత్రులను గాంచెను. వారు నవ బ్రహ్మలని పురాణములయందు నిర్ణయింపఁబడిరి. భృగు మహర్షికి ఖ్యాతియందు సుఖదుఃఖములు గల్గింప ప్రభువులై దేవతలగు ధాతయు విధాతయు ననువారు మన్వంతరముల యందెల్ల నెల్లయెడలఁ దిరుగ సమర్థులగువారు తనయులు గల్గిరి. వారికంటెఁ బెద్దదియై శ్రీదేవి కలిగెను. ఆమె లోకములనెల్ల విఖ్యాతిగలది. ఆ లక్ష్మి శ్రీమన్నారాయణ మూర్తిని భర్తనుగా వరించెను. ఆమెయందు దానారాయణ మూర్తి బలోన్మాదులను తనయుల నిరువురం గాంచెను.

శ్లో॥ బలస్య తేజః పుత్రస్తు ఉన్మాదస్య చ సంశయః ॥
తస్యాన్యే మానసాః పుత్రా ఆసన్ వ్యోమవిచారిణః॥ ౭

యేవ హంతి విమానాని దేవానాం పుణ్యకర్మణామ్ ।
మేరు కల్పే స్మృతే భార్యే విధాతుర్ధాతురేవచ ॥ ౮

ఆయతిర్నియతిశ్చైవ తయోః పుత్రౌ దృఢవ్రతౌ ।
ప్రాణః శ్చైవ మృకండశ్చ బ్రహ్మకోశౌ సనాతనౌ ॥
మనస్విన్యాం మృకండస్య మార్కండేయో బభూవహ॥ ౯

తా॥ బలునకు తేజుఁడు కుమారుడు. ఉన్మాదునకు సంశయుఁడు కొడుకు. ఆతనికిని బౌక్రుంద్రు మానసపుత్త్రి లుండిరి. వారంబర సంచారులు. పుణ్యాకర్మములు చేసిన వారికి విమానములను వారే నిర్మింతురు. ధాతకు విధాతకు ఆయతి నియతియునను పేరుగల భార్యలుండిరి. ఆ యిద్దరు స్త్రీలును మేరుసమాన ధైర్యవతులు. వారి కిద్దరు కుమారులు. వారు నియతవ్రతులు. ప్రాణుఁడని మృకండుఁడని వారిపేరులు. వారు బ్రహ్మజ్ఞాన సంపన్నులు. శాశ్వతముగా నుండువారు. మృకండముని మనస్వినియను పేరుగల భార్యయందు కుమారుని గాంచెను. మార్కండేయుఁడని యాతని కిం బేరు గల్గెను.

ఋషయ ఊచుః = మును లిట్లు ప్రశ్నించిరి.

శ్లో॥ సూతసూత మహాప్రాజ్ఞ మృకండస్య మహామునేః ।
మరుద్వతీ సమాఖ్యాతా భార్యా సీదితి నశ్శ్రుతమ్॥ ౧౦
మనస్వినీ సమాఖ్యాతా భార్యే దానీం త్వయామునే।
ఉత్కంఠితమిదమాశ్చర్యం సంశయం ఛేత్తుమర్హసి॥ ౧౧

తా॥ మహాప్రాజ్ఞుఁడవగు నో సూతమునీ! మృకండమునికి మరుద్వతియను భార్యగలదని మేము వినియుంటిమి. ఇపుడు నీవు మనస్విని మృకండముని భార్యయని తెల్పితివి. ఇదెంతయు నాశ్చర్యము. ఈ సంశయమును దొలగింపుము.

సూత ఉవాచ = సూతముని బదులు చెప్పెను.

శ్లో॥ మరుద్వతీ తితస్యాశ్చ నామాంతర ముదీరితమ్ ।
మనస్వినీతి విఖ్యాతం నామలోకే సువిస్తృతమ్ ।
సాతు ముద్గల పుత్రీ స్యాచ్ఛుచివ్రత పరాయణా ।
ఇదానీం వచ్మి తద్వృత్తం సమస్త కలుషాపహమ్॥ ౧౨

తా॥ మునులారా మృకండముని భార్యకు మరుద్వతి యను నొక పేరుకూడ గలదు. మనస్విని యను పేరే లోకమున మిగుల విఖ్యాతి నొందెను. కావున ముద్గలముని కూతురగు నామె వృత్తాంతము పాపముల పోగొట్టఁజాలును. కాన వచించెద. ఆలకింపుడు.

శ్లో॥ మృకండముని వర్యస్తు విజితాత్మా దయానిధిః ।
శాంతో దాంత స్సర్వభూతహిత కార్యపరాయణః॥ ౧౩
మనస్వినీ సమాయుక్త శ్శుచిః పూజారతస్సదా ।
తపస్తేపేదురాధర్షే పావనే తాపసాశ్రమే । ౧౪

తా॥ మనస్సును జయించినవాఁడును, దయాసముద్రుడును, శాంతుడును, అంతరింద్రియనిగ్రహము కలవాఁడును, సకల భూతములకు మేలుచేయుటయందాసక్తి కలవాఁడును అగు మృకండమహాముని మనస్వినియను పేరుగల భార్యతోగూడి పరిశుద్ధుఁడై ఎల్లప్పుడును భగవదారాధనయందాసక్తి కలవాడై, ఇతరులచే తిరస్కరింపఁదగని పరిశుద్ధమైన మునుల యాశ్రమమునందు తపస్సును చేసెను.

శ్లో॥ కదాచి త్తస్య చిత్తేతు కాంక్షైకా సమ జాయత ।
కులోద్వహం పుత్రరత్నం ప్రాప్తుం లోకైకవిశ్రుతమ్॥౧౫
తదర్థం భార్యయా సార్ధం జగామ హిమవద్గిరిం ।
మహాముని సమాకీర్ణం నానాద్రుమలతాన్వితమ్ ॥ ౧౬
నానాశుభ పతం గైస్తు యుతం సర్వర్తుశోభనమ్ ।
సాధు శైవలినీసాంద్రం సర్వకామ సమృద్ధిదమ్ ।
దేవతాగణ సంకీర్ణం సిద్ధ చారణ సేవితమ్ ॥ ౧౭

తా॥ ఒకానొక కాలమందా మృకండముని మనమున నొక కోర్కె కలిగెను. కులోద్ధారకుఁడయి లోకప్రఖ్యాతిని బొందఁగల కుమారుని గాంచవలయునని.

ఆ వాంఛకొఱకు మనస్వినింగూడి హిమవత్పర్వతమునకుం బోయెను. ఆపర్వతమున నొక తాపసాశ్రమము గలదు. ఆ యాశ్రమమునందుఁ బెక్కండ్రు మహర్షులుండిరి. నానావిధములగు పావన వృక్షములు లతలు నుండెను. పెక్కు విధములగు పక్షులుండెను. సర్వర్తు లక్షణము లందుఁ గనబడుచుండెను. పుణ్యనదులు ప్రవహించుటంజేసి యెంతో మనోహరముగా నుండెను. సర్వవాంఛలు ఫలించునను భావన కలిగించుచుండెను. దేవతలు గుంపులుగా నందందు దిరుగాడుచుండిరి. సిద్ధులు చారణులా యాశ్రమమును భజించుచుండిరి. అట్టి యాశ్రమమును మృకండుడు గాంచెను.

శ్లో॥ తత్రగత్వానదీతీరే పావనే తాపసాశ్రమే।
వాసం కృత్వా కళత్రేణ సహితో నియతేంద్రియః॥ ౧౮
వాము భక్తి శ్శాంత మతి స్తప స్తేపే దురాసదమ్।
మనసా చింతయన్ విష్ణుం సర్వలోకేశ్వరేశ్వరమ్॥ ౧౯
లక్ష్మీపతిం దివిషదామాధారం శాంతనీరధిం।
సర్వభూత హితార్థాయ వైకుంఠే లోకవిశ్రుతే॥ ౨౦
వసంతం జగతాం నాథం కరుణావార్ధి మీశ్వరం।
చిరకాల తపోధ్యాననియమై రర్చితో హరిః॥ ౨౧
లక్ష్మ్యా సాకం వైనతేయ మారూఢః పార్షదైస్సహ।
ఆగత్య మునిశార్దూలం బభాషే నియతవ్రతమ్॥ ౨౨

తా. హిమాలయమున నొక నదీతీరమునఁగల మహర్షులు తపస్సు చేయుటంజేసి పవిత్రమగు తావున ధృఢమనస్కుఁడై తపస్సానరింపఁగా నా నియతికి మెచ్చి శ్రీహరి మహాలక్ష్మింగూడి గరుత్మంతు నెక్కి భక్తులు జయజయ నినాదము లొనరించుచు వెంటరాఁగా, నా ముని కడకు వచ్చి యిట్లు భాషించెను.

శ్లో. మునివర్య ప్రసన్నోఽస్మితపసా తవసువ్రత।
వరం తే సంప్రదాస్యామి యథాకామం వృణుష్వతం॥ ౨౩
ఇత్యుక్తవతి లక్ష్మీశే కరుణాబ్ధౌ మహాత్మని।
సంప్రహృష్టమనా మునిః కృతాంజలి రథాబ్రవీత్॥ ౨౪

తా. మునివర్యా! "నీ తపస్సునకు మెచ్చితిని. వరమీయ వచ్చితిని. నీవేమి కోరదలతువో దాని నడుగుము."

అని శ్రీమన్నారాయణమూర్తి పలుకగా నాముని సంత సించి దోసిలిబట్టి యిట్లు పలికెను.

శ్లో. నారాయణ పరంధామ పరమాత్మన్ సనాతన ।
వేదాద్యగోచర శ్రీమన్ననంత గుణసాగర ॥ ౨౫
లక్ష్మీశ సచ్చిదానంద సర్వ కారణ కారణ ।
దేవాదిదేవ బ్రహ్మాండనాయకాచ్యుత శంకర ॥ ౨౬
త్వత్పాదాంభోజ యుగ్మస్య దర్శనాద్వాంఛితం మమ ।
సఫలం సమభూద్బ్రహ్మన్ కిం వృణోమి వరాంతరమ్॥ ౨౭

తా. జలము నివాసముగాగల్గి, అవ్యక్తధామముగల్గి, పరమాత్మ స్వరూపుఁడవై, శాశ్వతుఁడవై, వేదాదులచే తెలియబడక, ఐశ్వర్యవంతుడవై, చెప్ప శక్యముకాని గుణ ములకు సముద్రునివంటి వాఁడవై, లక్ష్మీనాయకుఁడవై, ఎల్లప్పుడును ఆనందముతో గూడియుండి, జగదాదివై, దేవ తలలో నాదిదేవుఁడవై, సకల ప్రపంచ పాలకుఁడవై సుఖ ములను కలుగజేయువాడవై విలసిల్లు ఓ విష్ణు భగవానుఁడా! నీ పాదపద్మముల దర్శనముచేతనే నా వాంఛ సఫలమా యెను. ఓ భగవానుఁడా! ఏవరమును కోరుకొందును ?

శ్లో. తథాపి త్వాంతు యాచేఽహం కుమారం కులవర్ధనమ్ ।
సర్వశాస్త్రార్థవిద్వర్యం వేదవేదాంగపారగమ్ ॥ ౨౮
దీర్ఘాయుషం మహాశాంతం మునీంద్ర గణసేవితమ్ ।
త్వత్పాద భక్తి నిరతమానసం సుగుణాకరమ్॥ ౨౯

తా. అయినను నిన్ను నే నీవిధముగ గోరుచున్నాను. వంశోద్ధారకుఁడయి, సర్వశాస్త్రార్థవేత్తలలో శ్రేష్ఠుడై, వేదములను, వేదాంగములను జక్కగా నభ్యసించినవాడై, పరమశాంతుడై, మునిశ్రేష్ఠులతో సేవింపబడుచు, నీపాదములను సేవించుటయం దాసక్తి కలవాడై, సకల సద్గుణములకు నాధారభూతుడై యుండు కుమారుని పొందగోరుచున్నాను.

శ్లో. ఏవం ప్రార్థయమానంతం మృకండ మునిసత్తమమ్ ।
వీక్ష్య ధ్యానం సమాస్థాయ క్షణకాలమువాసహ ॥ ౩౦
తదైవావిర్భూద్రుద్రో మహాదేవోఽంబికాయుతః ।
మునివర్యగణైస్సార్థం ప్రమథైస్సహితోవశీ ॥ ౩౧

తా. ఈ విధముగ ప్రార్థించుచున్న మృకండ మహర్షిని జూచి విష్ణువు కొద్దికాలము ధ్యానము నభినయించెను. అప్పుడే పార్వతితోఁగూడి, మునీంద్రులతోను, ప్రమథగణములతోను కూడినవాడై జితేంద్రియుఁడైన యీశ్వరుఁడు సాక్షాత్కరించెను.

శంకర ఉవాచ : శివుడు పలికెను.

శ్లో. మహామునే మహాప్రాజ్ఞ సర్వవేదాంగ విత్తమ ।
మహాభాగ్యయుతోఽసిత్వమ్ భగవత్కరుణాదిహ॥ ౩౨
ఆగతోరమయా సర్వపార్ష దైరన్వితోహరిః ।
కిం తేఽధికం మహాభాగ్యమే తస్మాద్వద సువ్రత॥ 33

ఆహూతో౽హం విష్ణునాద్య కైలాసాద్రష్టుమాగతః ।
త్వన్నిమిత్తేన మౌనీంద్ర సర్వోత్తమ మరిందమమ్॥ 34
ప్రోత్సాహిత శ్చక్రిణాత్వాం బ్రవీమి బ్రహ్మవాదిప ।
పూర్వస్మిన్ జన్మనిభవాన్ దుష్కృతంకృతవాన్మహత్ ॥35
తేన పుత్ర మహాభాగ్యవియుతో౽స్మిన్ భవేమునే ।
తద్దోషదుఃఖం లభసే పుత్రమూలాది హాక్షితౌ ॥ 36
ఏవం బ్రువంతం శ్రీమంతం మహాదేవం జగత్పతిం ।
శంకరం భక్తసులభం బభాషే మునిపుంగవః ॥ 37

తా. మహాప్రాజ్ఞుఁడవైన యో మృకండుమహామునీ! నీవు వేదవేదాంగ పారగులలోను త్తముఁడవు. గొప్ప అదృష్ట వంతుఁడవు గాన శ్రీపతి యనుగ్రహము గలవాడవైతివి. మహాలక్ష్మిం గూడి సర్వపార్షదులు వెంటరాఁగా శ్రీమన్నారాయణమూర్తి వేంచేసెను. ఇంతకంటె నీకు గొప్ప యదృష్టము గలదా, వచింపుము. భగవత్సందర్శనమును మించిన భాగ్యము ప్రపంచమున లేదని యెఱుంగుము. నేను శ్రీ మహావిష్ణువుచే సంకల్పింపబడి పిలువఁబడిన వాఁడనై కైలాసాచలమునుండి వచ్చితిని. నీకారణమున సర్వోత్తముని శ్రీహరిని దర్శింపవచ్చితినని యెరుంగుము. విష్ణువుచేతను ప్రోత్సహించబడిన వాడనై నీకొకమాట చెప్పుచున్నాను. ఆలకింపుము. నీవు పూర్వజన్మమున గొప్ప పాపము నొకదానిం జేసితివి. ఆకారణమున నీకీ జన్మమునఁ బుత్రప్రాప్తి

లేదయ్యెను. అందువలన ఈ జన్మలో దుఃఖముననుభవించుచున్నావు. పుత్రవిషయక దుఃఖము తప్ప వేరొక పాపమూలక విచారము నీకు లేదు. అని శంకరుడు పలుకుచుండఁగా విని మహాదేవుఁడనంబరగి జగన్నాథుఁడై సుఖప్రదాతయై భక్తులకు సులభముగా దర్శనమిచ్చు పార్వతీపతిం గాంచి మృకండముని యిట్లు పలికెను.

శ్లో. కృతం కింకర్మ లోకేశ మయా ఘోరతరం విభో ।
తస్యానపత్యతారూపఫలం ప్రాప్తమితీరితమ్ ॥ ౩౮
కేనోపాయేన ముక్తిం హి లభేయం కర్మబంధనాత్ ।
తముపాయం వద స్వాద్య దేవదేవ మహాప్రభో ॥ ౩౯
ఏవం సంప్రార్థయం తం తం మృకండముని సత్తమం ।
ప్రోవాచ భగవాన్ శంభుర్మునే శృణుహితం వచః ॥ ౪౦

తా. లోకాధిపతివైన ఓ ప్రభూ! నాచే మిగుల భయంకరమైన కర్మ చేయబడుటచే సంతానహీనత యను ఫలము పొందబడినదని చెప్పితివి. ఏ యుపాయముచేత ఆ బంధమునుండి విముక్తి నొందుదునో చెప్పుము. ఈవిధముగ వేడుచున్న మృకండ మునిశ్రేష్ఠునిగూర్చి శంకరుడీవిధముగ పలికెను. ఓ మహర్షీ! మేలు కలిగించు మాటను వినుము.

శ్లో. పురాజన్మాంతరం ప్రాప్య భవాన్ విపినమధ్యతః ।
దృష్టవానసి సంయోగ తత్పరం పక్షియుగ్మకమ్ ॥ ౪౧
చాపల్యాల్లోష్టకాష్ఠాద్యైస్తాడితం తత్త్వయామునే ।
వియోగం ప్రాప తస్మాద్ధి పాపాదేవానపత్యతా. ౪౨

సంప్రాప్తా పూర్వజన్మోత్థం ఫలం కేనాపి కారణాత్ ।
యస్మాదపి న భుక్త్వా తన్నయాతీతి వినిశ్చితమ్ ౪౩

తా. నీవు పూర్వజన్మలో నొకనాఁడు అడవి మధ్య నుండి వెళ్లుచుండగ సుఖమునం దాసక్తిగల యొక పక్షుల జంటను చూచితివి. అప్పుడు నీవు చంచలస్వభావమువలన ఆ పక్షుల జంటను కఱ్ఱలు మట్టి మొదలగువానిచే కొట్టితివి. అప్పుడు పక్షులజంట విడిపోయెను. ఆ కారణమువలననే నీకు సంతానము లభించలేదు. గత జన్మయందలి ఫలము ఈ జన్మలో ననుభవింపక తీరదుగదా! ఇది నిశ్చయము.

శ్లో. అథ తస్య వచశ్శ్రుత్వా పరమేశస్య శూలినః ।
అబ్రవీత్ప్రశితో వాక్యం మునివర్యో మహామనాః॥ ౪౪
అపత్య భాగ్య సంప్రాప్తిః కథం దేవ భవిష్యతి ।
వక్తవ్యం సాధువాక్యం తచ్ఛ్రోతుమిచ్ఛామిశంకర!॥ ౪౫
ఏవం బ్రువతి విప్రర్షౌ ప్రాదురాసీన్నభస్థలాత్ ।
వాగేశా వాసుదేవస్య చాజ్ఞయా విస్ఫుటాక్షరా॥ ౪౬

తా. శూలధారియగు శివునియొక్క మాటను విని మృకండముని ఈవిధముగ పలికెను. ఓ ప్రభూ! సంతాన భాగ్యలాభ మేవిధముగ కలుగునో చెప్పుము. ఆమాటను వినుటకు కోరుచున్నాఁడను. ఈవిధముగ బ్రహ్మముని పలుకుచున్నవాఁడై యుండగ ఆకాశమునుండి విష్ణుదేవుని యాజ్ఞచే స్పష్టమైన యక్షరములుగల మాటపుట్టెను.

శ్లో. స్తువ దేవం మహాదేవం శంకరం లోకశంకరం ।
తేన దోష వినాశస్స్యా త్సంశయోనాస్తి పార్థివ॥ ౪౭
ఏషశ్రీజాని సందేశ ఇతి వాక్సమజాయత ।
తాంశ్రుత్వామధురాంవాచంస్తోతుంయత్నపరోఽభవత్ ॥౪౮

తా. ప్రకాశమానుఁడై, దేవతలలోనెల్ల నుత్తముఁడై లోకమునకు సుఖమును కలిగించు శంకరుని నుతించుము. ఆ స్తోత్రముచే నీపాపము నశించును. ఓ రాజా! ఇందు సందేహ మేమియు లేదు. ఇది విష్ణుభగవానుని నాజ్ఞ అను మాట వినబడెను. ఆ మాటను విని మృకండుఁడు శంకరుని స్తుతించుటకు ప్రయత్నించినవాఁడాయెను.

మృకండముని రువాచ = మృకండముని పలికెను.

శ్లో. నమో దేవాది దేవాయ మహాదేవాయ తే నమః ।
త్ర్యంబకాయ నమస్తుభ్యం త్రిశూలవర ధారిణే॥ ౪౯
నమోదిగ్వా సనే తుభ్యమ్ వికృతాయ పినాకినే ।
సర్వప్రణత దేహాయ స్వయమప్రణ తాత్మనే॥ ౫౦
అన్తకాన్త కృతే తుభ్యం సర్వసంహరణాయచ ।
నమోస్తు నృత్తశీలాయనమో భైరవరూపిణే॥ ౫౧
నరనారీ శరీరాయ యోగినాం గురవేనమః ।
నమోదాంతాయశాంతాయతాపసాయ హరాయచ॥౫౨
విభీషణాయ రుద్రాయ నమస్తే కృత్తివాససే ।
నమస్తే లలితానాథ శ్రీకంఠాయచ తే నమః ॥ ౫౩

అఘోర ఘోరరూపాయ వామదేవాయతే నమః ।
నమః కనకమాలాయ దేవ్యాః, ప్రీతికరాయచ॥ ౫౪
గంగా సలిల ధారాయ శంభవే పరమేష్ఠినే ।
నమోఽస్తు గోధిపతయే బ్రహ్మాధిపతయేనమః ॥ ౫౫
ప్రాణాయచ నమస్తుభ్యం నమోభస్మాంగధారిణే ।
నమస్తే ఘన వాతాయసంష్ట్రిణే వహ్నిరేతసే । ౫౬
బ్రహ్మణశ్చ శిరోహంత్రే నమస్తే కాలరూపిణే ।
ఆగతంతేన జానీమోగతిం నైవచ నైవచ । ౫౭

తా. దేవతలకు దైవమై, మూడు నేత్రములు కలిగి, త్రిశూలమను నాయుధమును ధరించి, దిక్కులు వస్త్రములుగా గలిగి, అనేక విధములుగ మారుచు, పినాకమను ధనుస్సును ధరించి ఎల్లప్పుడును నమస్కరింపఁదగి, ఇతరుల కెవ్వరికిని నమస్కరించక, యమునకు నాశనము గల్పించి సర్వమును నాశనముచేయుచు, నాట్యమున ఆసక్తి గలిగి, భయంకరాకారమును దాల్చి, ఓర్పు కలిగి, భక్తుల బాధలను తొలగించుచు శత్రువులను బాధించుచు గజచర్మమును ధరించి, కంఠమున విషమును నిలుపుకొని, సాధువులయందు సౌమ్యాకారము, దుర్జనులయందు భయంకరాకారముఁ గలిగి, బంగారు హారము కలిగి, పార్వతికి సంతోషమును కలిగించుచు, గంగానదిని ధరించి, లోకాధిపతియై, జ్ఞానాధి నాథుడై భస్మము దేహమునకు పూసికొని, ప్రళయకాల

వాయుస్వరూపుడై, అగ్నిశుక్లము కలిగి, బ్రహ్మయొక్క పంచమ శిరస్సును ఛేదించి, కాలస్వరూపుడవై యున్న ఓ శంకరా! నీకు నమస్కారము. నీరాకపోక లెవ్వరికిని తెలియవు.

శ్లో. ఇత్యేవ ముక్త్వాసమునిః ప్రణనామ ముహుర్ముహుః।
తముత్థాప్య పరాం ప్రీతి మవాప్య పరమేశ్వరః॥ ౫౮
మాభూచ్చింతా బ్రహ్మమునే తవేతః ప్రభృతి ధ్రువమ్।
ఆశిషం తే ప్రదాస్యామి సత్యం సత్యం బ్రవీమి తే॥ ౫౯

తా. అని పలికి యా మృకండముని మాటి మాటికి నమస్కరించెను. ఆమునిని లేవనెత్తి పరమానందము నొంది భగవంతుఁడగు శంకరుఁడు "ఓ బ్రహ్మ మునివర్యా! నీకిఁక చికిత కలుగదు. ఇది మొదలు నిశ్చింతగ నుండుము. నేను నీకాశీర్వాదము లొసంగెదను. నామాట నిజము నిజము" అని పలికెను.

శ్లో. ఏతస్మిన్నంతరే విష్ణుః ప్రశస్య పరమేశ్వరం।
వరప్రదాతా భవతశ్శంకరః ప్రభవిష్యతి॥ ౬౦
ఏవముక్త్వా గతశ్శ్రీమాన్నిజధామ పరాత్పరః।
వైనతేయ సమారూఢః ప్రసన్నవదనాంబుజః॥ ౬౧

తా. ఇట్లు ముని శంకరుల సంభాషణము సాగుచుండు నరితలో విష్ణువు శంకరుని స్తుతించి, ఓమునీ! నీకు వరము నొసంగునాఁడు సంకరుడే అని పలికి లక్ష్మితో కూడినవాఁడై,

నిర్మలమైన ముఖము కలవాఁడై, గరుత్మంతు నెక్కి విష్ణువు తన నివాసస్థలమగు వైకుంఠమునకు వెళ్ళెను.

శ్లో. గతే తస్మిన్ జగన్నాథే దేవదేవే పరాత్పరే।
వైకుంఠం రమయా సార్థం శివం మహానివర్గో౽బ్రవీత్ ॥

తా. దేవాదిదేవుఁడై, ఉత్తములలో నుత్తముఁడగు విష్ణువు లక్ష్మితోఁ గూడ వైకుంఠమునకు వెళ్ళఁగా మృకండ మహర్షి శంకరుని గూర్చి పలికెను.

శ్లో. జయ దేవ మహాదేవ జయేశ్వర మహేశ్వర।
జయ సర్వసురశ్రేష్ఠ జయ సర్వ సురాధిప ॥ ౬౩

తా. మిక్కిలి శ్రేష్ఠుఁడవయిన ఓస్వామీ! సర్వోత్కృష్టుఁడవుగా నుండుము. ఉత్తమ ప్రభుఁడవైన పరమేశ్వరా! విజయము గలవాఁడవుగా నుండుము. సమస్త దేవతలలో నుత్తముఁడవైన యీశ్వరా! జయము కలిగి యుండుము. సమస్త దేవతలకు ప్రభువా! సర్వోత్కృష్టుఁడవుగా నుండుము.

శ్లో. జయ ప్రచుర నేత్రాగ్నే జయ ప్రార్థితదాయక।
క్వ దేవ తే పరంధామ క్వ వయం క్వ చనోవచః ॥ ౬౪

తా. నేత్రాగ్నిని ధరించిన యోస్వామీ! నీవు సర్వులకు కోరికల నిచ్చువాఁడవు. మిక్కిలి యుత్కృష్టమైన కైలాసమున నివసించు మీ రెక్కడ? మానవులమైన మే మెక్కడ? అయినను భక్తితో స్తోత్రము చేయు నన్ను కృపఁ జూడుము.

శ్లో. స్తోత్రేణ తేన సంతుష్టో మహాదేవోఽబ్రవీద్వచః ।
మత్తో వరం గృహాణేతి సోఽపి వవ్రే వరం మునిః ॥ ౬౫

తా. పిమ్మట మృకండు మహర్షి స్తోత్రమునకు మెచ్చి యీశ్వరుఁడు వరము వేడుమనగా నా ఋషిసత్తముడు వరమును కోరెను.

మృకండు రువాచ : మృకండుఁడు పలికెను.

శ్లో. అనపత్యో మహాదేవపుత్రం దేహి జగత్పతే ।
ఇతి తస్యవచః శ్రుత్వా ప్రోవాచ మహసాంనిధిః॥ ౬౬

తా. త్రిలోకనాథా! నేను సంతానము లేనివాడను. నాకు కుమారునినిమ్ము. అని పలుకగా మృకండ మహాముని యొక్క మాటను విని యీశ్వరు డీవిధముగ చెప్పెను.

మహాదేవ ఉవాచ : మహాదేవుడు పలికెను.

శ్లో. దాస్యామి నిర్గుణం పుత్రం యదీచ్ఛేచ్చిర జీవితం ।
అహోస్విద్గుణసంపన్నం సర్వజ్ఞం షోడశాబ్దికమ్ ॥ ౬౭

తా. ఓ మృకండు మహర్షీ ! గుణరహితుఁడైన చిరంజీవియగు పుత్రుని కోరెదవా ? లేక సమస్తము నెఱిగిన పదునారు సంవత్సరములు మాత్రమే జీవించు సుపుత్రుని కోరెదవా ? నీ యభిమతం బెఱిగింపుము.

శ్లో. ఇత్యుక్తస్సమునిః ప్రాహ నాహ మిచ్ఛామి నిర్గుణం ।
సర్వజ్ఞం దేహి మే పుత్రం దేవ బాల్యాయుషం మతమ్॥౬౮

తా. తదనంతరము మృకండు మహాముని యిటుల కోరెను. స్వామీ ! నిర్గుణుఁడు చిరంజీవి యైనను వలదు.

సర్వజ్ఞుఁడగు కొమారుఁడు అల్పాయుష్కుఁ డయినను వానినే యిమ్ము

శివ ఉవాచ = శివుఁడు పలికెను.

శ్లో. తర్హి తే భవితా ప్రాజ్ఞో జ్ఞానీ షోడశ వార్షికః ।
ఇత్యుక్త్వాం తర్ధధేశంభుః సోఽపిలబ్ధవరోమునిః ।
ప్రకామసంతుష్టమనాః ప్రయయౌ నిజమాశ్రమమ్॥౬౯

తా. ఈశ్వరుడు సకల సద్గుణ సంపన్నుడగు పుత్రుడు కలుగునని వరమిచ్చి అదృశ్యము కాగానే మృకండమహర్షి మిక్కిలి సంతసించినవాడై పూర్ణ సంకల్పము గలవాడై యాశ్రమమునకు పయనమాయెను.

ఇతి వ్యాసప్రోక్తే మార్కండేయ పురాణాంతర్గత
శ్రీ భావనాఋషి మాహాత్మ్యే మృకండమునేః
శివసాక్షాత్కారో నామ ప్రథమోధ్యాయః.

—()—

# భావనా ఋషి మాహాత్మ్యమ్



ద్వితీయోధ్యాయః

శ్లో॥ విధివద్విహితే తేన గర్భాధానస్యకర్మణి ।
భార్యా తస్యచిరాదాసీ దంతర్వత్నీ మరుద్వతీ ।
పుంసవనం సీమంతంచ స్వకాలేకృతవాన్మునిః ॥ ౧

తా. పిమ్మట మృకండమహాముని గర్భాధానమును విధ్యుక్తముగా చేయగా నాముని భార్యయగు మరుద్వతీదేవి బహుకాలమునకు గర్భవతి యాయెను. తరువాత యా మునిసత్తముడు పుంసవనసీమంతములు సకాలమున జరిపెను.

## మార్కండేయముని జననమ్

శ్లో॥ శుభే ముహూర్తే నక్షత్రే చిరజీవత్వదాయకే ।
శతతారాభిధే పుత్రః సంజాతస్తపనోపమః ॥ ౨

తా. తర్వాత శుభముహూర్తమునందు సునక్షత్రంబున చిరజీవిత్వము నిచ్చు కాలమున పుత్రుడుదయించెను.

శ్లో॥ నేదుర్దుందుభయోవ్యోమ్ని ప్రసేదుశ్చదిశోదశ ।
పుష్పవృష్టిర్మహత్యాసీ న్ననృతుశ్చాప్సరోగణాః ॥ 3

తా. మృకండమహర్షికి పుత్రు డుదయించిన కాల మున దేవదుందుభులు మ్రోగెను. దశదిశలు సుప్రసన్నము లయ్యెను. పూలవాన కురిసెను. రంభాదులు నాట్యముచేసిరి.

శ్లో॥ మృకండ తనయస్యాస్య చక్రే వ్యాసస్సహర్షిభిః ।
బ్రహ్మాదిభిస్సురైః సార్థం జాత కర్మాదికాః క్రియాః॥ ౪

తా. వ్యాసమహాముని బ్రహ్మ మొదలుగాగల దేవ తలతోడను, మునులతోడను గూడి యా మృకండ తనయు నకు జాతకర్మాది క్రియలను యథావిధిగా నొనరించెను.

శ్లో॥ ఋషయో దేవ గంధర్వాః బ్రహ్మావిష్ణుమహేశ్వరాః ।
తతో ఽర్చితాస్సమా జగ్ముఃస్స్వయమానాథాయథా గతమ్॥౫

తా. పిదప దేవతలు, గంధర్వులు, బ్రహ్మ విష్ణు మహేశాదులు యథార్థముగ సత్కరింపఁబడినవారలై, సంతోషముగ వచ్చినయట్లు వెడలిపోయిరి.

శ్లో॥ తతో నారద ఆగత్య మార్కండేయం సమీక్ష్యచ ।
సర్వాంగం పరిమృజ్యాస్య లక్షణాని పరీక్ష్యచ ॥ ౬
ఆపాదమస్తకం మిత్వా షణ్ణవత్యంగుళాత్మకం ।
ఉవాచ నారదోవాక్యం గృహీత్వా బాలకంకరే ॥ ౭
సంపన్నోఽయం తవసుతో లక్షణైః సర్వసౌఖ్యదైః ।
సర్వావయవశోభాభిః చిరంజీవిత్వసూచకైః ॥ ౮
కుంభమత్స్య ధ్వజాంభోజ శంఖచక్రాదిలక్షణైః ।
పాణిపాదతలోద్భూతైరయుతాయురహోమునే॥ ౯

లోకేఽస్యసదృశో నాస్తి పరమాయుస్తు షోడశ ।
ఇత్యుక్త్వా నారదః శ్రీమాన్ స్వమాశ్రమపదంయయౌ॥౧౦

తా. తర్వాత నారదమహాముని యేతెంచి ఆమృకండు పుత్రుని పాదము మొదలు శిరస్సువఱకు సకలావయవములను చూచి తొంబదియారంగుళములుగా కొలిచి మిక్కిలి సంతోషపడి యాబాలు నెత్తుకొని పలికెను. ఓ మృకండమహర్షీ ! నీకుమారుఁడు శంఖచక్రాది రేఖలతో గూడిన లక్షణములు గలవాడు. పదివేలయేండ్ల ఆయుస్సు గలవాఁడు. వీనితో సరియెవ్వరును లేరు. కాని ఈ శిశువు పదునారేడులు మాత్రము జీవించునని పలికి నిజాశ్రమమునకుఁ బోయెను.

శ్లో॥ మృకండు రపి తచ్ఛ్రుత్వా స్మృత్వాభర్గేరితంవరం॥౧౧

తా॥ మృకండు మహర్షి, యానారదవాక్యములాలించి, ఈశ్వరుని వరమును తలఁచికొని యుండెను.

శ్లో॥ నిష్క్రమణం చతుర్థేఽస్యమాసిపిత్రాకృతంగృహాత్ ।
అన్నప్రాశనమబ్దార్థే చూడాం చాబ్దార్థ కార్ధకే॥ ౧౨
కర్ణవేధం తతః కృత్వాశ్రవణర్షే సకర్మవిత్ ।
బ్రహ్మతేజోభివృద్ధ్యర్థం పంచమేఽబ్దేఽకరోద్వ్రతమ్॥ ౧౩

తా. శిశువు జనించిన నాలుగవ మాసమున తండ్రియగు మృకండుమహర్షి యిల్లు విడిచి పరస్థానము చేయించి కర్మ నెఱింగినవాఁడు గనుక నాఱవమాసములో నన్నప్రాశ

మును మూడవయేట చౌలకర్మను, శ్రవణనక్షత్రమున చెవులు కుట్టుటయు, నైదవయేట నుపనయనమును బ్రహ్మవృద్ధి కొఱకు చేసెను.

శ్లో. ఉపాకర్మ తతః కృత్వా వేదానధ్యాప్యకృత్స్నశః।
నమస్కారే బ్రహ్మణానాం, స దైవం సమచోదయత్॥ ౧౪

తా. ఉపనయనము చేసిన తరువాత నుపాకర్మము చేసి ఋగ్యజుస్సా మాధర్వణములైన వేదములను సమగ్రములుగా గురువునొద్ద చదివించి ఎల్లప్పుడు బ్రాహ్మణులకు నమస్కారము చేయుటయందు నియోగించెను.

శ్లో. యదాయత్ర ద్విజాన్ పశ్యేః యాన్ కాంశ్చిద్ద్విజసత్తమాన్
నమస్కురుష్వ తాన్సర్వాన్ దీర్ఘాయుస్తే భవిష్యతి॥ ౧౫

తా. పుత్రుని గుఱించి మృకండుముని చెప్పెను. ఓ మార్కండేయా! ఎచ్చట యే బ్రాహ్మణులను చూచినను నమస్కరింపుము. నీకు మంగళమయ్యెడు. దీర్ఘాయుర్దాయము కలుగును.

శ్లో. ఇతిపిత్రాసమాదిష్టో దివారాత్రమతంద్రితః ।
నమస్కుర్వన్ సర్వత్ర సర్వాన్విప్రాన్సమర్చయన్॥ ౧౬

తా. ఈ విధముగ మార్కండేయుఁడు తన తండ్రిచే నుపదేశింపబడినవాడై రాత్రింబవళ్ళు బ్రాహ్మణులను పూజించుచున్నవాడై యుండెను,

శ్లో. అభివాదయతః సర్వాన్ బ్రాహ్మణానేవ మన్వహం ।
దశ పంచ చ వర్షాణి వ్యతీయుః పుణ్యకర్మణి॥ ౧౭

తా. ఈ తీరున మార్కండేయుడు తండ్రి యానతి ననుసరించి అహోరాత్రంబులు భూసురాశీర్వాదముల నందు టకు వారికి నమస్కరించుచుండెను. ఈ రీతిని పదునైదు వత్సరంబులు గడచెను.

శ్లో. ఏతస్మిన్నేవ కాలేతు మృకండోరాశ్రమం శుభం ।
ఆ జగ్ము ర్మునయస్సప్త మార్కండేయ దిదృక్షవః॥౧౮

తా. ఇట్లు పదునైదుసంవత్సరములు గడుచుచుండగా మార్కండేయుని చూచుటకు కశ్యపాది సప్తర్షులు మృకండు మహాముని యాశ్రమమునకు వచ్చిరి.

శ్లో. మృకండు రపితాన్ పూజ్య స్థాపయిత్వాసనేషుచ ।
సుతంచవందనే తేషాం తదాసీమాదిశన్మునిః ౧౯

తా. మృకండుమహర్షి సప్తర్షుల నర్చించి యాసనము లందు కూర్చుండబెట్టి, కుమారుడైన మార్కండేయుని యా మునులకు నమస్కరింపుమని యాజ్ఞాపించెను.

శ్లో. మార్కండేయో నియుక్తోఽథపిత్రా తానభ్యవాదయత్ ।
షణ్మునీనభి వాద్యాథవసిష్ఠం వందితుం యయౌ ।
మార్కండేయో వసిష్ఠేన వందనేసనివారితః॥ ౨౦

తా. పిమ్మట మార్కండేయుడు, కశ్యపుడు మొదలుగాగల ఋషులకు నమస్కరించి యావల వసిష్ఠునొద్దకు వెడలగా ఆయనచే ఆ బాలుడు నివారింపబడెను.

శ్లో. కృతాంజలిపుటం దృష్ట్వా మార్కండేయకృపాన్వితాః।
బ్రహ్మర్షే స్తస్య సాన్నిధ్యే మునయ స్తేవచోఽబ్రువన్॥౨౧

తా. మునులు బ్రహ్మర్షి యగు వసిష్ఠుని ... హస్తములను జోడించియున్న ... మాడిన వారలై యీవిధము పలికిరి.

ఋషయ ఊచుః : ఋషులు పలికిరి.

శ్లో. ప్రణంతు మాగతో విప్రో నిషేద్ధవ్యో నకర్హి చిత్ ।
కృతాపరాధః పురతో వర్తమానోఽపి చేద్ధ్రువమ్॥ ౨౨

తా. ఓ వసిష్ఠమహర్షీ ! బ్రాహ్మణుఁడు నమస్కారము చేయుటకు వచ్చిన పక్షమున నాతడు అపరాధము చేసినను, నిషేధించుట యుచితముగాదు.

శ్లో. మృకండు సూనుర న్యోవా న్యక్కారం నాధిరోహతి ।
ఆయుష్మాన్భవ సామేత్యాశీ వర్ధితవ్యో వరాశిషా॥ ౨౩

తా. ఓ వసిష్ఠమహర్షీ! మార్కండేయుఁడుగాని, మఱి యొకఁడుగాని తిరస్కారమును బడయదగఁడు. ఆయుష్మంతుడవు గమ్ము అను ఆశీర్వాదమును బొందఁదగును.

శ్లో॥ తైరేవముక్తో భగవాన్ వసిష్ఠస్తానువాచహ ।
సర్వే మోఘాశిషోయూయం అసత్యావాగినోఽభవన్॥ ౨౪

తా. భూతభవిష్యద్వర్తమానముల నెఱింగిన వసిష్ఠ మహర్షి కశ్యపుడు మొదలగువారిని గుఱించి "మీరు విఫలాశీర్వాదములు గలవారు. మీ వాక్కుల నృతములు" అని పలికెను.

శ్లో. ఇత్యేవ ముక్తాముని యోవసిష్ఠేన మహాత్మనా ।
తమేవం పునరూచుస్తే మృషాలాపా కథం వయం ।
అస్మాభిరనృతంప్రోక్తం కదాకుత్రవదస్వనః॥ ౨౫

తా. మహాత్ముండగు వసిష్ఠుడు కశ్యపాది మునులను కూర్చి యిటుల పలుకగా వారు మేము ఎప్పుడెచ్చట ననృత మాడితిమి. అది మాకు తెలియంజెప్పు మనిరి.

వసిష్ఠ ఉవాచ : వసిష్ఠుడు పలికెను.

శ్లో॥ పరతోవత్సరాదస్మాద్వర్తమానామృతిర్ధ్రువం ।
మృకండుసూను రస్యైవయుష్మాభిస్తు మృకండుజః॥ ౨౬
ఆయుష్మాన్భవసౌ మ్యేతి వర్ధితో మునీరాశిషా ।
విచార్యతాం స ఆయుష్మాన్ కథంస్యాన్మునిసత్తమాః॥ ౨౭

తా. ఓ ఋషిశ్రేష్ఠులారా! ఈ మార్కండేయునకు పదునాఱవయేట మరణము కలుగును. మీరు చిరంజీవిగా నాశీర్వదించితిరి. అది ఎట్లో మీచే నాలోచింపబడుగాక! అని వసిష్ఠుడు పలికెను.

శ్లో॥ ఇత్యుక్త్వాముని నా సర్వే దివ్యదృష్ట్యానువీక్ష్య చ ।
తే మనఃస్వన్వతప్యన్త కింకుర్మోవయమిత్యుత ॥ ౨౮

తా. కశ్యపాది మునీంద్రులీప్రకారము వసిష్ఠమహర్షి చేఁ జెప్పఁబడినవారలై, దివ్యదృష్టి నీక్షించి యల్పాయుష్కునిగా నెఱింగి మనమేమి చేయగలమని చింతించిరి.

శ్లో॥ వసిష్ఠః పునరూచే తాన్మా భైష్టమున యోఽనృతాత్ ।
అహం యూయంచగచ్ఛామో బ్రహ్మాణంపద్మసంభవమ్
ప్రణమంతం మునిసుతం కిం నువక్ష్యతిలోకకృత్ ॥ ౨౯

తా. మునులారా! అనృతమాడితిమని భయపడ వలదు. మనమెల్లరము బ్రహ్మయొద్దకు వెళ్ళుదము. నమస్కారముచేసిన మార్కండేయుని యేమని దీవించునో!

శ్లో॥ ఏవం బ్రువతి బ్రహ్మర్షౌ వసిష్ఠే మునిసత్తమే ।
జిజ్ఞాసయా గతాస్సర్వే ఋషయస్తత్త్వలిప్సవః । ౩౦

తా. ఈ ప్రకారము వసిష్ఠుడు చెప్పుచుండగా విషయము నెఱుగ నిచ్ఛగలవారలై కశ్యపాదిమహర్షులు బ్రహ్మలోకమునకు వెళ్ళిరి.

శ్లో. మృకండుసూనుం నీత్వా తే బ్రహ్మాణం పద్మసంభవం ।
రత్నసింహాసనాసీనం ప్రణే ముర్వినయాన్వితాః॥ ౩౧

తా. అనంతరమున కశ్యపాదిమునులు రత్నసింహాసనాధిరూఢుడైన బ్రహ్మకు వినయమున నమస్కరించిరి.

శ్లో. వందనాయ విధాతుస్తే మార్కండేయ మచోదయన్ ।
ప్రణనామ తతస్తస్య చరణౌ మునిబాలకః ॥ ౩౨

తా. పిమ్మట కశ్యపాది మహామునులు మార్కండేయుని బ్రహ్మకు వందనము చేయుమని పురికొల్పిరి. ఆ బాలుఁడును విధాతృన కంజలి యొనరించెను.

శ్లో. తతో వినయసంపన్నో మార్కండేయస్థితోఽభవత్ ।
ఆయుష్మాన్భవ సౌమ్యేతి వర్థితో విధినాశిషా। ౩౩

తా. బ్రహ్మదేవునకు నమస్కారముచేసి మార్కండేయుడు వినయముతో నుండగా, బ్రహ్మ మార్కండేయుని చిరాయువుగమ్మని యాశీర్వదించెను.

శ్లో. తాతధాత రమీాభి స్త్వం మృషావాదీమునీశ్వరైః।
నాభూస్సృష్టివశా త్త్వం హి పౌర్వాపర్యవిచారితః॥ ३४

తా. తండ్రివగు నో బ్రహ్మదేవా! నీవు కశ్యపాది మునీంద్రులతో నబద్ధము పలికితివి. సృష్టి చేయుచున్నందున ముందు వెనుక లాలోచింప లేదు.

శ్లో. తతో బ్రహ్మమునిగణైః సహావీక్ష్యమనోదృశా।
కథమస్యప్రతీకారమితి చింతాపరోఽభవత్॥ ३३

తా. బ్రహ్మదేవుఁడు మునీంద్రులతోఁగూడ జ్ఞానదృష్టి నాలోకించి యీామాటకు ప్రతీకార మెట్లో యోచించెను.

శ్లో. ఏవం విచిన్త్య మనసా బ్రహ్మ కృత్వాతమంగకం।
బ్రహ్మర్షీణాం ప్రాహమధ్యేప్రతిజ్ఞాపూర్వకంవచః॥ ३६

తా. బ్రహ్మదేవుడనగు నేనే మార్కండేయుని దీర్ఘాయుఁడవు కమ్మని దీవించితిని. మన మేవిధముగా యథార్థమౌనట్లు చేయుదమని మనంబున యోచించి మార్కండేయుని తొడపై నిడుకొని, బ్రహ్మర్షి మధ్యమందు ప్రతిజ్ఞాపూర్వకమైన వాక్యమును పలికెను.

శ్లో. శ్రుణుధ్వం ఋషయస్సత్యం బ్రవీమ్యస్య హితంప్రతి।
యథా మనీషా భవతాం తథా కార్యా మయాధునా॥ ४३

తా. మహర్షులారా! ఈ మార్కండేయుని శ్రేయము నిమిత్తమై సుభాషితము చెప్పుచున్నాను. అవధరింప వలయును. మీ యభీష్ట మేరీతిని నీయర్భకుని దీర్ఘాయుష్కునిగాఁ జేయవలయుననియున్నదో ఆ ప్రకారము నేను చేయ వలయునని యున్నవాఁడను.

శ్లో. భద్ర! వారాణసీం గచ్ఛతపశ్చరసమాహితః ।
శంకరస్యకృపాపాత్రం భవ మద్వచనాన్ముదా॥ ౩౮

తా. బాలకా! కాశీకిఁబోయి నిశ్చల చిత్తముతో శివు నారాధించి యా యుమానాధునికి కృపాపాత్రుడవు కమ్ము.

శ్లో. బ్రహ్మణాభిహితశ్చైవం మార్కండేయః ప్రణమ్య తం।
అవతీర్యావిధే ర్లోకాదంతికం స్వపితుర్యయౌ॥ ౩౯

తా. మార్కండేయునకు బ్రహ్మ ఈ ప్రకారము చెప్పగా పిమ్మట నా మునికుమారుడు బ్రహ్మకు నమస్కరించి సత్యలోకము నుండి తండ్రియొద్ద కేతెంచెను.

శ్లో. వవందే పితరౌ సోఽథ తద్వృత్తాంతం న్యవేదయత్ ।
ప్రాణ్మాసాన్మరణం తస్యమృకండుః ప్రేక్ష్యవిహ్వలః॥౪౦
అతీవశోకదీనాత్మా విలలాపాకులేంద్రియః ॥
మాతాచాస్య మహాభాగా రురోద భృశవిహ్వలా॥ ౪౧

తా. తర్వాత మార్కండేయుడు సత్యలోకమునుండి వచ్చి పితరులకు నమస్కరించి, యా వృత్తాంతము నెఱింగిం

చెను. వారు తమ పుత్రున కారుమాసములకు పైన మర
ణము నిక్కమని మిక్కిలి దుఃఖించిరి.

శ్లో॥ నష్టలోకావుభావాస్తా మావాం పుత్ర! త్వయావినా ।
ఆవాం కథమదృష్ట్వా త్వాం భువి జీవావపుత్రికౌ॥ ४२

తా. ఓ కుమారా! నీవు లేనియెడల మే మిద్దరము నశిం
చిన లోకము కలవారమగుదుము. (పరలోకము లేనివా
రము) నిన్ను చూడక భూమియం దెట్లు బ్రతుకగలము.

శ్లో. పుత్రహాని ర్జగచ్ఛూన్యం మాతాపిత్రోరితిశ్రుతిః ।
పుత్రహానేః క్రియాః సర్వా నిష్ఫలా ఇతి మేమతిః॥ ४३

తా. తల్లిదండ్రులకు కుమారుడు లేనిపక్షమున లోక
మంతయు శూన్యమని ప్రతీతి కలదు. పుత్రులు లేనివారలు
చేయు (జ్యోతిష్టోమాది) కార్యము లెల్ల నిష్ఫలంబులు.

శ్లో. లోకా న సంత్యపుత్రస్య నాస్త్యపుత్రస్య తత్సుఖం
గార్హస్థ్యం నాస్త్యపుత్రస్యసర్వంశూన్యమపుత్రిణః॥ ४४

తా. పుత్రులు లేనివారికి స్వర్గాదిలోకములు లేవు.
పుత్రసుఖము లేదు. గృహస్థధర్మములు నిరర్థకములు. వానికి
సర్వమును శూన్యము.

శ్లో॥ అపుత్రతా మహద్దుఃఖం మహద్దుఃఖం కుపుత్రతా ।
ద్వాభ్యామపిమహద్దుఃఖం సత్పుత్ర మరణం సుత!॥ ४५

తా. పుత్రుడు లేకుండిన మిక్కిలి దుఃఖము, కుపుత్ర
త్వమంతకన్న దుఃఖహేతువు. సత్పుత్ర మరణమా రెంటికంటె
మిక్కిలి దుఃఖకరము.

శ్లో॥ యతినో నిందితాః కింను యతినిందాత్కులక్షయః ।
పరదారామయాస్పృష్టాః కింను దుష్టేన చేతసా ।
సద్యః కులక్షయకరం పరదారాభిమర్శనమ్॥ ౨౨

తా. నేను యతీశ్వరుల నిందించితినో యతుల నిందించుట వంశనాశకరము. పరస్త్రీలను క్రీగంట జూచితినో, పరస్త్రీ స్పర్శనము తత్క్షణమే వంశమును క్షీణింప జేయునది.

మరుద్వతీ ఉవాచ : మరుద్వతి పలికెను.

శ్లో. గావోమయాకృతాః కింను వివత్సాః క్షీరలుబ్ధయా ।
మాతృహీనా మయావత్సాఃకృతామాతృ స్తనంధయః ౨౭

తా. నేను పాల నపేక్షించి గోవులయొద్ద దూడలను చేరనీయకుండ చేసితినో! లేక చన్నుకుడుచు దూడలను తల్లులనుండి యెడబాపితినో!

శ్లో. విలప్యైవముభౌ పుత్రమాలింగ్య రుదతుర్భృశం ।
మార్కండేయోఽపి తౌ దృష్ట్వా పితరౌభృశదుఃఖితౌ౨౮
ఉవాచ పితరం కింవా కారణం శోక మోహయోః ।
పుత్రస్యవచనం శ్రుత్వా సుశ్లక్ష్ణం మధురాక్షరం।
ఉవాచ కారణం తస్య మృకండుశ్శోక మోహయోః౨౯

తా. తల్లిదండ్రు లీరీతి దుఃఖించుచుండగా మార్కండేయుడు వారి శోక మోహములకు హేతు వేమని యడిగెను. అది విని మృకండుమహాముని మార్కండేయున కిట్లనియె.

శ్లో. శివ హేతో శ్చ హేవత్స ! శోచామ్యశ్రుణుకారణం ।
ఆయుః షోడశ వర్షాంతం తుభ్యందత్తం పినాకినా॥ ౫౦
తస్యసంవత్సర స్యాస్య షోడశీయస్య పుత్రక !
పశ్చాద్వ్యతీయుః షాణ్మాసా ఇతో మాసాః పరంతుషట్ ॥౫౧
తా. వత్సా ! నీ కొరకు దుఃఖించుచున్నాను. శివుని చే నీకు పదునాఱు వత్సరము లాయువు నిర్దేశింపబడినది. పదునారవది యైన వత్సరములో నారు మాసములు గడచినవి. ఇక పదునాఱవయేడు ముగియుట కారునెలలు వ్యవధి యున్నది.
శ్లో. షడైవతేచ తేమాసాః షట్ క్షణా ఇవనందన !
సకలోయ మనుప్రాప్త స్తస్మాచ్ఛోచామిసాంప్రతమ్ ౫౨
అచక్షుషోహ్యాపుత్రస్య విద్యతే మహదంతరం ।
అచక్షుష స్త్వయం లోకః కేవలం తమసావృతః ।
సర్వేలోకాహ్యాపుత్రస్యహ్యాంధేన తమసావృతాః॥ ౫౩
తా. ఓ కుమారా ! ఆ యారుమాసములు ఆరు క్షణములవలె సమీపించుచున్నవి. కన్నులు లేనివాని కీలోకము చీకటితో నున్నట్లు తోచును. పుత్రులు లేనివానికి అన్ని లోకములు గాఢాంధకారముతో నిండినట్లుండును.
శ్లో. పిత్రైవం కథితం దృష్ట్వా మార్కండేయోఽబ్రవీదిదం।
మన్నిమిత్తం పితశ్శోకం కదాచిదపి మాకృథాః॥ ౫౪
శివేనైవ హ్యనాయుష్యం మమ దత్తం పురారిణా ।
స ఏవ మాం ధ్రువం కుర్యాజ్జరామరణవర్జితమ్ ॥ ౫౫

యతిష్యేఽహం తథా తాత యథాయాస్యామ్యమర్త్యతామ్

సమారాధ్య జగన్నాథం తపసావరదం ప్రభుమ్॥ ౨౬

మృత్యుంజయం విరూపాక్షం సర్వేశాం సర్వదం సతాం।

కాలకాలం మహాకాలం కాలకూట విషాదినమ్॥ ౨౭

తా. మార్కండేయుఁడు తండ్రితో నిట్లనియె. తండ్రీ! యే యీశ్వరునిచే అల్పాయుర్దాయ మియ్యఁబడినదో ఆ యీశునే భక్తిచే నారాధించి యాయన మెప్పును బడసి చిరంజీవిత్వమును పొంది రాగలను. నానిమిత్తము మీరు దుఃఖింపక సుఖులై యుండుడు.

శ్లో. ఇతిశ్రుత్వా వచస్తస్య పితరావతి హర్షితౌ।

క్లేశం శోకం పరిత్యజ్య ప్రహృష్టావూచతుఃసుతమ్॥ ౨౮

తా. తల్లిదండ్రులగు మరుద్వతీ మృకండులు తమ కుమారుని మాటలకు మిక్కిలి సంతసించి యిట్లనిరి.

శ్లో. కిం న శ్రుతం త్వయా తాత! శ్వేతకేతుం యథాపురా।

పాశితం కాలపాశేన రరక్ష త్రిపురాంతకః॥ ౨౯

తా. తండ్రీ మార్కండేయా! ఈశ్వరుడు పూర్వము కాలపాశబద్ధుఁడైన శ్వేతకేతువను మునిని రక్షించెను. ఆచరిత్రమును నీవు వినలేదా.

శ్లో. శైలాదినా యథా మృత్యుగ్రస్తమష్టాబ్ద మర్భకం।

శివో నిజపదే చక్రే నందినం విశ్వనందనః॥ ౩౦

క్షీరోదమథనోఽద్భూతం ప్రళయానిల సన్నిభం ।
పీత్వా హాలాహలం ఘోరమరక్షద్భువనత్రయమ్ ॥ ౬౧

తా. ఈశ్వరుడు శిలాద పుత్రుఁడగు నందిని మృత్యువునుండి యుద్ధరించి, నందికేశ్వరునిగా (తన స్థానమున నుంచెను) నిలిపెను. క్షీరసాగరమథనమున కాలకూట విషము బయలు వెడలి లోకములను చీకాకు చేయుచుండగా, ఈ నా విషమును త్రాగి లోకముల నుద్ధరించెను. అట్టి ఈశ్వరుడు నిన్ను కృపచే కాపాడుగాక.

శ్లో. శూరం ధర్మం ప్రహార్త్యైవ చక్రే స్వస్యాంఘ్రిసేవకం ।
శూలాగ్రేణాంధకం శంభుర్హత్వా నిర్వృతిమాపసః ॥౬౨

తా. ఇదియునుఁగాక యా పరమేశ్వరుఁడు యముని మర్దించి తనకు వశునిగా జేసికొనెను. అంధకాసురుని తన శూలాగ్రముచే గ్రుచ్చి చంపెను.

శ్లో. తస్మాత్త్వం శరణం గచ్ఛ విశ్వ సంరక్షకంశివం ।
త్వామవశ్యం శివః పాతుకురు మద్వచనంహితమ్ ॥ ౬౩

తా. కుమారా! ఆ యీశ్వరుఁడు సమస్తలోకములను రక్షించువాడు. ఆ శివుడే నిన్ను రక్షింపఁగలడు. నామాట ననుసరించి తపము చేయుము.

శ్లో. ఇతి శ్రుత్వా పితుర్వాక్యం యయౌ గోదావరీం శుభాం।
తస్యానద్యాస్తటే శుద్ధే దక్షిణే సమ్మృకండుజః ॥ ౬౪

లింగం సంస్థాప్య విధివత్ స్వనామ్నా విశ్వపూజితం।
స్థిత స్తత్రనిమజ్జన్ సః త్రికాలం శివమర్చయన్॥ ౬౫

తా. తరువాత నామార్కండేయుఁడు తండ్రియానతి ననుసరించి గోదావరీతీరమునందు నివసించి, దక్షిణతటమున తన పేరుతో శివలింగమును ప్రతిష్ఠించి త్రికాలములు నా గోదావరియందు స్నానముచేసి శివార్చనము చేయుచుండెను.

ఇతి వ్యాసప్రోక్తే మార్కండేయ పురాణాంతర్గత
శ్రీ భావనాఋషి మాహాత్మ్యే మార్కండేయస్య
బాల్యావస్థో నామ ద్వితీయోఽధ్యాయః.

—o—

# భావనాఋషి మాహాత్మ్యమ్

## తృతీయోఽధ్యాయః

శ్లో. ఏవం తస్య మునేః కాలః షాణ్మాసాదధికోఽభ్యయాత్ ।
ఏతస్మిన్నేవ కాలేతు బ్రహ్మా లోకపితామహః ।
కైలాసమగమచ్ఛ్రీమాన్ దేవర్షిగణసేవితః ॥ 1

తా. మార్కండేయుఁడీప్రకారము తపము చేయుచుండగా నాఱుమాసములకుపైన గొంతకాలమునకు బ్రహ్మదేవుఁడు దేవర్షి సహితుఁడై కైలాసమున కేగెను.

శ్లో. అభివాద్యమహేశానం దక్షిణామూర్తిమీశ్వరం
ప్రణమ్యశిరసా దేవం వాగ్భిరగ్ర్యాభిరస్తువత్ ॥ 2

తా. బ్రహ్మదేవుఁడు మహేశ్వరుఁడైన దక్షిణామూర్తికి నమస్కరించి యర్థవంతములైన వాక్కులచేత స్తోత్రము చేసెను.

శ్లో. అథప్రసన్నో భగవా నంబికాపతి రబ్జజం ।
ఉవాచ పద్మసంభూత ! కింతే ఽభిలషితం వద
ఇత్థం ప్రసాదాభిముఖం వేధా భవమథాబ్రవీత్ ॥ 3
భగవన్ భవతాదత్తమాయుః షోడశవార్షికం ।
మార్కండేయాయ మునయే తన్నజానామి శంకర!॥ 4

ఓ శంకరా ! నీవు మార్కండేయమహామునికి పదునాఱు వత్సరములాయు విచ్చుట నేనెఱుగను.

శ్లో. మృకండు స్తత్పితాధీమానుపాయజ్ఞో నమస్కృతౌ ।
బ్రాహ్మణానాం సదా పుత్రం నామచోదయదన్వహమ్ ॥ ౫

తా. బ్రాహ్మణాశీర్వాదములవలన నాయువు వృద్ధి నొందునని యెంచి యా మృకండు మహాముని తన కుమారుడగు మార్కండేయుని అనుదినమును విప్రులకు నమస్కరించుటయందు పురికొల్పుచుండెను.

శ్లో. నమస్కుర్వన్ ద్విజాన్ సర్వాన్ తైరాశీర్భిస్సమేధితః ।
నమస్కృతోఽహం తేనాపి వర్ధితశ్చాశిషా మయా ॥ ౬
జ్ఞాపితోఽహం వసిష్ఠేన పూర్వవృత్తాంత మాదితః ।
అహంచ తేచ మునయో యథానశ్యామ శంకర ! ॥ ౭
తథా ప్రసీద దేవేశ మిథ్యాశీర్వచనా వయం ।
వచో మిథ్యాయది భవేదస్మాకం త్రిపురార్దన ।
లోకో మిథ్యాభవేన్నూనం భవాన్మిథ్యా భవిష్యతి ॥ ౮

తా. మార్కండేయ మహాముని సమస్త బ్రాహ్మణులకు వందనములు చేయుచున్నవాడై నాకు నమస్కారము చేయగా నేను చిరాయువు గమ్మని దీవించితిని. నా వాక్కులు వ్యర్థముగాకుండునట్లు మార్కండేయునికి యాయుర్వృద్ధి చేయునట్లు మమ్ము సఫలవాక్కులు గలవారినిగాఁ జేయుము. లేనిచో లోకము మిథ్యయనియు, మీరు భగవంతులు గారనియు చెప్పుదురు.

శ్లో. సప్తవారం మయాచాస్యేత్యాయురస్తు శతాధికం ।
ఉక్తం కృతా ప్రతిజ్ఞాయా తాం సత్యాం కురుశంకర !
ఇతిప్రసాదితః శంభుః సస్మార స్వకృతంపురా ॥ ౯

తా. ఈ మార్కండేయున కాయువు శతాధికమగు గాక యని యేడుమారులు బలికితిని కనుక నో యీశా! నా ప్రతినకు భంగము లేకుండ ననుగ్రహించి కృతార్థుని జేయుము. అది విని శంకరుఁడు పూర్వము తానిచ్చిన వరమును దలంచెను.

శ్లో. బ్రహ్మాణం తం విసృజ్యాథ స్వాయ మారుహ్యగోవృషం ।
పార్వత్యా సహితః శంభుః దేవ గంధర్వ కింనరైః ।
ప్రాదురాసీన్మునేస్తస్య తపసా తోషితః శివః ॥ ౧౦

తా. పిమ్మట నీశ్వరుడు బ్రహ్మను వీడ్కొని పార్వతితో నంది నారోహించి దేవ గంధర్వ కిన్నరులతో మార్కండేయుని తపమున కలరి యాయనకు ప్రత్యక్షమయ్యెను.

శ్లో. ఏతస్మిన్నేవ కాలేతు మార్కండేయో మునీశ్వరః ।
ప్రాతఃకాలే సతాంపూజాం కృత్వా స్తుత్వా యథావిధి।
శివపూజాంచ నిర్వర్త్య మధ్యాహ్నే స్తోతు ముద్యతః ॥
౧౧

తా. భగవంతుఁడు ప్రత్యక్షమగు కాలమునందే మార్కండేయుడు ప్రాతఃకాలమునందు పూజాదివిధులు నిర్వర్తించి, మధ్యాహ్నము పూజచేసి స్తోత్రముచేయ నారంభించెను.

శ్లో. అజగామచ తం దేశం కాలో మృత్యు సహాయవాన్ ।
వృత్త రక్తాంతనయనః సర్పవృశ్చికరోమవాన్ ॥ ౧౨
దంష్ట్రా కరాళవదనః ప్రవృద్ధాంజన శైలభః ।
సమాగమ్య సతస్యాంసే కాలపాశమపాసృజత్ ॥ ౧౩

తా. ఇంతలో మిక్కిలి భయంకరుడైన యముడు మృత్యుదేవతతోఁగూడ నా మార్కండేయుని తపోవన ప్రదేశమున కరుదెంచి యాతని భుజ శిరస్సుపై పాశము ప్రయోగించెను.

శ్లో. కంఠార్పితమహాపాశో మార్కండేయస్త మబ్రవీత్ ।
కాల! తావత్ప్రతీక్షస్వ కాలం మమ మహామతే ।
నివర్తయామ్యహం యావన్మహాస్తోత్రాజ్జగత్పతేః ॥ ౧౪

తా. మార్కండేయ మహాముని కంఠమున పాశము దగుల్కొనగా నిట్లనియె. ధర్మరాజా! నేను శివుని స్తోత్రముఁ జేయువరకు నిదానింపుము.

శ్లో. శివస్తోత్రమ నిర్వర్త్య న కదాచిద్వ్రజామ్యహం।
నస్వపామి నభోక్ష్యామి త్యేతన్మే వ్రతమాహితమ్ ॥
నజీవితం కళత్రం వా నరాజ్యంచ తథాసుఖం
ప్రియం మమ యథా తీవ శివస్యైతు వరం స్తవమ్ ॥ ౧౬

తా. ఓ ధర్మరాజా! శివస్తోత్రము చేయక నెచటికి వెళ్ళను, భుజింపను, శయనింపను. వేయేల శివస్తోత్రము సేయుక రాజ్యము కళత్రము మిక్కిలి యింపైన దేదియు కోరను.

శ్లో. తమ బ్రవీత్తతః కాలో మార్కండేయం హసన్మృఖః ।
నాప్రాప్త కాలో మ్రియతే విద్ధశ్శరశతైరపి ।
కుశాగ్రేణాపి సంస్పృష్టః ప్రాప్తకాలో నజీవతి ॥ ౧౭
ఆనీతాని నకర్తవ్యో మన్యురత్ర మయానఘ !
చక్రవర్తి సహస్రాణి పురందరశతాని చ ॥ ౧౮

తా. అంతట యమధర్మరాజు మందహాసము చేసి మార్కండేయునితో నిట్లనియె. మార్కండేయా! కాలము సమీపింపనివాఁడు నూఱు బాణములచేఁ గొట్టఁబడియు మృతినొందఁడు. కాలమాసన్నమైనవాఁడు గడ్డిపోచతో తాకఁబడియు మరణించును. వేలాది చక్రవర్తులును, వందలాది దేవేంద్రులును నాచే కొనిపోఁబడిరి. ఈ విషయమున నీ వెంతమాత్రమును కోపింపరాదు.

శ్లో. ఇతి శ్రుత్వా వచ స్తస్య కాలస్యామోఘ వృత్తినః ।
మార్కండేయ స్తమూచేఽథ శివస్తోత్రపరాయణః ॥ ౧౯
యేస్తోత్రవిఘ్నం కుర్వన్తి శివస్తోత్ర రతాత్మనాం
తేఽచిరేణ వినశ్యంతి త్వా మతో వారయామ్యహమ్॥ ౨౦

తా. ఆ మార్కండేయుడు యమునికిట్లనియె. ఓ ధర్మరాజా! శివస్తోత్రము నాసక్తితో జేయువారల కెవ్వరు విఘ్నము చేయుదురో వారలు త్వరలో నశింతురు. దాన నీకు ముందుగ దెలియఁజేయు చున్నాను.

శ్లో. యథైవ రాజా భృత్యానాం శాస్తా నాన్యోఽత్ర భూమిపే ।
తథైవ శివభక్తానాం శాస్తా సపరమేశ్వరః॥ ౨౧

తా. భృత్యుల పాలించుటయందు రాజువలె శివ భక్తులను కాపాడుటయందు నా యీశ్వరునికన్న మఱి యొకడు యీ భువియందు లేడు.

శ్లో. భింద౦తి శైలా నుదధీన్పిబంతి ।
వ్యత్యాసయంతి క్షితిమంతరిక్షం ।
తృణీకృత బ్రహ్మ పురందరాణాం ।
కిందుష్కరం శంకర కింకరాణామ్ ॥ ౨౨

తా. శివభక్తులైన వారలకు సాధ్యముగాని కార్య మేదియు లేదు. వారు పర్వతముల చూర్ణము చేయుదురు. సముద్రముల నింకింతురు. బ్రహ్మేంద్రులనైనను లెక్క సేయరు.

శ్లో. నమృత్యుర్నచదూతో వా నయమో యమదూతికాః ।
నచాన్యః శివభక్తానాం భవంతి ప్రభవిష్ణవః ॥ ౨౩
కిం నశ్రుతం త్వయా కాల! వాక్యమే తన్మనీషిణాం ।
నరాణామీశ భక్తానాం నభవంత్యాపదః క్వచిత్ ॥ ౨౪

తా. శివభక్తులు చేయు కార్యమును యముడుగాని యమదూతలుగాని తదితరమైన మృత్యుదేవతలుగాని చెఱుపుటకు సమర్థులుగారు.

శ్లో. బ్రహ్మాదయోఽపి తాన్భక్తాన్నశక్తాహంతు మీశ్వరాః।
స ఏవం తర్జితస్తేన కాలః కాలాంజనాకృతిః ॥ ౨౫
కాలోహ్యతీవచుక్రోధ ఘృత సిక్త ఇవానలః ।
క్రోధ రక్తాంతనయనో ధుపేత్యాహ మహామునిమ్। ౨౬

తా. శివభక్తులను సంహరించుటకు బ్రహ్మాదులే సమర్థులు గారని మార్కండేయు డనగా యముడు మండిపడి భీకరముగా నిట్లనియె.

శ్లో. యావంత ఏవగంగాయాం సికతా విప్ర దుర్మతే।
తావంత ఏవ బ్రహ్మాణో విష్ణవః శూలపాణయః॥ ౨౭
తథా సురాధిపాః సంఖ్యేయయా కాలేన సంహృతాః।
కిం వాత్ర బహునోక్తేన పశ్య మే విక్రమం పరమ్॥ ౨౮

తా. దుష్ట బ్రాహ్మణా! ఈ గంగయందు ఎన్ని యిసుకలు గలవో యందరు బ్రహ్మ విష్ణు శంకరులు నాచే యుద్ధమున సంహరింపబడిరి. వేయేల నాపరాక్రమము చూడుము.

శ్లో. మయాత్వం కాలపాశేన కంఠే బద్ధోఽసి సాంప్రతం।
స పాతు త్వాం మహాదేవోయస్య భక్తస్త్వమీదృశః॥
తం మునిం తర్జయిత్వైవం కాలగ్రస్త ముపాగమత్।
కాలేనగ్రస్యమానోఽసౌ ధ్యానేనాభూచ్ఛివస్వయమ్॥

తా. ఇప్పుడు నిన్ను కాలపాశమున బంధించుచున్నానని యముడు మార్కండేయుని భయపెట్టి సమీపించెను. ఆమునియు కాలగ్రస్తుడు గనుక నిశ్చలచిత్తమున శివుని ధ్యానించుచుండెను.

శ్లో. లింగాదథసముత్థాయ మార్కండేయం సమాహ్వయత్।
బ్రహ్మాదాద్యైర్లిఖితః పూర్వం పార్వత్యాసహ శంకరః॥ ౩౧

అనిర్దేశ్య వయోరూపశ్చంద్రార్ధ కృత శేఖరః ।
గర్జన్మేఘురవోదగ్రం హుం కృతేన స తత్ క్షణా॥ ౩౨
ఉద్ధృత్య పాదకమలం ప్రజహార భుజాంతరే।
పాదతాడనభిన్నాంగో నిపపాతయమః క్షితౌ ॥ ౩౩
ఊర్ధ్వాసనో నివృత్తాస్యో నా సాకుహారభీషణః।
విప్రకీర్ణ ప్రహరణో విద్రుత వ్యాధి సైనికః ॥ ౩౪

తా. పూర్వము బ్రహ్మచే ప్రార్థింపబడి లింగోద్భవుడైన యీశ్వరుడు ముందు మార్కండేయుని పిలిచి యావల నొక పాదమున యముని ఱొమ్మును బగులునట్లు తన్నెను. అందువలన కాలుడు వెల్లకిల బడియెను.

శ్లో. కాలోరః పాత తాడోరుశబ్ద మాకర్ణ్య భైరవం ।
ధ్యానాన్నివృత్తః సమునిః పురోఽపశ్య త్రిలోచనమ్॥ ౩౫
బ్రహ్మవిష్ణ్వింద్రచంద్రాద్యాన్ దేవాన్ భీమగణాంస్తథా।
దూరే చ పతితం కాలంకృతాంతం భీషణాకృతిమ్ ॥ ౩౬
దృష్ట్వా హృష్ట్వా విస్మయేన కృత్వా శిరసిచాంజలిం।
మనసా తన్మయో భూత్వా హృష్టరోమ తనుర్మునిః।
భూమాపతి త్వానమ్రశ్చ తుష్టావ పరమేశ్వరః ॥ ౩౭

తా. మార్కండేయమహాముని యా కలకలమాలించి ధ్యానమునుండి మరలి, యెదుట పరమశివుని జూచెను. ఆవల బ్రహ్మ విష్ణు దేవగణములను, భీకరా[illegible] ప్రమథగణములను జూచెను. పిమ్మట కాలుడు త్రుళ్ళిపడి

యుండుటయుఁ బొడగాంచి విస్మయం బంది యీశ్వరుని స్తోత్రము చేసెను.

శ్లో. రత్నసాను శరాసనం రజతాద్రి శృంగనికేతనం।
శింజనీకృత పన్నగేశ్వర మచ్యుతానలసాయకమ్।
క్షిప్రదగ్ధపురత్రయం త్రిదశాలయై రభివందితం।
చంద్రశేఖరమాశ్రయే మమ కింకరిష్యతి వై యమః॥ 3౮

తా. మేరు పర్వతము విల్లుగా గలిగి, కైలాస శిఖరమున వాసము చేయుచు, వాసుకిని అల్లెత్రాడుగా చేసికొని విష్ణువును, అగ్నిని అమ్ములనుగా సంధానము చేసి త్రిపురముల నవలీలగా త్రుటిలో దహించి దేవతలచే గొనియాడబడిన చంద్రశేఖరుండగు నిన్నాశ్రయించుచున్నాను. యముడు నన్నేమి సేయగలడు.

శ్లో. పంచపాదపపుష్పగంధ పదాంబుజద్వయ శోభితం।
ఫాలలోచన హేమపావకదగ్ధమన్మధ విగ్రహమ్।
భస్మదిగ్ధ కళేబరం భవనాశనం భవమవ్యయం।
చంద్రశేఖర మాశ్రయే మమ కింకరిష్యతి వై యమః॥

తా. నాకవాసులగు దేవతల వృక్షములు మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనమునను వృక్షములలోనుండు పుష్పములచే సర్వదా పూజ చేయబడుచుండుటవలన సువాసనచే నొప్పుచున్న పాదకమలములచే ప్రకాశించుచున్నవాడును, ఫాలనేత్రానల

ముచే మన్మథ దేహమును దహించి భస్మ వారణముచే వ్యాప్త మగు శరీరము గలవాడును, సంసార తాపత్రయాదిబాధల తొలగింపఁ జేయుచుండెడివాడును, ప్రపంచోత్పత్తికి కారణ భూతుడును, శాశ్వతుడు నయిన చంద్రశేఖరు నాశ్రయించె దను. యముడు నన్నేమి సేయగలడు!

శ్లో. మత్తవారణ ముఖ్యచర్మ కృతో త్తరీయ మనోహరం ।
పంకజాసన పద్మలోచనపూజతాంఘ్రిసరోరుహమ్ ।
దేవసింధు తరంగ శీకరసిక్త శీతజటాధరం ।
చంద్రశేఖర మాశ్రయే మమకింకరిష్యతి వై యమః॥౧౦

తా. గజచర్మము నుత్తరీయముగా ధరించినందున మనోహరుండును, బ్రహ్మవిష్ణువులచేఁ బూజింపబడిన చరణారవిందములు గలవాడును, గంగాతరంగ జలకణకములచేఁ దడుపబడిన జటాజూటమును ధరించినవాడు నగు చంద్రమౌళి నాశ్రయించెద, నీ యము డేమిసేయగలడు.

శ్లో. కుండలీకృత కుండలీశ్వర కుండలం వృషవాహనం ।
నారదాదిమునీశ్వర స్తుత వైభవం భువనేశ్వరమ్ ।
అంధకాంతక మాశ్రితామరపాదపం మదనాంతకం ।
చంద్రశేఖర మాశ్రయే మమ కింకరిష్యతివైయమః॥౧౧

తా. సర్పములకు బ్రభువైన వాసుకిని, కుండలముగా ధరించినవాడును, వృషభ వాహనారూఢుడును, నారదాది మహర్షులచే కొనియాడబడిన యణిమాద్యష్టసిద్ధులు గలవాఁ

డును, లోకేశ్వరుండును, అంధకాసురు నడంచినవాడును, మన్మథుని అంతమొందించినవాఁడును, నాశ్రిత రక్షకుండును నగు నీశ్వరు నాశ్రయించెద, నీయముఁ డేమిసేయగలఁడు.

శ్లో॥ యక్షరాజసఖం భగాక్షహరం భుజంగ విభూషణం ।
శైలరాజ సుతాపరిష్కృత చారువామ కళేబరమ్ ।
క్ష్వేళ నీలగళం పరశ్వథధారిణం మృగధారిణం ।
చంద్రశేఖర మాశ్రయే మమ కింకరిష్యతి వైయమః॥౪౨

తా॥ కుబేరునికి స్నేహితుడైన భగుడను ముని నేత్రమును సంగ్రహించుటవలన త్ర్యంబకుడనుపేరుగలవాడును, సర్పములను హారములుగా ధరించువాడును, సగము శరీరము పార్వతీదేవి కొసంగుటవలన నర్ధనారీశ్వరుడను నామముచేఁ బిల్వబడువాడును, కాలకూటవిషమును మ్రింగుటవలన నీలకంఠుడను నామము గలవాడును, వ్యాధరూపము నైకొన్న సమయంబున గండ్రగొడ్డలి యాయుధంబుగా గలవాడును, ఒకానొక సమయంబున శరభావతారము నొందుటవలన మృగరూపమును ధరించినవాడును నగు చంద్రశేఖరుడగు పరమేశ్వరు నాశ్రయించెదను. యముడు నన్నేమిసేయఁ బోవును.

శ్లో॥ భేషజం భవరోగిణా మఖిలాపదా మపహారిణం ।
దక్షయజ్ఞ వినాశనం త్రిగుణాత్మకం త్రివిలోచనమ్ ।
భుక్తి ముక్తి ఫలప్రదం సకలాఘ సంఘనిబర్హణం ।
చంద్రశేఖర మాశ్రయే మమ కింకరిష్యతి వైయమః॥౪౩

తా. సంసార తాపత్రయ జనితంబులగు రోగములచేఁ బీడింపబడువారలకు చికిత్స చేయువాడును, సమస్త విపత్తులను బోగొట్టువాడును, దక్షయజ్ఞ వినాశకుడును, త్రిగుణాత్మకుడై బ్రహ్మ విష్ణు మహేశులను నామంబుల బరగువాడును, త్రినేత్రుడును, నైశ్వర్య మోక్ష ప్రదాతయును, సమస్త పాపహరుడు నగు చంద్రశేఖరు నాశ్రయించెదను. యముడేమి సేయగలడు.

శ్లో. భక్తవత్సల మర్చితాం నిధి మక్షయం హరిదంబరం
సర్వభూత పతిం పరాత్పర మప్రమేయ మనూపమమ్ ।
సోమవారినభో హుతాశన సోమపాద్యఖిలాకృతిం ।
చంద్రశేఖర మాశ్రయే మమ కింకరిష్యతి వై యమః ॥

తా. భక్తవాత్సల్యము గలవాడును, శాశ్వతుండును, దిగంబరుడును, పూజించువారల కభీష్టంబు లొసంగువాడును, పృథివ్యాది పంచభూతముల కధీశ్వరుడును, పరాత్పరుడును, ఊహింప నశక్యుడును, అష్టమూర్తియునగు త్రినేత్రములుగల చంద్రశేఖరు నాశ్రయించెదను. యము డేమి సేయగలడు.

శ్లో. విశ్వసృష్టి విధాయకం పునరేవ పాలన తత్పరం।
సంహరం తమపి ప్రపంచ మశేషలోకనివాసినమ్ ।
క్రీడయంత మహర్నిశం గణనాథయూథ సమావృతం ।
చంద్రశేఖర మాశ్రయే మమ కింకరిష్యతి వై యమః ॥

తా. బ్రహ్మస్వరూపముచే సృష్టి జేయువాడును, విష్ణు రూపంబుచే బరిపాలించువాడును, రుద్రరూపంబుచే నంత మొందించువాడును, సమస్తలోకంబులయందును క్రీడించువాడును, ప్రమధగణంబులచే బరివేష్టింపబడువాడును, నహర్నిశంబులు నాగణంబులతో గ్రీడించువాడు నగు నీశ్వరు నాశ్రయించెదను. ఈ యము డేమిసేయగలవాడు.

శ్లో॥ సంసార సర్పదష్టానాం జంతూనా మవివేకినాం ।
చంద్రశేఖర పాదాబ్జ స్మరణం పరమౌషధమ్॥ ౪౬

తా. సంసారమను సర్పముచే గరువబడినవారైన బుద్ధిహీనులగు జంతువులకు చంద్రశేఖరపాదముల ధ్యానమే పరమంబగు దివ్యౌషధము.

శ్లో॥ రుద్రం పసుపతిం స్థాణుం నీలకంఠ ముమాపతిం।
నమామి శిరసాదేవం కింనోమృత్యుః కరిష్యతి॥

తా. సమస్త దుఃఖముల బాపువాడును, సమస్త జీవులకు ప్రభువైన వాడును గరళము మ్రింగుటచే నల్లనైన కంఠము గలవాడును, పార్వతీపతియు నగు పరమశివునకు వందనము చేయుచున్నాను. ఈమృత్యువు నన్నేమి చేయగలదు.

శ్లో॥ కాలకంఠం కలామూర్తిం కాలాగ్నిం కాలనాశనం ।
నమామి శిరసాదేవం కింనో మృత్యుః కరిష్యతి॥ ౪౭

తా. కాలకూటము మెసవుటచే నల్లని కంఠముగల వాడును, కాలాగ్నియైన వాడును, తేజోమూర్తియు,

యమాంతకుండును నగు పరమేశ్వరునకు నమస్కరించు చున్నాను. మృత్యువు నన్నేమి సేయగలదు.

శ్లో॥ అంతమవ్యయ సంకాశం అక్షమాలాధరం హరం ।
నమామి శిరసా దేవం కింనో మృత్యుః కరిష్యతి॥ ౪౯

తా. ఆదిమధ్యాంతరహితుడు, శాశ్వతుడును, శమ గుణంబుచే నొప్పువాడును, జపమాలిక ధరించినవాడును, సమస్త పాపముల బోగొట్టువాడును నగు పరమేశ్వరుడగు చంద్రశేఖరు నాశ్రయించెదను. ఈ యము డేమిసేయగలడు.

శ్లో. ఆనందం పరమం నిత్యం కైవల్యపదకారణం ।
నమామి శిరసా దేవం కింనో మృత్యుః కరిష్యతి ॥ ౫౦

తా. ఆనందస్వరూపుడును, శ్రేష్ఠుడును, శాశ్వతుడును, మోక్షప్రదుడగు నీశ్వరు నాశ్రయించెద, ఈ యము డేమిసేయగలడు.

శ్లో. దేవదేవం జగన్నాథం దేవేశం వృషభధ్వజం ।
నమామి శిరసా దేవం కింనో మృత్యుః కరిష్యతి ॥ ౫౧

తా. ఇంద్రాదిదేవతలకు దేవుడుగాన జగత్పతియైన వాడును దేవతలకుఁ బ్రభువగువాడును, వృషభధ్వజుడును నగు సాంబశివుని శిరసా నమస్కరించుచున్నాను. మృత్యు వేమి సేయగలదు.

శ్లో. స్వర్గాపవర్గదాతారం సృష్టిస్థిత్యంతకారణం ।
నమామి శిరసాదేవం కిం నో మృత్యుః కరిష్యతి ॥ ౫౨

తా. మోక్షము నిచ్చువాడును. సృష్టిస్థితిలయములకు కారణమైనవాడు నగు నీశుని సేవించెదను. మృత్యు వేమి సేయగలదు

శ్లో. గంగాధరం శశిధరం శంకరం శూలపాణినం।
నమామి శిరసా దేవం కింనో మృత్యుః కరిష్యతి॥ ౫౩

తా. జటాజూటంబున గంగను ధరించినవాఁడును, చంద్రుని శిరంబున ధరించినవాడును, శూలమును కేలధరించినవాడును నగు శంకరు నాశ్రయించుచున్నాను. యము డేమి సేయును.

శ్లో. భస్మోద్ధూళిత సర్వాంగం నాగాభరణ భూషితం।
నమామి శిరసా దేవం కింనో మృత్యుః కరిష్యతి॥ ౫౪

తా. విభూతిధారణముచే శోభిల్లుచున్న సకలావయవములు గలవాడును, సమస్తావయంబులయందు సర్పములే యలంకారములుగాగల యీశునకు నమస్కరించుచున్నాను. మృత్యు వేమిచేయ నోపును.

శ్లో. అథామరయుతో బ్రహ్మా పార్షదైరన్వితో హరిః।
ఆజగ్మురేకదా తత్రతస్మింతం శంకర మచ్యుతమ్।
శూలినం ద్రష్టుకామా స్తే బ్రహ్మాద్యానయ ఏవచ॥ ౫౫

తా. ఇట్లు మార్కండేయముని శంకరుని వినుతించిన పిదప, దేవతలతో కూడి బ్రహ్మయు, భక్తులతో కూడిన విష్ణుమూర్తియు ఒకపర్యాయమే వచ్చిరి. ఆ మార్కం

డేయుని దగ్గర నిలుచున్న భక్తసుఖకరుడును, నాశరహితుడును, శూల మాయుధముగా గలవాడును అగు శివుని చూడ గోరి ప్రసిద్ధులగు బ్రహ్మర్షులు కూడ అక్కడకు వచ్చిరి.

శ్లో॥ సంపూజ్య తే మహాదేవం ప్రణయిత్వా పినాకినమ్ ।
ఊచుర్మహోగ్రరూపం తం కాలకాలం పరాత్పరమ్॥౫౬

తా. అట్లు వచ్చినవారందరు పినాకమను ధనుస్సును ధరించిన శంకరుని వినుతించి, చూడ తరముగాని ఆకృతిని బూనియున్నవాడును, పరాత్పరుడును, అంతకాంతకుడును అగు శివునితో నిట్లు పలికిరి.

శ్లో॥ లోకాన్ రక్ష మహాదేవ కాలంచ భయపీడితమ్ ।
రక్ష రక్ష కృపాసింధో మా భూల్లోకవిపర్యయః॥ ౫౭

తా. ఓ మహాదేవా! జగములను కాపాడుము. భయముచే బాధింపబడుచున్న యమునికూడ రక్షింపుము. దయాసాగరుడవగు ఓ శంకరా! లోకములు తలక్రిందులు గాకుండునట్లు చేయుము.

శ్లో॥ కాలే హతేతు జంతూనాం వినాశః క్వభవిష్యతి ।
విధినా నిర్మితో మృత్యుర్మాభూత్తస్యలయః ప్రభో॥౫౮

తా. యముడు నశించెనేని ప్రాణులకు వినాశము ఎట్లు కలుగును? మృత్యువు విధిచేత నిర్మితమైనది. అట్టి యమునకు నాశనము కలుగకుండునట్లు కాపాడుము.

శ్లో॥ అస్మద్వాక్యం వేదవాక్యం సమ్యగ్దృష్ట్వామహాప్రభో!
కాలం రక్ష విధిప్రోక్తం ధర్మం రక్షమహాద్యుతే ౫౯

తా. మహాప్రభో ! మా అందఱ మాటను మన్నించి యముని కాపాడవలసినది. అనిర్వచనీయ తేజశ్శాలివగు ఓ శంకరా ! కర్మము ప్రతిపాదించిన ధర్మమును కాపాడ వలసినది.

శ్లో॥ తద్భక్తస్య మహాబుద్ధే ర్మార్కండేయస్య శంసతః ।
ప్రదాస్యామో వరం సర్వే కాలం రక్షపరంతప॥ ౬౦

తా. మహామతియై నిన్ను నుతించుచున్నవాడును, నీకు భక్తుడును అగు మార్కండేయునకు ఇందున్న మేమందరము వరముల నొసంగుదుము. ఓ పరంతపా ! యముని కాపాడవలసినది.

శ్లో. ఇతి బ్రువత్సు బ్రహ్మాది ష్వీశ్వరః కరుణోదధిః ।
క్రోధం త్యక్త్వా సుస్మితాస్య ఇదంవచనమబ్రవీత్ ॥ ౬౧

తా. ఇట్లు బ్రహ్మాది దేవతలు పలుకుచుండగా, కృపాసాగరుడగు ఈశ్వరుడు, క్రోధమును వదలి, చిరునవ్వుతో గూడిన మోము కలవాడై యిట్లు పలికెను.

శ్లో. యుష్మద్వాక్యం హి మద్వాక్యం న భేదోఽస్తికథంచన।
రక్షామ్యహ స్సూర్యతనయం వరం దాస్యథమానవే ।
మృత్యోర్భీతాయ శాంతాయ యుష్మద్భక్తాయధీమతే ॥

తా. మీ మాటయే నామాట కదా ! యముని కాపాడుచున్నాను. యమునకు భయపడి మానవ్రతుడైన వాడును, జ్ఞానియు. మీకు భక్తుడును అగు మార్కండేయునకు వరముల నొసంగుడు.

శ్లో. శంభుప్రోక్తం హితం వాక్యం శ్రుత్వావిధిహరీ ముదా
ప్రార్థయామాస తు శ్శంభుం నీలకంఠం శ్రుతిస్తుతమ్ ౬3
ఆదావరందదప్రీత్యా పరందాస్యావ ఈప్సితమ్ ।
తథా స్త్వితాఽవిరాసీ ద్వాక్ శం భువక్త్రాత్కృపాకరాత్ ॥

తా. ఇట్లు శంకరునిచే చెప్పబడిన మంచిమాటను సంతోషముతో విని. బ్రహ్మయు, విష్ణువును, నల్లని కంఠము గలిగి వేదవినుతుడగు ఈశ్వరుని యిట్లు వేడిరి. మొదట నీవే వరము నొసంగవలసినది. పిదప సంతోషముతో మేము వరముల నొసంగెదము. కృపాకరుడైన శంభు వదనము నుండి "అట్లే అగుగాక" అను వాక్యము వినబడెను.

శ్లో: అనంతరం మహాదేవో మార్కండేయం వ్రతస్థితం ।
ప్రసాదాభిముఖోభూత్వా వాక్యమే తదువాచహ॥ ౬౪
కల్పాయుర్దేహి మే పూర్ణమిత్యహం ప్రార్థిత స్త్వయా ।
దాస్యామి బహుకల్పాయుర్వావదాయురరోగతామ్॥
దాస్యామి సృష్టి కర్తృత్వం గృహాణ మునిపుంగవ ।
ఉవాచైన మథశ్రీమాన్ హరిర్మునివరాత్మజమ్। ౬౭
జ్ఞానం సునిర్మలం ప్రీత్యోదాస్యామి మునిపుంగవ ।
తతోవిధి రువాచైవం సర్వలోకగతిం మునే ॥ ౬౮
శాంతం దాస్యామి ప్రీత్యాహం యథేచ్ఛంచర సువ్రత.
అథ సూర్యసుతం కాలమూచుస్తేతు త్రిమూర్తయః॥
బుద్ధియుక్తో మహాదేవ భక్తాన్ పాలయ సాదరం ।
హరిభక్తాన్ బ్రహ్మభక్తాన్ సదా సంపరిపాలయ॥ ౭౦

తైరేవముక్తః కాలస్తు తాన్ ప్రణమ్యాసురేశ్వరాన్ ।
తదాజ్ఞాం శిరసా ధృత్వాస్వం లోకం పునరభ్యగాత్ ॥

తా. తరువాత శంకరుడు నియమము బూనియున్న మార్కండేయ మునిని గూర్చి యిట్లు పలికెను. "బ్రహ్మ కల్పమువరకు ఆయుస్సును నొసంగవలసినదిగా నీవు కోరితివి. ఐనను అనేక బ్రహ్మకల్పములు జీవించునట్లు ఆయుస్సు నొసంగుచున్నాను. సృష్టిచేయు శక్తిని గ్రహింపవలసినది" తరువాత నిరుపమానైశ్వర్య విరాజమానుడగు నారాయణ మూర్తి మార్కండేయుని గూర్చి యిట్లు పలికెను. "ఓ మునీశ్వరా! నీకు స్వచ్ఛమైన జ్ఞానమును ఇచ్చుచున్నాను."

తరువాత బ్రహ్మ యిట్లు పలికెను. "ఓ మహామునీ! సర్వలోకములను చూడబోవునట్టి గమనమును, ఓర్పును, ఇచ్చుచున్నాను. నీ యిష్టము వచ్చినట్లు తిరుగవచ్చును."

తరువాత బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సూర్యపుత్రుడగు యముని గురించి యిట్లు పలికిరి. "ఓ యముడా! జ్ఞానము గలిగి, శివభక్తులను, విష్ణు భక్తులను, బ్రహ్మ భక్తులను ఆదరముతో ఎల్లకాలము కాపాడుము." ఇట్లు త్రిమూర్తులచే చెప్పబడగా యముడు వారలకు నమస్కరించి, వారి ఆజ్ఞను పొంది తన నివాసమగు దక్షిణదిశయందున్న పురమును చేరెను.

శ్లో॥ తతో మృకండుతనయః పునః స్వాశ్రమమభ్యగాత్ ।
మాతరం పితరం నత్వా ప్రాణ్మా సాంతికవాసరే॥ ౭౨

స్వనాశదుఃఖశోకాబ్ధౌ మగ్నౌ తావాజుహావ సః।
ఆలింగ్య పితరౌ పుత్రం దృఢం పశ్చాన్ముదాభృశమ్॥
ఆనందబాష్పధారాభి శ్శీతాభీ ర్లోమహర్షణౌ ।
నాన్వశోచయతాం పుత్రమాత్మనో సుఖజీవనం॥ ౭౪

తా. పిమ్మట మార్కండేయుడు తన యాశ్రమంబునకు వచ్చి తన మృతికై వగచు తల్లిదండ్రులను నమస్కరించి వారి నామంత్రణంబు సేసి యా వృత్తాంతము నంతయు పూసగ్రుచ్చినట్లు చెప్పెను. అది విని మాతాపితలు మిగుల సంతసించి చింతవీడి సుఖంబుగ నుండిరి.

శ్లో. ఏవం లబ్ధవరః శంభోర్మార్కండేయో మహాముని ।
అమృతత్వ మనుప్రాప్య దదర్శ ప్రళయాన్ బహూన్॥

తా. మార్కండేయ మహాముని యీశ్వరునివలన నీప్రకారము వరములనంది మరణము లేనివాడు గనుక ననేకములగు ప్రళయములను జూచెను.

శ్లో. పితృభ్యాంసహితస్సో౽థ మార్కండేయ స్తపోధనః ।
శంకరం ప్రణమన్ భక్త్యాస్వాశ్రమే న్యవసత్ సుఖీ॥ ౭౬

తా. పిమ్మట మార్కండేయ మహర్షి తల్లిదండ్రులతోగూడి భక్తితో నీశ్వరుని నమస్కరించుచు సుఖంబుగ తన యాశ్రమమునందుండెను.

ఇతి వ్యాసప్రోక్తే మార్కండేయ పురాణాంతర్గతే శ్రీ భావనాఋషి మాహాత్మ్యే త్రిమూర్తి సాక్షాత్కారో నామ

తృతీయో౽ధ్యాయః.

—౦—

# భావనాఋషి మాహాత్మ్యమ్



## చతుర్థోఽధ్యాయః

ఋషయః ఊచుః = ఋషులు పలికిరి.

శ్లో. భగవన్మునిశార్దూల శ్రుత పూర్వాః కథా ఇమాః ।
తదనంతరవృత్తాంతం విస్తరాద్వక్తు మర్హసి ॥ ౧

తా. ఓ సూతమహామునీ! ఈ కథలు పూర్వము వినినవేను. ఆవల వృత్తాంతమును విపులముగా వినిపింపుము.

శ్లో. శృణుధ్వంఋషయః సర్వేచరిత్రం మహదద్భుతం ।
భూమాముని స్సమాస్థాయ కృతవాన్ మహదద్భు
తాన్ ॥ ౨

లోకే విరాట్త్వం సంప్రాప్యదదర్శప్రళయాన్ బహూన్ ।
తద్వో విస్తరతో వక్ష్యే సావధానా శ్శృణ్వంతు భోః ॥ 3

తా. ఓ మునులారా! మార్కండేయుడు భూమియందున్నవాడై యనేక వింతలను జూచెను. ఆ చరిత్రమును విస్తరించి తెలుపుచున్నాను. సావధానులై వినుడు.

శ్లో. నిమేషాదశ చాష్టౌచ కాష్ఠాకాల ఉదాహృతః ।
త్రింశత్కాష్ఠాః కళా మాహుస్తాస్తు త్రింశత్క్షణా స్తథా ।
ద్వాదశక్షణ సంఘస్తు సుముహూర్త ఇతి స్మృతః ।
తేతు త్రింశదహోరాత్రం పక్ష స్తేదశ పంచచ ॥ ౪

పక్షద్వయేన మాసస్స్యా దృతుర్మాసద్వయేనచ ।
ఋతుత్రయేణాప్యయనం ఉదగ్దక్షిణ సంజ్ఞకమ్ ॥ ౬
వత్సర స్తద్వయేనాసీ దేవ వై నర మానతః ।
తే సప్త దశలక్షాణా మష్టా వింశతి రేవచ ॥ ౭
సహస్రాణాంచ కాలస్స్యా త్పురా కృత యుగేపునః ।
లక్షద్వాదశకంచైవ సహస్రం షణ్ణవత్యహో ॥ ౮
ఏష వై వత్సరాణాంతు త్రేతాయాం పరికీర్తితః ।
అష్టలక్షం చతుష్షష్టి సాహస్రం ద్వాపరే యుగే ॥ ౯
చాతుర్లక్షంచ సాహస్రం ద్వాత్రింశత్సముదాహృతం।
కలౌ చతుర్భిస్త్రై రేవ మహాయుగముదాహృతమ్ ॥ ౧౦
తేషాం ద్విసప్తతిశ్చైవ మన్వంతర ముదాహృతం ।
చతుర్దశమనూనాంచ నాశే త్వింద్రదినం స్మృతం॥ ౧౧
తతష్షట్త్రింశదింద్రాణాం వినాశే బ్రహ్మణోదినం ।
నష్టే బ్రహ్మణి కస్మింశ్చ సకాలః కల్ప ఈరితః ॥ ౧౨

తా. పదునెనిమిది నిమిషము లొక కాష్ఠము. ముప్పది కాష్ఠము లొక కళ. ముప్పదికళ లొక క్షణము. పంద్రెండు క్షణము లొక కాలము (ముహూర్తము). ముప్పది ముహూర్తము లొక యహోరాత్రము. పదిహేను దినము లొక పక్షము. రెండు పక్షము లొక మాసము. రెండు మాసము లొక ఋతువు. మూడు ఋతువులు ఉత్తర దక్షిణాయనము లను నయనములలో నొకటియగు. ఆ రెండయనములు చేరిన వత్సరంబగు. ఇది మనుజుల కాలపరిమాణము. పదునేను

లక్షల యిరువది యెనిమిదివేల వత్సరములు కృతయుగ ప్రమాణము. పం(డెండు లక్షల తొంబది యారువేలు త్రేతా యుగమునకు, ఎనిమిది లక్షల అరువది నాలుగు వేలు ద్వాపర యుగమునకు, నాలుగు లక్షల ముప్పది రెండువేలు కలియుగ మునకు ప్రమాణము. ఆ నాలుగు యుగము లొక మహాయుగ మగును. డెబ్బది రెండు మహాయుగము లొక మన్వంతరము. పదునాలుగు మన్వంతరములు ఇంద్రున కొకదినము. ముప్పది యారు ఇంద్రదివసంబులు బ్రహ్మకొక దివసంబు. ఆ బ్రహ్మ లయం బందిన కల్పంబు.

శ్లో. తదాతు ద్వాదశాదిత్యాః ప్రతపంతి మహౌజసః ।
వాంతి ఝంఝానిలాః సప్తసవేగాత్సర్వతోదిశః ॥ ౧౩
వర్షన్తి కరితుండాభిర్ధారా భిర్వారిదా నవ ।
తదేకార్ణవసంకాశం బ్రహ్మాండం చ భవేత్తతః ॥ ౧౪
తస్మిన్ జలమయే జాతే తతో వైకుంఠ నాయకః ।
వటపత్రశయానస్సన్ ఏక ఏవ పరః పుమాన్ ।
యోగనిద్రా సమారూఢః స్వపతే ఉంగుష్ఠమాత్రకః ॥

తా. ప్రళయకాలంబున పం(డెండుగురు సూర్యులు మిక్కిలి తేజస్సు గలవారై తపించుచున్నారు. సప్తమారుత ములు మిక్కిలి దిక్కులు పిక్కటిల్ల విసరును. నవమేఘ ములు ఏనుగుతొండము ప్రమాణధారతో వర్షించును. జగమంతయు నొకటే సముద్రమయమగును. అప్పుడు

శ్రీ మహావిష్ణువు అంగుష్ఠమాత్ర శరీరుడై వటపత్రమున శయనించి యోగనిద్ర నందియుండును.

శ్లో॥ తదాశివార్చనార్థం హి శివలోకం గతో మునిః ।
జానుదఘ్నజలో భూత్వా సర్వతో విచచారహ॥ ౧౬

తా. పరమపురుషుడగు నారాయణుడు యోగనిద్రలో నుండగా మార్కండేయుడు శివార్చనము కొరకు కైలాసమున కరిగి మోకాటిలోతు నీరుగలవాడై సంచరించెను.

శ్లో॥ ఏవంబహూన్ బ్రహ్మకల్పాన్ పశ్యన్ లోకాంస్తథా మునిః।
బ్రహ్మవిష్ణుమహేశానా మర్చనంచ దినేదినే ।
తత్త్వయోగరతః కుర్వన్ స్థితః తత్త్రప్రభావతః॥ ౧౭

తా. ఆ మార్కండేయుడు పరతత్త్వమందును, నియమములందును మిక్కిలి యాసక్తిగలవాడై వాని మహిమల ననుసరించి చరించుచుండెను.

శ్లో॥ తతో విచరితే కాలే బ్రహ్మ లోక పితామహః ।
పద్మనాభోదరాంభోజే బభూవచ చతుర్ముఖః ॥ ౧౮

తా. ప్రళయకాలము బహుకాలము జరుగగా, విష్ణుమూర్తి నాభికమలమందుండి చతుర్ముఖుండగు బ్రహ్మయుదయించెను.

శ్లో॥ తత ఓంకార ఆదిష్టః పురుషేణ పరేణసః ।
తత్ప్రభావేన మహతా బ్రహ్మ లోకాన్ ససర్జహ॥ ౧౯

తా. బ్రహ్మ నాభికమలమునందుండి జన్మించిన పిదప శ్రీమహావిష్ణువు ప్రణవ ముపదేశించెను. నలువ యామహిమచే నెల్లలోకంబుల సృష్టించెను.

శ్లో॥ సృష్ట్వైవ సర్వతోలోకాన్ తేషు సర్వేషు లోకకృత్ ।
దేవాన్ దైత్యాంశ్చమనుజాన్ ఋషిమిశ్రాంశ్చ సర్వశః॥ ౨౦
బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ శూద్రాన్మిశ్రాంశ్చ సంకరాన్ ।
సృష్ట్వా సమస్తవస్తూని మనస్యేవ మభావయత్॥ ౨౧

తా. లోకకర్తయగు బ్రహ్మ సమస్తములగు వస్తువులను, ఋషులను సమస్త జాతులను సృష్టించి, యీప్రకారము మనసున దలచెను.

శ్లో॥ సర్వం సృష్టం జగజ్జాతం, వస్తుజాతం తథైవచ ।
జంతుజాతం చ తద్వచ్చ పంచభూతాత్మకం తథా॥౨౨
దృశ్యతే నగ్నతా తేషు కరిష్యే కి మతః పరం ।
ఏపంచితయమానస్య మనసా బ్రహ్మణ స్తదా ।
సంబభూవ మహాభాగః దివ్యతేజ స్సమావృతః॥ ౨౩

తా. బ్రహ్మదేవుడు సమస్తము నీరీతి సృష్టించి వారియందు దిగంబరత్వమును జూచి చింతించుచుండగా, నలువ మనస్సుచేత మిక్కిలి తేజశ్శాలియగు నొక దివ్యపురుషుడుదయించెను.

శ్లో॥ తం దృష్ట్వా లోకకృద్బ్రహ్మ వాక్యమే తదువాచహ ।
భోభోవత్సమహాభాగ ! కోఽసి త్వం భావనాభవః॥ ౨౪
ఇత్యుక్తః స మహాభాగో బ్రహ్మణాచేద మబ్రవీత్ ।
బ్రహ్మన్ త్వయైవ సృష్టాని జగన్త్యప జగన్తిచ॥ ౨౫
మాంచైవ సృష్టవానద్య కథం కస్త్వంబ్రవీషిభో ।
మయా కార్యం భవత్సృష్టో లోకేషు కి మహోచ్యతామ్॥ ౨౬

తా. బ్రహ్మదేవుడా భావనా పురుషుని నీవెవ్వరు? అని యడుగగా నాభావన పురుషు డిట్లనియె. ఓ పితామహా! నీచే సమస్తలోకములు సృష్టింపఁబడియె. నేనును నీచే సృష్టింపబడితిని. ఎఱిగియు నన్నేల యడిగెదరు? నీ సృష్టించిన లోకంబులలో నా యొనర్పదగిన కార్య మెయ్యది?

శ్లో॥ ఇత్యుక్తః పునర్బ్రహ్మా చైనం విచార్య చ పునఃపునః ।
కరిష్యతి మహాయాగం మార్కండేయర్షి సత్తమః॥ ౨౭
తస్మిన్ లోకోపకారార్థం జన్మప్రాప్యభవాన్ పునః।
విష్ణ్వీశాద్య మరాణాంచ ప్రీతిపాత్రం భవిష్యతి॥ ౨౮
అతస్తద్యాగకాలస్య త్వం ప్రతీక్షాపరో భవ ।
ఇత్యుక్తో బ్రహ్మణా సోఽథ తత్రప్రతీక్షాపరో భవత్ ॥

తా. భావనపురుషు డీరీతి పలుకగా బ్రహ్మ పలుమారు చింతించి యిట్లనియె. వత్సా! మార్కండేయుడు యాగము చేయబోవును. అప్పుడు నీవు విష్ణువు మొదలగు

దేవతల యుపకారార్థము హోమకుండమున పుట్టవలయును. దాన నీవు సమస్త దేవతలకు ప్రీతిభాజనము కాగలవు. అంత వరకు నిరీక్షింపు మనిమెను. భావనపురుషుడును బ్రహ్మ యానతి ననుసరించి వేచియుండెను.

శ్లో. తతో విశాలనగరే శంబరాన్వయ వర్ధనః ।
కాళువాసైనికోనామ మహాబల పరాక్రమః ॥ 30
స తు ఘోరేణ తపసా బ్రహ్మాణం పరమేష్ఠినం ।
తోషయిత్వా తు దైత్యేంద్రః తస్మాదాప వరాన్ బహూన్ ॥ 31
తేనో ద్విగ్నాః ప్రజాస్సర్వే సురాస్సేంద్రా మహర్షయః।
అయోనిజేన పుంసాచ సద్యోజాతాయుధేనచ ।
వధః ప్రకల్పితస్తస్య తేనైవ బ్రహ్మణా పురా ॥ 32

తా. పిమ్మట విశాలనగరమున శంబరాసురవంశ సంభూతుడగు కాళువాసైనికాసురుడు బ్రహ్మను గూర్చి ఘోరతపం బొనర్చి సమస్త వరము లందియుండెను. సమస్త దేవతలు మహర్షులు మొదలగు జనులందరు వానిచే పీడింప బడిరి. పూర్వమునందే, అయోనిజునిచేతను సద్యోజాతా యుధునిచేతను మరణము కలుగునట్లు విధిచే నిర్దేశింప బడిమెను.

శ్లో॥ అతోదృప్తేన దైత్యేన భీతాస్సర్షిగణాస్సురాః ।
శ్వేతద్వీపం సమాసాద్యచక్రిణం శరణం గతాః ।
తత్ర దృష్ట్వా రమానాథం వాగ్భిరగ్ర్యాభిరస్తువన్ ॥ 33

తా. ఈ కాళువా సైనికాసురుడు సమస్త ఋషులను, దేవతలను పీడింపగా వారలు శ్వేతద్వీపమున కరిగి, యందు శ్రీమన్నారాయణుని పొడగాంచి సమస్కరించి శ్రేష్ఠములైన వాక్కులతో స్తోత్రము చేసిరి.

శ్లో. తతః ప్రసన్నో భగవాన్ ప్రోవాచ ససురాన్ ప్రతి ।
హరిః కి మర్థ మాగతా యూయం స్వాగతం
సర్వ యస్సురాః ॥ ౩౪
ఇత్యుక్తాస్తే సురా ఊచుర్భగవంత మధోక్షజం ।
త్వయాకృతావలంబానాం సర్వదా కుశలం హి నః॥౩౫

తా. పిమ్మట శ్రీ మహావిష్ణువు వారి స్తోత్రముల కానందించి యిట్లనియె. దేవతలారా! ఋషులతోగూడ యేల వచ్చితిరి. మీకు స్వాగతమేకదా యనగా దేవతలిట్లనిరి. స్వామీ మీచే పరిపాలింపబడు వారలమగు మాకు సుఖమేకదా.

శ్లో. అవధారయ దేవేశ మదీయాగమనం విభో ।
కాళువా సైనికోనామ రాక్షసః శంబరాన్వయః ॥ ౩౬
దృప్తో బ్రహ్మవరాత్సోఽయం తద్భయం నసహామహే।
ఇత్యుక్తో భగవానాహ దేవాన్ ప్రతిసమాహితః॥ ౩౭
లోకానుగ్రహణార్థాయ బ్రహ్మమానస సంభవః ।
మదంశ సహితో వీరః యజ్ఞవహ్నౌ భవిష్యతి ॥ ౩౮
తేన నాశోభ వేదస్య నాన్యైరపిసురాసురైః ।
ఇత్యుక్త్వాం తర్దధే విష్ణుస్త్రపతీతాపరాః సురాః । ౩౯

తా. దేవతలకు ప్రభువగు నో యీశ్వరా! శంబరా న్వయ సంభూతుడగు కాళువా సైనికాసురుడు మమ్ములను కష్టపెట్టుచున్నాడు. వాని భయమును సహింపలేకున్నాము. అనగా విష్ణువు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను. సురులారా! బ్రహ్మ మానసపుత్రుడై నా యంశతో గూడుకొని యజ్ఞ కుండమం దుద్భవించెడు వీరుడా రక్కసు నుత్తరించునని యంతర్హితు డయ్యెను. దేవతలు భావనావీరుని యుత్ప త్తికై వేచియుండిరి.

శ్లో. తతో మహతి కాలేతు బ్రహ్మా లోకపితామహః ।
కైలాసమగమద్దేవైస్సహశంకర మీక్షితుం ।
తం వీక్ష్యానామయం పృష్ట్వాశంకరో వాక్య మబ్రవీత్ ।

తా. పిమ్మట కొంతకాలమునకు బ్రహ్మ దేవతలతో కైలాసంబున కేగెను. ఈశ్వరుడు వినాత్మని స్వాస్థ్య మడిగి ఇట్లనియె.

శ్లో. బ్రహ్మణే విధే మహాభాగ స్రష్టాసి త్వం ప్రజాపతిః ।
దేవాశ్చ ఋషయస్సర్వే మనుజాశ్చస్త్రియస్తథా ॥ ౪౧
అన్యేచయే త్వయా సృష్టా యేవా త్రైలోక్యవర్తినః ।
మంత్రవస్త్ర ధరాస్సర్వే పర్ణ పల్కల ధారిణః ॥ ౪౨
అలంకారై ర్నశోభంతే భూషా స్రక్చందనాదిభిః ।
రూపై ర్వారుచిరై ర్లోకే వస్త్రహీనతయా విధే ।
అతో యతస్వ సృష్ట్యర్థం వస్త్రాణాం భారతీపతే ॥ ౪౩

తా. ఓ విధాతా! సమస్త ఋషులు దేవతలు మను జులును నీచేత సృష్టిచేయబడిరి. వీరందఱు మంత్రవస్త్రము లను, పర్ణ వల్కలములను ధరించుచున్నారు. వస్త్రహీనత వలన వీరు రూప భూషాస్రక్చందనాదులచే శోభించుటలేదు. కనుక వస్త్రములను సృష్టిచేయుటకు ప్రయత్నింపుము.

శ్లో. తచ్ఛ్రుత్వా వచనం తస్య శివస్య స పితామహః ।
పురాత్మ నిశ్చితం కార్యం సత్యమేవేత్యమన్యత ॥ ౨౨
తతో మృకండు తనయం విలోక్య శివసన్నిధౌ ।
తదా ప్రజాపతిః ప్రీత్యా వాక్య మేతదువాచహ ॥ ౨౩
మునినాథ మహాప్రాజ్ఞ మత్తో ఽధికతరో భవాన్ ।
సప్తకోటి మహర్షీణాం నాన్యం పశ్యామి తే సమం ॥ ౨౪

తా. పిమ్మట బ్రహ్మ యీశ్వరుని పలుకు లాల కించి తాను మున్నూహించిన కార్యము నిక్కమని సంత సించి యీశ్వర సన్నిధి నున్న మార్కండేయుని కన్గొని యిట్లనియె. మునీంద్రా! నీవు నాకంటె నధికుడవు. సప్తకోటి మునీంద్రులలో నీకు సముడు లేడు.

శ్లో. యస్మాత్త్వయా జగజ్జాతం దృష్టపూర్వం మునీశ్వర ।
తతో యాచేహ మధునా త్వాం సహస్రవిధిప్రభుమ్॥ ౨౫
మత్సృష్టిం సర్వతః పశ్యన్ శంకరః ప్రాహ సన్ముఖః ।
అనాచ్ఛాదనమే తద్ధి జగజ్జాతం విధే భవేత్ ॥ ౨౬
అతో వసన నిర్మాణ చింతాం కుర్వీత్వ ఖాషత ।

భవాన్ హి తదుపాయజ్ఞో యజ్ఞం కురు మహామతే।
త్వత్కృతేష్ట్యాం సముద్భూతః కరిష్యతి మనోరథమ్॥

తా. ఓ మార్కండేయ మహాముని! భగవంతుడగు శ్రీ మహావిష్ణువు ప్రళయకాలంబున వటపత్రమునందు శయనించియున్న కాలమున నీవు లోకమంతయు నశించుచున్నది గదా, మనముమాత్ర మిక్కడ నుండుటలో నేమి ప్రయోజన మున్నది. సముద్రములో మునిగియైన బోవుదమను తలంపుతో సముద్రమంతయు సంచరించగా జాను ప్రమాణ జలమయమై యుండెను.

సముద్రములో బ్రవేశించినను మన కీవిధముగ నున్నదని యంగుష్ఠమాత్ర శరీరుడై వటపత్రమున యోగనిద్ర నధిష్ఠించిన విష్ణుమూర్తి కుక్షిలోఁ బ్రవేశించి సమస్తలోకములను జూచియున్నావు. నీకన్నియు దెలియును. నా యొనరించిన సృష్టిలో మనుజులకు నగ్నత చూపట్టుచున్నదని పరమశివుడు పలికెను. కనుక మీరు నాకన్న నెక్కుడు. మీరిందుకు సహాయార్థము యజ్ఞ మాచరింపుడు. అందుదయించు మహాపురుషుడీ కొఱత దీర్చును. ఆ యాగము శీఘ్రముగా జేయుము.

శ్లో. ఇతి ప్రార్థయ మానస్య శ్రుత్వా తద్బ్రహ్మణో వచః।
తథామిత్య బ్రవీత్ సోఽథమార్కండేయో మహామునిః।
జగ్మతుస్తౌ స్వభవనం ప్రజాపతి మృకండుజౌ॥ ౫౦

తా. తరువాత మార్కండేయమహాముని బ్రహ్మ యొక్క ప్రార్థనము నంగీకరించి వల్లెయని పలికెను. అంతట ప్రజాపతియు మార్కండేయుడును తమ స్థానములకు వెళ్ళిరి.

శ్లో. స్వభవనముపగతస్సహర్షివర్యో ।
యజన ముపక్రమణే సమాహితాత్మా ।
శుభదివస మవలోక్య యాగభారాన్ ।
సమభాగతో మఖమ కరోన్మునీంద్రః ॥ ౫౧

తా. పిమ్మట మార్కండేయ మహాముని తన యాశ్రమమును ప్రవేశించెను. పిదప శుభదిన మాలోకించి యజ్ఞ సంభారముల నంది క్రతువుచేయ నారంభించెను.

శ్లో. సబ్రహ్మదధ్యౌ హృది సన్నివిష్టం ।
వరం సృజన్ సృష్టి విధానయోగం ।
సమాధియోగేన నిమీల్య చక్షుషీ ।
స్థిత స్తతో యోగవిదాం పురోగమః ॥ ౫౨

తా. యోగవేత్తలలో నుత్తముడగు మార్కండేయుడు సమాధియోగముచేత శ్రేష్ఠమైన పరబ్రహ్మను మనమున దలచెను.

ఇతి శ్రీ వేదవ్యాస ప్రోక్తే మార్కండేయ పురాణాంతర్గత భావనాఋషి మహాత్మ్యే యాగోపక్రమోనామ చతుర్థోఽధ్యాయః.

—()—

# భావనాఋషి మాహాత్మ్యమ్



పంచమోఽధ్యాయః,

శ్లో. భవద్వచస్సుధాయాశ్చ సుధాయాన్తాంతరం మునే।
మార్కండేయస్య మఖజం చరిత్రం బ్రూహి నః పరం॥౧

తా. ఓ సూతమహాముని ! నీవాగమృతము సిద్ధామృతమునకన్న నెక్కువ మధురముగ నున్నది. ఆవల మార్కండేయ యజ్ఞమున విశేషములను మాకు వినిపింపుడు.

సూతః। అతఃపరం ప్రవక్ష్యామి చరిత్రం యజ్ఞసంభవం।
యచ్ఛ్రుత్వాముచ్యతే లోకే సర్వపాపై రహోజనాః॥౨

తా. ఓ మునులారా! మార్కండేయ మహాముని యజ్ఞమునందు జరిగిన వృత్తాంతమును జెప్పుచున్నాను. ఆ వృత్తాంతమును వినినవారలకు సమస్త పాపములు నశించును.

శ్లో. తతో మృకండుతనయో వార్షికం సత్రమారభత్ ।
పూర్వం గజాననం నత్వా మంత్రైస్త్రైశ్శ్రుతి చోదితైః॥ ౩
సంకల్పవిధివద్దేవం సప్తజిహ్వాం హుతాశనం।
ప్రతిష్ఠాప్య తదా కుండేయష్టుం సముపచక్రమే। ౪

తా. పిమ్మట మార్కండేయ మహర్షి సంవత్సరము చేయవలసిన సత్రయాగమను పేరుగల క్రతువు నారంభమున విఘ్నేశ్వర పూజచేసి, ఏడు జ్వాలలుగల యగ్నిదేవుని

కుండమున ప్రేల్చి వేదమంత్రములచే యజ్ఞము నారం భించెను.

శ్లో. ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం।
అధ్యక్షా న్వరయామాస బ్రహ్మాణం స మృకండుజః॥ ౫

తా. పిమ్మట మార్కండేయమహాముని తా జేయు యజ్ఞమునకు సూర్యుని, దుర్గాదేవిని, నారాయణుని, గణ నాథుని, ఈశ్వరుని, బ్రహ్మను యజ్ఞాధ్యక్షులనుగా కోరెను.

శ్లో. పరావసుంచ కణ్వంచ వసిష్ఠం పులహంవసుం।
శాతాతపం సత్యయజ్ఞం రైభ్యం జాబాలిమేవచ। ౬
అత్రియాంగిరసంచైవ క్రతుం హారీతకర్దమౌ।
మరీచిం కపిలంచైవ స వవ్రే షోడశద్విజాన్। ౭

తా. ఆ యాగకాలమునందు మార్కండేయుడు పరా వసు, కణ్వ, వసిష్ఠ, పులహ, వసు, శాతాతప, సత్యయజ్ఞ, రైభ్య, జాబాలి, అత్రి, అంగిరస, కేతు, హారిత, కర్దమ, మరీచి, కపిల మునులను పదియార్గురు మహర్షులను ఋత్విక్కు లనుగా వరించి యాగము చేసెను.

శ్లో. అధ్వర్యం సర్వయజ్ఞాఖ్య ముద్గాతారం పరావసుం।
బృహస్పతిం చ హోతారం కణ్వాన్ వ్యన్ ఋత్విజః క్రమాత్॥ ౮
ధూమ్రవత్యా ధర్మపత్న్యా దీక్షితో వార్షికాధ్వరే।
ప్రవర్గ్యాదీని కర్మాణి చకార స మునీశ్వరః॥ ౯

తా. ఆ మార్కండేయుడు సంవత్సరముచేయు నా యాగమునందు ధూమ్రవతీదేవితో దీక్షితుడై సర్వయజ్ఞుని యశ్వర్యునిగను, పరావసువు నుద్గాతగను, బృహస్పతిని హోతగను, కణ్వముని మొదలగువారిని ఋత్విక్కులుగా వరించి ప్రవర్గ్యము మొదలగు కర్మవిశేషము లొనర్చెను.

శ్లో. పృథక్ పృథక్చ కణ్వాద్యానృత్విజస్సమ పూజయత్ ।
ప్రవర్గ్యాంతే సమాయాతాన్ బ్రాహ్మణాంశ్చ
దివౌకసః ॥ ౧౦

తా. ఆ మార్కండేయ మహాముని ఆ ప్రవర్గ్యాంతమునందు సమస్త బ్రాహ్మణులను, దేవతలను, ఋత్విక్కులైన కణ్వుడు మొదలగు ఋషులను వేరువేరుగా నర్చించెను.

శ్లో. పుత్రకామేష్టి విధినా జుహావ స మృకండుజః ।
ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం ।
ఏతేషాం పంచభిర్మంత్రైః, జుహావ స మునిస్తదా ॥ ౧౧

తా. పుత్రకామేష్టి విధిచే నా మార్కండేయుడు హోమము చేసెను. అప్పు డా మార్కండేయుడు "అగ్ని ముఖా వై దేవాః" అను శ్రుతిప్రకారము సూర్యుడు మొదలగు నైదుగురు దేవతలను నా మంత్రములచేత నగ్నియందు హోమము చేసెను.

శ్లో. హవిరాహరణా యాథ సర్వే దేవ స్సమాగతాః ।
ఏతస్మిన్నంతరే కుండాత్ పుమాన్ కశ్చిద్వినిర్గతః॥౧౨

దివ్య చందన లిప్తాంగో దివ్య భూషణ భూషితః ।
దివ్య తేజ సమాయుక్తో దివ్యాయుధ ధరో యువా॥ ౧౩

తా. అనంతరము హవిర్భాగముకొఱకు సమస్త దేవతలు వచ్చిరి. అంతలో నగ్నికుండమునుండి దివ్యపురుషుడొకడు దివ్యాంబరధారియు, శ్రీచందనము ధరించినవాడును, సుందరుడు నగు నొక పురుషు డుదయించెను.

శ్లో. తం దృష్ట్వా పరమప్రీతో బ్రహ్మోవాచ మృకండుజం ।
మునేఽద్య పంచభిర్మంత్రై రుద్భూతోఽయం మహామనాః॥
అతః పంచపుటిర్నామ్నా ప్రథాయ తేఽయం జగత్త్రయే।
యువా వనధిగంభీరః పరోపకృతి శాలికః ॥ ౧౪

తా. లోకపితామహుడగు బ్రహ్మ యా దివ్యపురుషుని జూచి సంతసించి మార్కండేయునకు నిట్లనియె. మృకండుజా! ఈ దివ్యపురుషుడు అయిదు మంత్రములచే హోమకుండంబున నుద్భవించెను. కనుక పంచపుటి యను నామమున ముల్లోకంబుల పేరునొందును. గంభీరుడుగాన పరోపకారియు నగును.

శ్లో. అవిచ్ఛిన్నంతు మార్కండో జుహ్వాత్యగ్నౌ తదా మునౌ।
పునః కశ్చిత్ సముత్తస్థావీరో ధీరో ఽమలాత్మవాన్॥
కోటిసూర్య ప్రతీకాశః కోటీందు సదృశాస్యభః ।
కోటి కందర్ప లావణ్యః సర్వాలంకార శోభితః ॥ ౧౫

తా. మార్కండేయమహాముని యెడతెగక హోమము చేయుచుండగా, నా యగ్నికుండమునుండి మరల శూరుడును ధీరుడును, మిగుల తేజోవంతుడును, రూపవంతుడును, సర్వాభరణభూషితుఁడునగు నొక్క పురుషు డుదయించెను.

శ్లో. తదా దుందుభయో వేదుః ననృతుశ్చాప్సరో గణాః ।
వవర్షుః పుష్పవృష్టించ ననందుస్సర్షయః సురాః ।
తదాతి శుశుభేలోకం ప్రసేదుశ్చ దిశో దశ ॥ ౧౮

తా. అప్పుడు దుందుభివాద్యములు మ్రోగెను. అప్సరసలు నృత్యము చేసిరి. దేవతలు ఋషులతోఁగూడి పుష్పవర్షము గురియించి సంతసించిరి. లోకము మిక్కిలి ప్రకాశించెను. దశదిశలు నిర్మలము లయ్యెను.

శ్లో. తదా పంచపుటిర్దృష్ట్వా వీర మప్రతి మౌజసం ।
సిద్ధంహి శివకార్యం మే కృతార్థో ఽస్మీత్య మన్యత॥౧౯

తా. అప్పుడు పంచపుటి తనయెదుట కుండమం దుద్భవించిన యా తేజోవంతుడగు వీరుని జూచి శివకార్యము సిద్ధించిన దనుకొనియెను.

శ్లో. తత స్తం స్వకరే ధృత్వా స్వయం పంచపుటి స్తదా ।
అభివాద్య మహేశానం వాక్య మేతదువాచ హ ॥ ౨౦

తా. అప్పు డా పంచపుటి యాదివ్యపురుషుని చేతితో బట్టుకొని ఈశ్వరునికి నమస్కరించి యిట్లనియెను.

శ్లో. స్వామిన్ సర్వేశ లోకేశ విశ్వేర ఉమాపతే శివ ।
తవాజ్ఞయాద్య దేవేశ వాసాంసి నిర్మిమీత్యయమ్॥ ౨౧

తా. ఓ సర్వేశుడవగు సాంబమూర్తీ! మీయాజ్ఞానుసారము ఇతడు వస్త్రములను నిర్మించును.

శ్లో. చింతా పరోఽభవత్తాత జాతోఽయం జాతవేదసః ।
కింనామాస్య భవేత్యుక్తో ప్రత్యువాచ స శంకరః ॥ ౨౨

తా. అప్పుడు పంచపుటి "ఓ తండ్రీ! అగ్నికుండమున పుట్టిన వీడు కేవలము చింతతో గూడినవాడు. ఇతని కేమిపేరు పెట్టవలెను" అని అడుగగా సాంబమూర్తి యిట్లు చెప్పెను.

శ్లో. బ్రహ్మాదీనాం చ సర్వేషాం మహర్షీణాం దివౌకసాం ।
అన్యేషామపి లోకానాం భావనా పూరకోయతః ॥ ౨౩
తద్భావనోహ్యమానో ఽ సౌ భావనాముని రుచ్యతే ।
త్వత్తో ఽధిక తరోవీరః పరం శ్రేయో ఽనుభోక్ష్యతే ॥
తవాప్యవరజో జాతః తం విశేషేణ మానయ ।
సర్వేషాం భవదీయానాం శత్రూణాం నాశకో భవేత్ ॥
ఇతఃపరం పద్మజాతాదభ్యస్య శ్రుతి సంహతీః ।
'వేదశీర్ష' ఇతిఖ్యాతో భవిష్యతి న సంశయః ॥ ౨౪

తా. ఏ కారణమువలన బ్రహ్మాది త్రిమూర్తుల యొక్కయు కోరికలను పూర్తిచేయుచున్నాడో యా కారణమువలన నితడు భావనాముని యనబడును. మిక్కిలి

శ్రేయస్సు ననుభవింపఁగలఁడు. నీ కనుజుఁడు, నీకంటె నధికుఁడగుటవలన నీయొక్క శత్రువుల కంతకుఁ డగును. ఇప్పుడు మొదట బ్రహ్మవలన వేదముల నభ్యసించి 'వేదశీర్ష' అని ప్రసిద్ధిని పొందగలఁడు. సందేహము లేదు.

శ్లో. ఉక్త్వా పంచపుటిం చైవ దృష్ట్వా తదనుజం శివః ।
బ్రహ్మసృష్టేషు లోకేషు యదికీర్తి మిహేచ్ఛసే ॥ ౨౭
యదాజ్ఞ యాపంచపుటే హ్యానుజంచాను వర్తయ ।
భావయన్ తన్మనో వృత్తిం సర్వదా బహుమానయ ౨౮

తా. ఈ ప్రకారము పంచపుటిని జూచి పలికి యతని తమ్ముఁడైన భావనామునినిఁ జూచి యిట్లనియె. ఓ వీరుఁడా బ్రహ్మ సృజించిన లోకములందు కీర్తి పొంద నిశ్చయించి నచో నా యాజ్ఞ ననుసరింపుము. మీ యన్నయగు పంచపుటి ననుసరించి నడుచుకొనుము. సర్వదా పంచపుటిని సన్మానింపుము.

శ్లో. తచ్ఛ్రుత్వా వచనం శంభోర్వాక్యం హరిరువాచహ ।
శ్రేణుత్తం వచనం వీరౌజన పూజ్యౌ భవిష్యథః॥ ౨౯

తా. "ఓ ఋషివర్యులారా! ఈశ్వరునిమాట వినఁదగినది. దాన జనులకు పూజ్యులగుదురు. మీరు వీరులని ఖ్యాతి గాంచెదరు" అని విష్ణుమూర్తి పలికెను.

శ్లో. లోకే మృకండుజోనామకోటి సూర్యసమప్రభః ।
వర్ణితుం తస్యచారిత్ర మశక్యం మునిభిస్సురైః ॥ ౩౦

స లబ్ధ్వా స ప్తకల్పాంతం మయా రుద్రేణ తద్బహూన్ ।
కల్పాన్ దదర్శ తస్యైవ భవంతౌ వ్యగ్రజౌ సుతౌ ॥ ౩౧
తదాజ్ఞాం శిరసాధృత్వా భవంతం తద్విధేయకౌ ॥
ఉభౌ సృష్టౌ హితకృతౌ లోకపూజ్యౌ భవిష్యథః॥ ౩౨

తా. లోకమునందు గోటిసూర్యప్రకాశుడును తపోవంతుడు నగు మార్కండేయుడు మిక్కిలి ఘోరతపంబున నీశ్వరుని మెప్పించెను. ఆ సాంబమూర్తి యీతని తపంబున కలరి ఏడు కల్పాంతములు పరమాయువు నొసంగెను. ఆ మృకండు తనయుడు నాతోడను రుద్రునితోడ ననేక కల్పాంతములను జూచెను. మీరిర్వు రాయన కగ్రపుత్రులు, వీరు లగుటచే లోకసృష్టియందు సహాయ మొనరించి మిక్కిలి ఖ్యాతిఁ గాంచుడు.

శ్లో. ఇతి దత్వాథ యో విష్ణు రనుజ్ఞాం కృప యాపునః ।
ఉవాచ పరమప్రీతో లోకానుగ్రహ కాంక్షయా॥ ౩౩

తా. ఈలాగు వారిరువురకు నారాయణమూర్తి యాజ్ఞ యిచ్చి పరమప్రీతుడై లోకానుగ్రకాంక్షతో మరల నిట్లనియె.

శ్లో. సర్వేషాం మానరక్షార్థం యత్నః కార్యం కథంచన ।
యువాభ్యాం వస్త్రనిర్మాణం క్రియతామితి చాబ్రవీత్ ॥

తా. సమస్త జనులయొక్క మానసంరక్షణ కొఱకు మీచే వస్త్రములు నిర్మింపబడుగాక.

శ్లో. బలిం చ కాళువాసేనం యువామేవ జయిష్యథః ।
తథాస్త్విత్యాహతుస్తౌ హి హరిరంతరధాత్తదా ॥ ౩౫

తా. బలిని, కాళువా సైనికాసురుని మీరే జయింపబోవుచున్నారు. వారిరువురు ఆట్లే అని పలికిరి. అప్పుడు విష్ణువు అంతర్ధాన మాయెను.

శ్లో. తతో మృకండుజస్సోఽపి యాగం నిర్వర్త్య వైపునః ।
స్వకర్మ సఫలం మత్వా యథాపూర్వం స్థితోమునిః ॥

తా. పిదప మార్కండేయుడు యాగము పూర్తి చేసి తన కార్యము సఫలమైనది గదా యని పూర్వమునలెనే యుండెను.

శ్లో. తత్ర సర్వామరాః స్వస్వం సద్మజగ్ముర్యథాగతం ।
తావుభౌచ మహావీరా విత్య చింతయుతౌ ముభౌ ॥ ౩౭
ఆవామ లబ్ధ తంతూహి విష్ణోస్తత్పురుషోత్తమాత్ ।
అశక్నువావ నిర్మాతుం తద్గచ్ఛావో హరింపునః ॥ ౩౮

తా. తరువాత సమస్త దేవతలు తమ తమ యునికిపట్టులకు యథేష్టముగా వెళ్ళిరి. పురుషోత్తముడైన శ్రీమన్నారాయణునివలన వస్త్రముల నిర్మించుటకు నూలును పొందమైతిమి. మరల నావిష్ణువునొద్దకు వెళ్ళుదము.

శ్లో. విచింత్యైవం పునర్గత్వా మార్కండేయాజ్ఞయా తదా ।
స్వాభీష్ట పూరణార్థం హి హరిం దుగ్ధాబ్ధి శాయినం ।
విలోక్య ప్రణిపత్యాథచక్రతుః స్తోత్ర మంజసా ॥ ౩౯

తా. ఈ ప్రకారము ఆలోచించి మార్కండేయాజ్ఞ ననుసరించి విష్ణువునొద్ద కరిగి పాలకడలియందు శయనించిన రమానాథు నిట్లు స్తుతించిరి.

శ్లో. నమః కమల నాభాయ కమలాక్షాయ తేనమః ।
నమః సతత పూతాయ నమస్తే చక్రధారిణే ॥ ౪౦
నమః కౌస్తుభభూషాయ నమస్తే శేషశాయినే ।
సృష్టిస్థితి వినాశానాం కర్త్రే భర్త్రే చ తేనమః ॥ ౪౧
నమో విరాట్స్వరూపాయ భక్తానాం సులభాయచ ।
నమో వేదాంతవేద్యాయ విష్ణవే పరమాత్మనే ॥ ౪౨
పురస్కృతాయ దేవైస్తే పురుహూతాయ తే నమః ।
యజ్ఞసంభవ వంద్యాయ యజ్ఞేశాయ నమోనమః ।
అవధారయ దేవేశ విజ్ఞప్తిం మామకం విభో ॥ ౪౩

తా. నారాయణమూర్తీ! కమలనాభుడవు. కమలాక్షుడవు. ఎల్లప్పుడు పవిత్రుడవునగు నీకు నమస్కారము, చక్రాయుధుడవును, కౌస్తుభధారివియు నాదిశేషునిపై శయనించినవాడవు త్రిగుణాత్మకుడవు నగు నీకు నమస్కారము. సమస్తోపనిషత్తుల నెఱిగిన విరాట్స్వరూపుడవగు నీవు మా విజ్ఞప్తి నాలకింపుము.

శ్లో. త్వన్నాభినీరజోద్భూతః బ్రహ్మా లోకపితామహః ।
త్వదాజ్ఞయా జగజ్జాతం సృష్టవాన్ స్వయమేవ సః ।
తేషాం హి వస్త్రనిర్మాణే భువనే నాస్తి దేశికః । ౪౪

తా. ఓ విష్ణుమూర్తీ! నీ నాభికమలమం దుద్భవించిన బ్రహ్మ సమస్తలోకములను సృష్టించెను. వారలకు వస్త్రములు నిర్మించుటకు దేశికుఁ డొక్కడైనను లేడు.

శ్లో. భవతస్తంతుహరణ మావాం యాచామహే హరే।
అత్ర ప్రసీద దేవేశ! తంతు సందాయకో భవ॥ ౪౫

తా. ఓ విష్ణు భగవానుడా! నీవలన తంతువులను గ్రహింపగోరుచున్నాము. దేవేశా! మాకు నూలు నొసగుము.

శ్లో. ఇత్యుక్తః పరమప్రీతో హరి రాలోచ్యవై తదా।
స్వనాభి పద్మనాళస్య తంతూన్ తాభ్యాః దదాతతః॥

తా. విష్ణుమూర్తి వారి వచనములకు సంతసించి, చక్కగా నాలోచించి తన నాభికమలముయొక్క కాడ యందలి తంతువుల నిచ్చెను.

శ్లో. స్మేరానన స్తతశ్చాహ వచనం స ప్రతిజ్ఞకం।
భవత్కులప్రసూతా యే తే సర్వే మామకాః
స్మృతాః॥ ౪౭

తా. అనంతర మావిష్ణువు చిరునవ్వుతో నిట్లనియె. మీ వంశమందుద్భవించినవారెల్ల నావారే. అని ప్రతిజ్ఞా పూర్వకముగా జెప్పెను.

శ్లో. త్వదాదిమానాం సర్వేషాం కోశేస్యుః పద్మతంతవః।
కోశస్సవాసు దేవీయః మదీయా స్త్వ త్కులోద్భవాః॥

తా. పద్మతంతువులు మీయందరి కోశమున నుం డును. ఆకోశము వాసుదేవునిది. మీ వంశమున బుట్టినవా రందరు నావారే.

శ్లో. యువాం తు కుల జాతానాం ఆదౌ పూజ్యౌ భవిష్యథః ।
భవంతౌ కులదేవౌచ యువయోర్మహిమాపరః ॥ ౪౯

తా. ఓ భావనా పంచపుటులారా! మీ కులములో జన్మించినవారి కందఱికి మీరు పూజనీయులుగను కులదేవత లును కాగలరు. మీమహిమ యద్భుతము.

శ్లో. యువాంతు పద్మకోశీయైః పూజనీయావ్ద్విజాదిభిః ।
యోవై న పూజయే దేతౌ మమద్రోహీ భవేద్ధ్రువమ్॥

తా. మీరు పద్మశాలీయులచేతను, బ్రాహ్మణా ద్యష్టాదశ వర్ణములచేతను పూజింపఁదగినవారు. మిమ్ము పూజింపనివారు నాకపకారులు. ఇందుకు సందేహము లేదు.

శ్లో. వివాహే విజయేచాపి విప్రదేవార్చనాదిషు ।
గృహగ్రామ ప్రవేశేషు కులధర్మాది కర్మసు ।
అగ్రే తే పూజనీయాస్స్యుస్తాంబూల కుసుమాదిభిః॥ ౫౧

తా. పద్మశాలీయు లగుమీరు వివాహములందును విశేష విజయములందును పూజింపఁదగినవారు. మఱియు క్రతువులు మొదలగు గృహకర్మలయందును నూతన వస్త్ర ధారణము ముఖ్యము గనుక మీరు నందరకన్న ముందు పూజింపఁదగినవారు.

శ్లో. ఏతేఽబ్జ తంతవోవీరా! ప్రభయా విశదాస్సదా।
సత్త్వస్వభావా దృశ్యంతే హ్యతో హంసా ఇవా
ఉభవః॥ ౫౨

తా. శూరులగు భావనా పంచపుటులారా! ఈకమల నాళములం దుద్భవించిన తంతువులు స్వభావముచేత నిర్మలములై నవియును, గట్టివియునై యుండుటవలన హంసోపమానములుగ నున్నవి.

శ్లో॥ యదర్థం జన్మ సంప్రాప్తం భవతోర్మ్నని సత్తమాత్।
అచిరేణైవ కురుతం బ్రహ్మణా సమచోదితమ్। ౫౩

తా. మునులారా! ఎందునిమిత్తము మార్కండేయ మహాముని మిమ్ముల నిర్మించెనో బ్రహ్మచోదితమగు ఆ కార్యము శీఘ్రముగా జేయబడుగాక.

శ్లో. అతస్సర్వ గుణోపేతాం స్తంతూన్ సంగృహ్యవై యువాం।
గచ్ఛతాం కనకాద్ర్యాఖ్యాం పురీమితి తదాహరిః॥౫౪
ప్రేషయామాస తౌ వీరౌ నివృత్య కలశాంబుధేః।
తతో భూమింగతౌ వీరౌ స్మారం స్మారం పచో హరేః॥
ప్రాప్తౌ చ కనకాద్రాఖ్యాం బ్రహ్మణా నిర్మితాం పురీం।
స్వర్ణ శాల సమాయుక్తాం స్వర్ణ హర్మ్యోపశోభితాం॥౫౬
విచిత్రభవనోపేతా మలకేవ భువం గతాం।
తతః పంచపుటీ ధీమాన్ వాక్యమే తదువాచ [illegible]

తా. అనంతరము విష్ణుమూర్తి భావనా పంచపుటు లను జూచి యో వీరులారా! సమస్త సద్గుణములతోఁ గూడుకొనియుండు తంతువులఁ దీసికొని కనకాద్రి యను పత్తనమును గూర్చి పొండు, అని తాను బయలుదేరెను. అప్పుడు భావనా పంచపుటు లిరువురు నా విష్ణుమూర్తిని క్షీరసముద్రమువఱకు సాగనంపి, బ్రహ్మనిర్మితనగు నా కన కాద్రియను నగరమునుగూర్చి బయలుదేరి సమస్తాలంకార శోభితమును, స్వర్ణ శాలానిర్మితంబును, స్వర్ణగృహశోభితంబు నగు నా పట్టణము నలంకరించిరి. తరువాత బుద్ధిశాలి యగు పంచపుటి యిట్లు పలికెను.

శ్లో. భావనావీర వీరేశ శ్రుణు మద్వచనం హితం।
తంతుభిర్విష్ణునాదత్తైః ప్రతిద్వయసమాహితైః ॥ ౫౮
వస్త్రాణి చవిధాయ త్వం విష్ణవే శంకరాయచ।
బ్రహ్మణేఽపి చ దేవేభ్యో హ్యన్యేభ్యో దాతుమర్హసి॥

తా. వీరులలో నుత్తముడగు నో భావనామునీ నేను హితమును జెప్పుచున్నాను. వినుము. రెండేసి పోగు లతో గూడినవియు, విష్ణువుచే నొసగబడినవియు నైన తంతు వులతో వస్త్రములు నేసి విష్ణువునకును, శంకరునికిని, బ్రహ్మ కును ముప్పదిమూడుకోట్ల దేవతలకు నొసగుము.

శ్లో. సర్వేషాం ప్రీతిపాత్రం వై భవాన్ భవితు మర్హసి।
గచ్ఛామ్యహం బలిం జేతుం జిత్వాతం సర్వతో దిశం॥౬౦

చరామి వ్యవహారార్థ మర్థసాధన తత్పరః ।
ఇత్యుక్త్వా భావనావీరం గతః పంచపుటి స్తదా ॥ ౩౧

తా. భావనావీరుడు వస్త్రములను నిర్మించి విష్ణు శంకరు లాదిగాగల సమస్త దేవతలకు నిచ్చువట్లు నియమించి తాను బలియను రక్కసుని జయించుటకును, వ్యావహారమును జేయుటకును నిశ్చయించుకొని పంచపుటి యుద్ధమునకు వెడలెను.

శ్లో. తతః స భావనావీరః స్మృత్వా మనసిచ స్వయం
విద్యాలాభాయగతవాన్ కైలాసే శివసన్నిధిమ్ ॥ ౬౨

తా. తరువాత భావనాముని మనమున నాలోచించి విద్య నభ్యసించుటకు కైలాసమందలి శివసన్నిధి కరిగెను.

శ్లో. గతశ్శంకర సాన్నిధ్య మిత్యు వాచస శంకరం ।
భగవన్ సర్వలోకేశ ! సర్వభూత హితేరత ॥ ౬౩
నమస్తే గిరిజానాథ ! విజ్ఞప్తి మవధారయ ।
హరిర్మే పరమప్రీత్యాప్రాదా త్తంతూన్ పరః
పుమాన్ ॥ ౬౪

తా. అనంతర మా భావనామహర్షి శంకర సాన్నిధ్యము నంది యా యుమానాధుని స్తుతించి యిట్లనియె. ఓ శంకరా! హరి నాకు తంతువుల నొసగెను.

శ్లో. శాంఖవీం భో భవద్విద్యాం దాతుమర్హసి శంకర ।
ఇత్యుక్తః ప్రత్యువాచైవం శివ స్తం భావనామునిమ్ ౬౫

తా. ఓ శంకరా! నీవు 'శాంభవి' అను విద్యను నాకు ఇచ్చుటకు తగినవాడవు, అని భావనాఋషి చెప్పగా శంకరుడు ఆ భావనాఋషితో నిట్లనియె.

శ్లో. క్షణమాత్రం ప్రతీక్షస్వ విద్యాందాస్యామి హేమునే।
ఋషిభిస్సహ గంతవ్యం స్థానం రుద్రస్య కందరమ్॥ ౬౬

తా. ఓ భావనామునీ! క్షణము వేచియుండుము. నేను ఋషులతో గూడ రుద్రగుహకు బోవలసి యున్నది.

శ్లో. తత్రావమృథికం స్నానం విధాయ పునరాగతం।
మాం చ తైర్ముని భిస్సార్థం తత్రత్వం ద్రష్టుమర్హసి॥ ౬౭

తా. భావనామునీ! అచ్చట స్నానముచేసి ఋషులతో గూడ వచ్చెదను. ఆవల నన్ను జూడుము.

శ్లో. ఇత్యుక్తః ప్రత్యువాచేదం శంకరం భావనామునిః।
సర్వేషామేవ దేవానాం సృజామి వసనాన్యహమ్॥ ౬౮

తా. ఇట్లు శంకరుడు చెప్పగా, భావనాఋషి శంకరునితో నిట్లనియెను. సమస్తమైన దేవతలకు నేను వస్త్రములను సృష్టిచేయుచున్నాను.

శ్లో. అధునా తే విశేషేణ రాంకవం వసనం శుభం।
పార్వత్యాః పౌష్పికం వాసోమావిలంబయశంకర॥ ౬౯

తా. అప్పుడు భావనాముని యిట్లనియె. స్వామీ! మీకు శాలువను, పార్వతీదేవికి రక్తవస్త్రమును నేయుదును ఆలస్యము చేయకుడు.

శ్లో. ఇత్యుక్తః సుప్రసన్నో౽సౌ గిరీశః ప్రహసన్ముఖం ।
ప్రతిగృహ మహావీర ! సాధువిద్యాం దురాసదామ్॥ ౭౦

తా. ఈశ్వరుడు భావనాముని చే నిట్లు చెప్పఁబడిన వాఁడై యిట్లనియెను. భావనావీరా! ఇతరులకు సాధ్యము గాని విద్యను గ్రహింపుము.

శ్లో. త్రైలోక్య భావనావీరః సురశ్రేష్ఠ మనుజశ్రేష్ఠైః ।
దుర్లభం యదయాచస్త్వాం కృపయాతద్దదామ్యహమ్॥ ౭౧

తా. ఓ భావనాఋషీ ! నీవు దేనిని పొందగోరితివో అది దేవతా శ్రేష్ఠులకును, మానవేంద్రులకును దుర్లభమైనది.

శ్లో. ఇత్యుక్త్వా స బిలం గత్వాప్రతిగృహ్య వ్యనిర్గమత్ ।
సర్వోపకారిణీం దివ్యాం బ్రహ్మతేజః ప్రదాయినీమ్॥ ౭౨

తా. అప్పుడు సాంబమూర్తి యీరీతిని బిల్వగుహను ప్రవేశించి తేనోపతియగు విద్యను గ్రహించి బయలు వెడలెను.

శ్లో. విద్యాంశ్రుతిప్రసిద్ధాం తాం శంకరస్త్వర యాతదా ।
తం విలోక్య మహావీరః జ్ఞాత్వాచాప ఉపస్పృశన్॥ ౭౩

తా. వేదప్రసిద్ధమైన ఆ విద్యను గ్రహించి తెచ్చు ఈశ్వరుని తెలిసికొని, మహావీరుడైన భావనాఋషి హస్త ప్రక్షాళనము చేసినవాఁడై యాచమించి.

శ్లో. అగ్రహీత్పరమాం విద్యాం ఈశ్వరస్య నియోగతః ।
తతోగత్వా౽నయా వీరః కనకాద్రిపురంతథా। ౭౪

తా. ఈశ్వరుని ఆజ్ఞ వలన విద్యను గ్రహించి కన కాద్రి పురమునకు వెళ్లెను.

శ్లో. వ్యనిర్మ్య దథ వస్త్రాణి హ్యసితాని సితానిచ ।
పాష్పికాని చ పీతాని వివిధాని బహూన్యపి ॥ ౭౫

తా. ఈశ్వరుడు చెప్పినట్లు కనకాద్రిపురమున కేగి బహువిధములైన నల్లని, తెల్లని, ఎఱ్ఱని, పచ్చని వస్త్రములను భావనాఋషి నిర్మించెను.

శ్లో. సర్వాణి తాని సంగృహ్యాహరిం ప్రాప్య పునర్మునిః ।
వినయేన నతిం కృత్వా వచనం చేదమబ్రవీత్ ॥ ౭౬

తా. అనంతరము తాను నిర్మించిన వస్త్రములను దీసికొని భావనాముని విష్ణుమూర్తికడ కేగి నమస్కరించి పలికెను.

శ్లో॥ హరే మురారే దేవేశ విజ్ఞప్తి మవధారయ ।
త్వదాజ్ఞయాహం సంగృహ్య తంతూన్ త్వన్నాభి సంభవాన్ ॥ ౭౭

తా. దేవతల కధిపతివైన ఓ విష్ణుమూర్తీ! నా విజ్ఞాపనమును వినవలసినది. నీ యాజ్ఞప్రకారము నేను నీ నాభి యందు పుట్టిన తంతువులను తీసుకొని,

శ్లో॥ నివేద్యేశ్వరే వృత్తాంతం విద్యాప్రాప్తా తతో మయా ।
అతః పుష్పాణి వస్త్రాణి శాంభవ్యా విద్యయా హరే॥ ౭౮

తా. ఓ విష్ణుమూర్తీ! ఆ వృత్తాంతమును ఈశ్వరునకు నివేదించి "శాంభవి" అను విద్యను పొందితిని. తరు

వాత ఆ శాంఖీ విద్యాసహాయముతో నీ పుష్పవస్త్రములను నేసితిని.

శ్లో॥ త్వం గృహాణేప్సితం వస్త్రం కర్మమే సఫలం కురు ।
ఏవముక్తః ప్రహృష్టాత్మా హరిస్తద్వస్త్రసంచయమ్॥ ౭౯
విలోక్య జగృహే తస్మిన్ పీతం వసనమాదరాత్ ।
ధృత్వాకటితటే విష్ణుర్విద్యుత్వానివ తోయదః ।
బాలాతపేన సంవీతః నీలోగిరి రివాబభౌ ॥ ౮౦

తా. భావనాముని యావస్త్రముల విష్ణుమూర్తికి జూపగా పసిమివన్నెగల వస్త్రమును నారాయణుడు ప్రీతితో గ్రహించి ధరించి మెఱపుతో గూడిన మేఘమువలెను, లేయెండపడిన నీలగిరివలెను మిక్కిలి ప్రకాశించెను.

శ్లో॥ తత్రత్యానాం తు సర్వేషాం దదావాచ్ఛాదనం హరిః।
పరిధాయ చ వాసశ్శ్రీః దృష్ట్వా తం భావనామునిమ్ ౮౧
శ్లో॥ లక్ష్మీకాంతా సుధాం దత్వా ప్రీతియుక్తేన చేతసా।
నితరాం రోచయామాస ముదా పరమయా తదా।
భగవాన్ వస్త్ర సంఘేషు పునరేకం సమాదదే ॥ ౮౨

తా. విష్ణుమూర్తి అక్కడనున్నవారి కెల్లరకు వస్త్రములను ఇచ్చెను. లక్ష్మీదేవికూడ "మహాలక్ష్మీవిలాసము" అను వస్త్రమును ధరించి ప్రసన్నయై భావనాఋషిని చూచి ప్రీతితో భావనాముని చేత అమృతమును భుజింపఁజేసెను. విష్ణుమూర్తియును మరల నొక వస్త్రమును దీసికొనెను.

శ్లో. తద్ధ్వజాగ్రే సమారోప్య తార్ క్ష్యం హరిరువాచ హ ।
వైనతేయ మహాభాగ ధ్వజ వస్త్రం త్వమావిశ ॥ ౮3

తా. అప్పుడు విష్ణుమూర్తి ఆ వస్త్రమును ధ్వజాగ్ర మందుంచి గరుడుని నీవు ధ్వజవస్త్రమును ధరింపుమనెను.

శ్లో. పరిలేఖయ తే రూపం చిత్రరూపేణ సుందరం ।
ఏవముక్తస్స గరుడస్తథా చక్రే తదేవ హి ॥౮౪

తా. వినతా నందనా! సుందరమైన నీరూపము నచ్చట చిత్రింపుమని విష్ణువు చెప్పగనే యా వైనతేయు డటులనే చిత్రించెను.

శ్లో. తతః సంప్రాప్తవాన్ విష్ణుః గరుడధ్వజలాంఛనం ।
తదాత్రిలోకే వైకుంఠే గరుడధ్వజ లాంఛనః ॥ ౮౫

తా. అప్పుడు నారాయణమూర్తి గరుడధ్వజ చిహ్నమును పొంది గరుడధ్వజ లాంఛనుఁ డాయెను.

శ్లో. ఉవాచ పరమప్రీత్యా భావనాముని మాదరాత్ ।
ప్రీతోఽస్మి భావనావీర సఫలం కర్మ తేఽభవత్ ॥ ౮౬

తా. విష్ణుమూర్తి యిట్లనియె. భావనామునీ! నీకా ర్యము ఫలించినది. మిగుల సంతసించినవాఁడ నైతిని.

శ్లో. అద్యప్రభృతి లోకేషు తత్కులే యేచసంభవాః ।
తే సర్వే పద్మశాలీయాః మత్ప్రసాదబలేనచ
'బహూత్తమా' ఇతిఖ్యాతా భవేయుర్మదనుగ్రహాత్ ॥౮౭

తా. భావనామునీ! ఇది మొదలు నీవంశమందు పుట్టువారు నా యనుగ్రహంబునఁ బద్మశాలీయులనియు, బహూత్తములనియు బ్రసిద్ధి నొందుదురు.

శ్లో. విష్ణుధ్వజం దధానాస్తే భావనా మదనుగ్రహాత్ ।
కీర్తయం తు పరం సర్వే ప్రసిద్ధం తే యశో భువి ॥ ౮౮

తా. భావనామునీ! నేడు మొదలు పద్మశాలీయు లందరు గరుడధ్వజధరు లగుదురుగాక. నీ కీర్తి శ్రేష్ఠమై మిగుల బ్రసిద్ధి నొందుగాక.

శ్లో. మదీయే ష్వవతారేషు దివివా భువి వా స్థితాః ।
మద్ధ్వజాం శ్చ దధానాయే త్వ దీయాః పద్మశాలినః॥
తేష్వేవరోచతే చిత్తం మామకం భావనాముసే। ౮౯

తా. నా యన్ని యవతారములందును మీవంశ్యులే లోకమందుండినను నాధ్వజములను ధరించి యుండువారలు. భావనామునీ! నీకులమునం దుద్భవించు పద్మశాలీయులయందే నామనస్సునకు విశ్వాసము గలదు.

ఇతి వేదవ్యాసప్రోక్తే మార్కండేయ పురాణాంతర్గతే
భావనాఋషి మాహాత్మ్యే వస్త్రనిర్మాణ కథనం నామ

పంచమోఽధ్యాయః.

—()—

# భావనాఋషి మాహాత్మ్యం

## షష్ఠోఽధ్యాయః.

శ్లో. దుష్కరం భావనావీరః కృతవాన్ స్వప్రభావతః ।
తం భూయః శ్రోతు కామానాం బ్రూహి నో
రోమహర్షజ ॥ ౧

తా. భావనాముని తన మహిమచే దుష్కరకార్య మొనర్చెను. వానినిగూర్చి మిక్కిలి వినవలయుననియున్నది. ఓ సూతా! మాకెఱిగింపుము.

శ్లో. ఏకదా భావనా మానిర్గతో శ్రీకంఠమందిరం ।
కైలాసే సుఖమాసీనం సురైర్గిరిజయా సహ ।
ప్రణమ్య శిరసా దేవం వాక్యం స మునిరబ్రవీత్ ॥ ౨

తా. ఒకప్పుడు భావనాముని కైలాసమునకు పోయెను. దేవతలచే అచ్చట సేవింపఁబడుచు పార్వతీ సమేతుడైయున్న శంకరునకు నమస్కరించి ఆత డిట్లనియె.

శ్లో. త్వద్దివ్యయాఽసృజం దేవ వాసజాతంమహాప్రభో ।
తస్మిన్ జగ్రాహ భగవాన్ హరిః పీతంపటంస్వయమ్॥ 3

తా. నేను మీరొసగిన విద్యచే ననేకవిధములగు వస్త్రసమూహమును నిర్మింపగా, నందు పచ్చని వస్త్రమును నారాయణుడు గ్రహించెను.

శ్లో. ధ్వజాలంకరణాయాథ పునరేకం జహార సః ।
లక్ష్మీవిలాసమాదా ద్రమామైచస్వయం హరిః ॥ ౪

తా. మరల శ్రీమన్నారాయణుడు ధ్వజాలంకారము కొఱకొక వస్త్రమును దీసికొనెను. లక్ష్మీదేవికిని తానే 'లక్ష్మీవిలాసము'ను వస్త్రము నిచ్చెను.

శ్లో. తతస్త స్యాజ్ఞయా దేవ సంప్రాప్తోఽహం తవాంతికం ।
సఫలం కురు మత్కర్మమయి ప్రీతి ర్హితే సదా॥ ౫

తా. ఓ సాంబమూర్తి! శ్రీమన్నారాయణుని యనుజ్ఞచే నీ సమీపమునకు వచ్చితిని. నా కార్యమును సఫలము చేయుము.

శ్లో. గృహాణవస్త్రజాతే స్మిన్ యచ్చతే రోచతే మనః ।
ఏవముక్తో మహాదేవో బ్రహ్మాణం స్వపురస్థితమ్ ॥ ౬
విలోక్యవచనం ప్రాహ సర్వేషా మగ్రతః శివం ।
పశ్యన్ బ్రహ్మామహచ్చిత్రం భావనామునినా కృతమ్॥ ౭

తా. ఈ వస్త్రములయందు నీమనస్సునకు వచ్చినదానిని గ్రహింపుము. అప్పు డీశ్వరుడు తన యెదుటనున్న బ్రహ్మను చూచి మంగళవాక్యము నుడివెను. బ్రహ్మయు భావనామునిచే జేయబడిన యాగొప్ప విచిత్రమును సందర్శించెను.

శ్లో॥ అత్రపూర్వ మిమాం విద్యాం లబ్ధవాన్ సముని ర్మయా
గృహీత్వా స్వపురం గత్వా చకారాంబర సంచయమ్

తా. పూర్వ మీకైలాసమందు భావనాముని నాచే నీవిద్యను పొంది తన పురికేగి యావస్త్ర సంచయము నిర్మించెను.

శ్లో॥ తతోఽస్య సదృశోవీరః నాస్త్యన్యః శ్రీపతిప్రియ ।
ఇత్యుక్త్వాఽదాయ హస్తేన వాసోజాతం సదాశివః॥ ౯

తా. ఓ బ్రహ్మ! వీనికి సమానమైన వీరుడు లేడు. అని పలికి శివుడు సంతోషముతో వస్త్రసమూహమును తీసికొని.

శ్లో। బ్రహ్మణే రాంకవం వస్త్రం భారత్యై పౌష్పికం దదౌ।
తదాన్యేభ్యః సురేభ్య శ్చపృష్ట్వాపృష్ట్వా ముహుర్ముదా॥

తా. అప్పుడు శ్రీ సాంబమూర్తి బ్రహ్మకొక శాలువను సరస్వతికొక పౌష్పిక వస్త్రమును, సమీపముననుండు దేవతలకు వారి కిష్టమయిన వస్త్రముల నొసంగెను.

శ్లో॥ ఏషాం హి రోచతే ఏషుదదౌ తాన్యేవశంకరః ।
దృష్ట్వా సభాం స్వకీయాం తాం వస్త్రాలంకార
శోభితామ్॥ ౧౧

తా. అప్పు డీశ్వరుడు వారు కోరిన వస్త్రములను వారికిచ్చెను. ఇట్లు వస్త్రాలంకారముచే ప్రకాశించు తన సభను చూచి,

శ్లో॥ జహర్ష చ మహాదేవ స్సర్వేషాం రమ్యమాకృతం ।
ఉవాచ భావనావీరం వాక్యం సత్కార సంయుతమ్॥౧౨

తా. ఈశ్వరుడు రమ్యమైన వారి యాకారమును జూచి సంతోషించెను. భవనాఋషిని గూర్చి గౌరవముతో కూడిన వాక్యమును పలికెను.

శ్లో. రచితం మణి భిస్తుల్యం శ్రుణు మద్వచనం హితం।
భవానతీత ప్రాజ్ఞోహి త్వత్సమోనాస్తి కుత్రచిత్ ॥ ౧౩

తా. నీచే జేయబడిన వస్త్రములు మిగుల రమణీయముగా నున్నవి. నా హితవాక్యమును వినుము. నీతో సములెందును లేరు.

శ్లో. నాభా హరేరభూద్బ్రహ్మా త్వం మునీంద్రస్యయజ్ఞతః।
బ్రహ్మాసృజత్సర్వలోకాన్ భవాంశ్చవసనావళిమ్ ॥ ౧౪

తా. శ్రీమన్నారాయణుని నాభికమలమునుండి నలువయుదయించెను. నీవు మార్కండేయమునీంద్రుని యజ్ఞకుండమునుండి పుట్టితివి. బ్రహ్మ సమస్తలోకములను సృష్టించెను. నీవు వస్త్రములను నిర్మించితివి.

శ్లో. నృలోకేరుభయోస్సృష్టేనాంతరం దృశ్యతే క్వచిత్ ।
లోకాశ్చబ్రహ్మణాసృష్టాః భవతా వస్త్రసంచయమ్ ౧౫

తా. మనుష్య ప్రపంచమునందు మీ యుభయ సృష్టియందించుకయైనను తారతమ్యము లేదు. అతడు లోకముల నిర్మించెను. నీవు వస్త్రముల నిర్మించితివి.

శ్లో. అన్యధాత్వంజితోతేన గుహేనచయథాఽసురాః।
ఇమాంవిద్యాం త్వత్సకాశాద్భిక్షయాగృహ్యతేమునే॥

తా. అట్లు బ్రహ్మతో సమానముగా వస్త్రములను సృష్టింపని యెడల రాక్షసులు సుబ్రహ్మణ్యునిచే జయింపబడినట్లు నీవును బ్రహ్మచే జయింపబడుదువు. నీవలన నీవిద్యను ఎవడు గ్రహింప నున్నాడో.

శ్లో. తస్యైవసిద్ధ్యతే విద్యా నాన్యథా భవతి ధ్రువం ।
యఃకోఽపి మతిమాన్ లోకే దృష్ట్వావిద్యామిమాంతవ ॥

తా. పూర్వము చెప్పినట్లు నిన్నడిగి విద్యను గ్రహింపనివాని కీవిద్య సిద్ధింపదు. ఎవడైన నీవిద్యను చూచి,

శ్లో. జ్ఞాతో యోఽన్యవిధా నేన తదీయైస్స హి గర్హ్యతే ।
యే చేహ్యాశిక్షయావాపి సోపాయ కుశలేనవా ॥ ౧౮

తా. ఈ విద్య నెవ్వడు నీయొద్ద నభ్యసింపక యుక్తిచే నేర్చుకొనునో వాడు తన బంధువులచే నిందితుడగును.

శ్లో. విద్యామిమాంగ్రహిష్యన్తి ద్వేష్యాన్ తాన్
నాశయామ్యహం ।
తేతు సర్వే బహిష్కార్యాః మద్విద్యావంచకోయతః ॥

తా. నావిద్య నెవరైతే నీవలన గ్రహింపక స్వోపాయముచే నూహింతురో వారు నా విద్యావంచకులైనందున బహిష్కరింపబడుచున్నారు.

శ్లో. ఇత్యుక్త్వా భావనావీరం దదౌతస్మై బహూన్వరాన్ ।
ప్రీత్యా ధవళశంఖంచ చామరవ్యజనావుభౌ ॥ ౨౦

తా. అప్పు డీశ్వరుడు భావనామునితో నీప్రకారము చెప్పినవాడై యాతని కనేక వరంబు లొసగి ధవళశంఖమును వింజామరలను విసనకఱ్ఱ నిచ్చెను.

శ్లో. తతః శ్వేతాతపత్రంచ హ్యుశీరవ్యజనం తథా
రచితాంమణిభిర్దివ్యై రమూల్యై రతిభాస్వరైః ॥ ౨౧

సువర్ణ దండ సంయుక్తాం దదావాందోళికాం పునః ।
తతః ప్రీత్యా చ గిరిజా సంజీవకరణీందదా ॥ ౨౨

తా. తరువాత తెల్లని గొడుగును, వట్టివేరు విసనకఱ్ఱను, మణులతో నిర్మింపబడి, సువర్ణ దండములతో కూడుకొనియున్న పల్లకీని ఇచ్చెను. పిదప పార్వతీదేవి సంతోషముతో సంజీవకరణి నిచ్చెను.

శ్లో. పునఃప్రహృష్టః శ్రీకంఠో వచనం చేదమబ్రవీత్ ।
త్వయాసర్వం జగజ్జాతం నిర్లజ్జం మునిరాడభూత్ ॥ ౨౩

తా. ఈశ్వరుడు మరల సంతసించినవాడై "ఋషివర్యా! బ్రహ్మచే సృష్టింపబడిన సకలలోకములు నీచేత నిర్లజ్జగలవాయెను." అని చెప్పెను.

శ్లో. అతో మే పరమప్రీతి ర్దేవాశ్చాపి ప్రహర్షితాః ।
సాధితం సర్వకార్యం తే కృతార్థో ఽసి మహామునే॥ ౨౪

తా. ఓ ఋషివర్యా! వస్త్రహీనులైన సమస్త జనులను సంతోషపెట్టుటచేత నేనును సమస్త దేవతలును మిక్కిలి సంతసించితిమి. నీకార్యము సాధింపఁబడినది. [illegible] కృతకృత్యుఁడ వైతివి.

శ్లో. అథ కించి న్మనసి మే కార్య మస్తి హి సాంప్రతం ।
ఇత్యుక్తః ప్రత్యువాచేదం చింతయన్ భావనామునిః ౨౫

తా. అప్పు డీశ్వరుడు భావనామునినిఁజూచి యో ఋషివర్యా! నాకు నీవొక కార్యము చేయవలసినదని

చెప్పెను. అప్పుడు, భావనాముని యీశ్వరుని కోరిక యేమని యడిగెను.

శ్లో. స్వామిన్! త దుచ్యతాం దేవ! సాధయామిసదాశివ।
మా తద్వదస్వ దేవేశ! య త్త్వం మనసి వాంఛితమ్॥ ౨౯

తా. ఓ సాంబమూర్తీ నీమనంబునకల వాంఛిత మెఱిగింపుము. దానిని సాధించెదను.

(శ్రీ) మహాదేవ ఉవాచ॥ సాంబమూర్తి యిట్లు పలికెను.

శ్లో. భావనావీర! వీరాఢ్య! మమకార్యే స్థిరామతిః।
వైయాఘ్రే ఘోచతే తస్య సాధనం కర్తుమర్హసి॥ ౨౭

తా. భావనామునీ! నాకు వ్యాఘ్రచర్మముమీద మనస్సు గలదు. నాకది సాధించి యిమ్ము. దానికి నీవొక్క డవే సమర్థుఁడవు.

శ్లో. త్వదృతే సాధనే నైవత్రిషు లోకేషువిద్యతే।
మయితే పరమ ప్రీతి ర్యది శూరోஉసి సాధయ।
ఇత్యుక్తః పరయా భక్త్యా ప్రత్యువాచ హి శంకరమ్॥ ౨౮

తా. అప్పు డీశ్వరుడు భావనావీరుని జూచి యో వీరా! నాకార్యము సాధించుటకీ మూఁడులోకముల నిన్నుఁ బోలువాఁడు లేడు. నీవు శూరుడవైన సాధింపుము. అనగా భావనాముని యీశ్వరుని గూర్చి పలికెను.

శ్లో. భగవన్ సర్వలోకేశ మత్కార్మసఫలం కురు।
త్వాయా నాంగీకృతే వస్త్రే స్యాత్కర్మమమ నిష్ఫలం॥

తా. సమస్తలోకములకుఁ బ్రభుడవగు నో యీశా నాచే నిర్మింపఁబడిన వస్త్రముల నీ వంగీకరించనియెడల నేను చేసినపని వ్యర్థము కాఁగలదు.

శ్లో. దేవ ! వాసః పురా ధృత్వా మమాజ్ఞప్తుం త్వమర్హసి ।
తచ్ఛ్రుత్వా వచనం దేవః ప్రసన్నముఖ పంకజః ॥ 30

తా. స్వామీ ! ముందు వస్త్రములను ధరించి యనంతరము నన్నాజ్ఞాపింపుడని చెప్పగా, నామాటకు నీశ్వరుడు సంతసించినవాఁడై,

శ్లో. గృహీత్వైకం తథావాసః ధ్వజదండే న్యవేశయత్ ।
తతోనందిన మాహూయ దర్శయిత్వా స్వయంధ్వజం॥

తా. వస్త్రము నొకటి తీసికొని ధ్వజదండమునందుంచి నందికేశ్వరుని బిలిచి ధ్వజదండమునందుఁ దాను వస్త్రముంచుటను జూపి,

శ్లో. కారయామాస తచ్ఛాయాం వృషరూపేణ శంకరః ।
తదాప్రాప్తో మహాదేవో వృషభధ్వజలాంఛనః ॥ 32

తా. పిమ్మట తానా ధ్వజమును నందికేశ్వరునకు జూపి ఓ నందికేశ్వరా ! దీని నలంకరింపుము. అని యాజ్ఞాపించెను. అది మొదలు శివుడు వృషభధ్వజు డాయెను.

శ్లో. తతః సంప్రేక్ష్య గిరిశః కేతనం వృషభాంకితమ్ ।
కృపయా భావనావీరం వాచమూచేఽర్థసంయుతమ్॥ 33

తా. అప్పు డీశ్వరుడు వృషభాంకితమగు ధ్వజమును జూచి భావనామునితో నర్థయుక్తమగు మాటలను పలికెను.

శ్లో. ఇతః ప్రభృతి లోకేషు పద్మశాలీయకోత్తమాః।
మమాజ్ఞయా చ హేవీర! ప్రాప్తా వృషభ కేతనమ్ ॥ 34

తా. వీరుఁడవగు నో భావనాముని! నా యాజ్ఞచే పద్మశాలీయులంద రీ దినము మొదలు వృషభ కేతనము గల వారుగాగలరు.

శ్లో. ఇత్యుక్త్వా తం మహాదేవః పునర్వచన మబ్రవీత్।
శ్రూయతాం సంప్రవక్ష్యామి గుహ్యద్గుహ్యాతమం
మహత్ ॥ 35

తా. ఈశ్వరుడు భావనామునినిగూర్చి యీలాగు చెప్పినవాడై మఱల నిట్లు చెప్పెను. ఓ భావనామునీ! అత్యంత రహస్యమైన మాటను నీకు చెప్పెదను వినుము.

శ్లో. భూతనాథతయాఽహం తు తచ్ఛాబకవృషార్చకాః।
సంప్రాప్యలోకే వర్తంతే కులే తేషాం వసామ్యహమ్ . 36

తా. ఓ భావనమునీ! స్వల్పవయస్సుగల వృషభములు ఎవరియొద్ద నున్నవో వారి గృహములలో నేను నివసించుచున్నాను.

శ్లో. తత్రాపి తవవంశే చ మత్స్వరూపం భవే ద్ధ్రువం।
వైఖానసే పాంచరాత్రే తథా న్యేష్వాగమేషుచ ॥ 37
దేవానాం కౌతుకాద్దేయం వస్త్రముక్తయ సంచయం।
ఏతద్గుహ్యతమం వాక్యం మయోక్తం భావనామునే!॥ 38

శా. అందులో నీవంశమందే నా స్వరూపముతో నుండగలను. అట్లే వైఖానస పాంచరాత్రాది మతముల యందును ఇతర శాస్త్రములయందు నున్నాను. ఓ భావనా మునీ! సర్వమతములయందును సర్వశాస్త్రములయందును రహస్యమైన విషయ మిదియే. అది యేదనగా ప్రీతితో దేవతలకు ప్రతి సంవత్సరము కళ్యాణకాలములయం దెవడు వస్త్రముల నిచ్చుచున్నాడో వానికి వస్త్రసమూహములు నశింపక వృద్ధినొందును. ఇది మిగుల రహస్యమైనది.

శ్లో. ఏతద్విపర్యయం యే చమనోవాక్కాయ కర్మభిః ।
కరోతి బుద్ధిచాపల్యాత్ సచద్రోహీ భవేన్మమ ॥ ౩౯
గచ్ఛ త్వం భావనావీర వైయాఘ్రం చర్మసత్వరం ।
సాధితుం గమనేబుద్ధిం కారయ త్వం మమాజ్ఞయా ।
ఇత్యుక్తో భావనావీరః కైలాసాదవతీర్యచ ॥ ౪౦

శా. ఎవరు దీనికి వ్యతిరిక్తముగా చేయుదురో వారు నే చెప్పినవిధముగా బుద్ధిచాంచల్యముచేత నే చెప్పిన విషయమునకు వ్యతిరిక్తముగా ఎవడు చేయునో వాడు నాకు ద్రోహి కాగలడు. నీవు త్వరగాబోయి వ్యాఘ్ర చర్మమును తీసికొనిరమ్ము. నా యాజ్ఞచే చర్మమును సాధించుటకు బయలుదేరుము. ఈ విధముగ జెప్పబడిన భావనాముని కైలాసమునుండి దిగెను.

శ్లో, శివాజ్ఞాం శిరసా ధృత్వావి పినాని చచార సః ।
తతస్తు సూర్యతనయా నామ్నా భద్రావదీ సతీ ।
పీవ రీతిచ విఖ్యాతా సాధువృత్తిపరాయణా ॥ ౪౧

తా. అట్లీశ్వరాజ్ఞను శిరమున ధరించి యా భావనా ముని తిరుగుచుండెను. పిదప పీవరియను విఖ్యాత నామము గలిగిన సూర్యపుత్రిక.

శ్లో. స్వానుకూలవయోరూప శీలసౌభాగ్యసంపదం ।
పతిం కామయమానా సా నిశమ్యచరితం మునేః ॥ ౪౨

తా. తన కనుకూలమగు వయస్సును, రూపమును, సుస్వభావమును, సంపదను కలిగిన భర్తను కోరునట్టి ఆ భద్రావతీదేవి భావనాఋషియొక్క చరిత్రమును వినినదై,

శ్లో. ఆకర్ణ్య నారదాద్విద్యాం కాంక్షమాణాస్వయం తదా ।
చకర్ష ద్వీపినస్సర్వాన్ స్వసమీపే పతింవరా ॥ ౪౩

తా. అట్లు భద్రావతి భావనాముని చరిత్రమును విని యాతడు శివునివలన బొందిన విద్యావైభవము నాకర్ణించియు, పతిని గోరుచున్నదై సమీపమందలి పులుల నన్నిటి నాకర్షించెను.

శ్లో. తతో వేగేన మహాత్మా విచరన్ సర్వతోవనం ।
చూతకేతకపున్నాగనాగ చంపకకేసరైః ॥ ౪౪

తా. అనంతర మా భావనాముని త్వరితముగా పొగడలు, పొన్నలు, సంపెగలు, సురపొన్నలు మొదలుగాగల వృక్షములతో ప్రకాశించు వనమంతయు తిరిగెను.

శ్లో. వకుళైర్వాం జుళైర్నీపై ర్మాతులుం గైర్లవంగకైః।
పనసైస్సరళైర్మం దైః కోవిదారైః కురంటకైః॥ ౪౫
సింధువారైశ్చ ఖర్జూరైశ్చందనై ర్నక్తమాలకైః।
రసాలతాలహింతాల ప్రియాళు పిచుమందకైః॥ ౪౬
జంబు జంబీర బిల్వైశ్చ మందారైశ్చ కరంజకైః।
అశ్వత్థప్లక్షన్యగ్రోధైః కపిత్థైః కదళీద్రుమైః॥ ౪౭
ద్రాక్షాభిర్నారికేళైశ్చమధూకాద్యై ర్మహీరుహైః।
సర్వతః శోభమానాని దుర్గమా ణ్యఖిలానిచ।
వనాని కందరగుహాః ప్రవిశ్య విచచారహ॥ ౪౮

తా. మఱియు నా భావనాముని పొగడచెట్లచేతను, అశోక వృక్షములచేతను, మాదీఫల తరువులచేతను, లవంగ వృక్షములచేతను, పనసచెట్లచేతను, దేవదారు వృక్షముల చేతను, మందార వృక్షములచేతను, ఎఱ్ఱ కాంచవపు జెట్ల చేతను, పంచగోరింటలచేతను, ఖర్జూర వృక్షములచేతను, కానుగ చెట్లచేతను, తియ్యమామిడి చెట్లచేతను, తాడిచెట్ల చేతను, పనసచెట్లచేతను, నిమ్మచెట్లచేతను, నేరేడుచెట్ల చేతను, వెలగచెట్లచేతను, మారేడుచెట్ల చేతను, మందార వృక్షములచేతను, అరటిచెట్లచేతను, కొబ్బరిచెట్లచేతను, ద్రాక్ష తీగెలచేతను, సంపెగ తీగెలచేతను ప్రకాశించుచుం డెడి వనములయందును, దుర్గములయందును, కొండబిల ములయందును, తిరిగి తిరిగి చూచి శార్దూలంబుల నెందును గానక విచారపడినవాడై పలుమారీశ్వరాజ్ఞఁదలఁచి,

శ్లో. వింధ్యాద్రిం మలయాద్రించ గంధమాదనమేవచ ।
హిమవంతం మాల్యవంతం నిషధం పారియాత్రకమ్॥ ౭౯

తా. వింధ్యపర్వతమును, మలయపర్వతమును, గంధమాదనపర్వతమును, హిమవత్పర్వతమును, మాల్యవంతపర్వతమును, నిషధపర్వతమును, పారియాత్రమను పర్వతమును,

శ్లో. వన్యాంశ్చ పర్వతశ్రేష్ఠాన్ మేరు మందరదర్దురాన్ ।
ద్రోణంచ ఋష్యమూకంచ లోకాలోకం దదర్శ సః॥౮౦

తా. ఆరీతి భావనాముని పైజెప్పబడిన పర్వతములను, మఱికొన్ని సముద్రమందలి పర్వతములను ద్రోణ, ఋష్యమూక, లోకాలోకము మొదలగు పర్వతములను దర్శించెను.

శ్లో. నాపశ్య త్తేషు శార్దూలాన్ భావనాముని సత్తమః ।
ఖడ్గగండక భేరుండ వేదండాన్ గవయాంస్తథా॥ ౮౧

తా. మునిశ్రేష్ఠుడగు భావనావీరుడు ఆపర్వతములయందు పెద్దపులులను చూడలేదు. ఖడ్గమృగములను, గండకమృగములను, భేరుండమృగములను, ఏనుగులను, అడవిఎద్దులను,

శ్లో. ఋలాయభల్ల భల్లూక శరభానపి సర్వతః ।
సారంగాన్ చమరాన్ శల్యాన్ వృకాన్మార్జారకానపి॥

తా. ఆ ప్రకారము అడవిదున్నలను, ఎలుగుబంట్లను, భల్లూకములను, లేళ్ళను, చమరీమృగములను, ఏదుమృగములను, తోడేళ్ళను, పిల్లులను.

శ్లో. సింహావానరగోపుచ్ఛాన్ దృష్ట్వా వ్యాకుల మానసః।
సంచరన్నపి భూచక్రం వ్యాఘ్రం వ్యాఘ్రీం నలోకితః॥ ౫౩

తా. ఈ ప్రకారము సమస్త మృగములను దర్శించియు, యాడుపులినిగాని, మగపులినిగాని జూడలేదు.

శ్లో. కారణం కిం నపశ్యామి తత్కులం చాపి సాంప్రతం।
ఇతి సంచిత్య సుచిరం మనసా భావనామునిః। ౫౪

తా. అన్ని జంతువులు కన్పించినను, పెద్దపులులు మాత్రము ఎక్కడను కాన్పించుటలేదు. ఇందుకు ఏమి కారణము? అని భావనాఋషి చక్కగా ఆలోచించెను.

శ్లో. *ఉదయాద్రిం గమిష్యామి విలంఘ్యార్ణవసప్తకం।
తత్రస్థితం నయామ్యద్య శివాజ్ఞాపూరణాయవై॥ ౫౫

తా. అప్పుడు భావనాముని తాను సప్తసముద్రములనుదాటి యుదయపర్వతమునకు వెళ్ళి యచ్చటనుండి పులిని దెచ్చెదనని నిశ్చయించెను.

శ్లో. స యయా వితినిశ్చిత్య వీరో వ్యుదయపర్వతం।
శ్రుత్వా సమాగతం వీరం సాపి భద్రావతీ స్వరైః॥ ౫౬

తా. ఈ ప్రకారము ఆ భావనావీరుడు నిశ్చయించి, ఉదయపర్వతమును చేరబోయెను. అచ్చట ఆ భద్రావతియు వచ్చిన వీరుని జూచి,

శ్లో. శ్రుత పూర్వాణి సర్వాణి చిహ్నాని తస్య సుందరీ ।
దృష్ట్వా నిశ్చిత్యమనసా ఏష ఏవే త్యమన్యత ॥ ౫౭

తా. అనంతరము సుందరియగు నాభద్రావతి యాతని లక్షణముల నూహించి యీాయనయే తనకు దగిన భర్తయని మనంబున నిశ్చయించెను.

శ్లో. ఆకారయిత్వా స్వగృహం దివ్యమాల్యైశ్చ సంయుతం ।
తతో దదర్శ మతిమాణ భావనామునిరద్భుతమ్ ॥ ౫౮

తా. ఆ యుదయాద్రియందు దివ్యములైన పుష్పమాలికలతో నలంకరింపబడిన యింటిని జూచి యాశ్చర్యపడెను.

శ్లో. భాస్వరైర్గృహముఖ్యైశ్చ చైత్యప్రాసాదసంయుతైః ।
విమానైర్మణిముఖ్యైశ్చ మండితం తద్గృహోత్తమమ్ ॥

తా. చిత్రపు మేడలతోడను, ముఖ్యములగు గృహములతోడను, ప్రకాశించుచున్న యిండ్లతోడను, శ్రేష్ఠములగు మణులచే చెక్కబడిన విమానములతోడను ప్రకాశించుచున్నట్టియు, శ్రేష్ఠమైనట్టియు, భద్రావతి మందిరమును,

శ్లో. దృష్ట్వా విస్మయ మాపన్నః ప్రవివేశ గృహోత్తమం ।
తస్మిన్ గృహవరే రమ్యే రత్నసింహాసనేస్థితామ్ ॥ ౬౦

తా. చూచి, ఆశ్చర్యమును పొందినవాడై ఉత్తమమైన యా గృహమును ప్రవేశించెను. ఆ యింటి రత్నసింహాసనమునందున్న

శ్లో. దదర్శ భావనావీరః సావిత్రీమివ రూపిణీం ।
దివ్యాలంకార సంయుక్తాం విద్యుల్లేఖేవ భాస్వరామ్॥౬౧
సూర్యస్య తనయాం తత్ర దివ్యనారీగణైర్యుతాం ।
దృష్ట్వా విస్మయమాపన్నః స్వసమానాను రూపిణీమ్' ౬౨

తా. సావిత్రీదేవితో సమానరూపము గలదియు, యనేకయాభరణముల ధరించినదియునగు సూర్యపుత్రికయగు భద్రావతీదేవిని జూచెను. చూచి మిగుల యాశ్చర్యము బొందెను.

శ్లో. ఏతస్మిన్నేవకాలే సా సముత్థాయ శుచిస్మితా ।
పాదౌ ప్రక్షాళ్య విధివత్ భక్త్యా పరమయా ముదా ౬౩

తా. ఆ సమయమునందే చిరునవ్వుగల యాభద్రావతి లేచి, యథాశాస్త్రముగా భక్తితోను, మిక్కిలి సంతోషముతోను భావనాఋషి పాదములను కడిగి,

శ్లో. ఉవాచ భావనావీరం వాక్యమత్యంతగౌరవం ।
మమ మాత్రే నారదేన త్వద్గుణా రోచితా పురా । ౬౪

తా. అప్పుడు భావనామునిని గూర్చి యత్యంత వినయముతోగూడిన మాటను చెప్పెను. అది యేమనిన భావనామునీ! నాకు నాయనురూపుడగు భర్త యెవరు గలరని మాతల్లి యడుగగా నప్పుడు నారదుడు నీ సుగుణాతిశయముల నుడివెను.

శ్లో. ఫలితం మమ సౌభాగ్య మద్యమాం కరయస్వయం।
ఏవముక్తో మహావీరః ప్రత్యువాచ తదా సతీమ్ ॥ ౬౫

తా. అప్పుడు భద్రావతి యామునిని జూచి తన్ను వరియింపు మనియె. అందుకు భావనాముని యిట్లనియె.

శ్లో. మమాపి రోచతే చిత్తం త్వయ్యేవ సుదతీమణే ।
తథాపి శివకార్యం మే వరం సన్నిహితం శ్రుణు ॥ ౬౬

తా. చక్కని పలువరసగల స్త్రీలలో శ్రేష్ఠులారా! నాకును నీయందు కోరిక గలదు. అయినను ప్రస్తుతము నీకార్యమునకంటె శివకార్యము శీఘ్రముగా జేయవలయును.

శ్లో. వ్యాఘ్రచర్మనిమిత్తం మాం ప్రేషయామాస శంకరః ।
అతో నవరయే త్వద్య మమకార్యస్య గౌరవాత్ ॥ ౬౭

తా. శంకరుడు నన్ను వ్యాఘ్రాజినముకొరకు పంపెను. అందువలన ఆ కార్యమునీాది గౌరవముచేత ఇప్పుడు నేను వరింపగూడదు.

శ్లో. ఇత్యుక్తా స్వాశ్రమే క్షిప్తాన్ ద్వీపినః సావ్యదర్శయత్ ।
చిత్తేశ! భావనావీర! మమాసి ప్రియవల్లభః ॥ ౬౮

తా. భద్రావతి భావనావీరునిచే నీలాగు చెప్పబడినదియై, తన యాశ్రమమందున్న బెబ్బులులను చూపించి యో భావనామునీ! నీవు నాకు ప్రియుడవు.

శ్లో. గచ్ఛశీఘ్రం మమాధీనాన్ గృహీత్వైతాన్ మృగాదనాన్ ।
అర్పయిత్వా శివాయ త్వమితో గత్వాను మాంపునః॥

తా. నీవు నా అధీనమునందున్న వ్యాఘ్రములను తీసికొని శీఘ్రముగా పొమ్ము. ఇక్కడనుండి పోయి శంకరు నకు అర్పించి త్వరగా నన్ను గుఱించి,

శ్లో. ఆగత్యపాణిం గృహీత్వా అన్యథా భ్రూణహాభవ।
ఇత్యుక్తో మునిశార్దూలో హ్యనుజ్ఞాతో యయౌ తదా॥

తా. నీవు కైలాసమునుండి వచ్చి నన్ను వివాహము చేసికొనుము. కాదేని భ్రూణహత్య నొనరించినవాడ వగుదువు. భావనాఋషి యిట్లు చెప్పబడినవాడై ఆమె అనుజ్ఞ తీసికొని వెడలిపోయెను.

శ్లో. కృతార్థం మన్యమానస్సన్ కైలాసం సత్వరంగతః।
తదా నారద ఆగత్య దృష్ట్వా తం భావనామునిమ్॥ ౭౧

తా. భావనాఋషి తన్ను కృతకృత్యునిగా భావించుకొని శీఘ్రముగా కైలాసమునకు పోయెను. అప్పుడు నారద మహర్షి వచ్చి భావనాఋషిని చూచి,

శ్లో. ఉవాచ ప్రీతిసంయుక్తో వ్యాఘ్రవాహేతి సాదరం।
దృష్ట్వా తం భావనావీరః కైలాసే శివసన్నిధౌ॥ ౭౨

తా. దయతోను, ఆదరముతోను గూడినవాడై భావనాఋషిని "వ్యాఘ్రవాహుడ"ని పలికెను. భావనాఋషి కైలాసమునందు శివసన్నిధిలోనున్న నారదుని చూచి,

శ్లో. శార్దూలానగ్రతః స్థాప్యప్రణమ్య శిరసా బ్రవీత్।
దేవ దేవ మహాదేవ పశ్యశార్దూల సంచయమ్॥ ౭3

తా. అప్పుడు తాను తీసికొనివచ్చిన పులులమంద నందుంచి నమస్కరించి వ్యాఘ్ర సమూహమును మహాదేవు డగు నా యీశ్వరునకు జూపెను.

శ్లో. ప్రసన్నస్సన్ గృహాణేశ రోచతే యత్ర తే మనః।
ఇత్యుక్తః పార్వతీనాథః పశ్యన్ శార్దూల సంచయమ్॥

తా. అప్పుడు భావనాముని యీశ్వరునికి జూపి యిష్టమైనదానిని గ్రహింపుమనియెను. ఈశ్వరుడు వానిని జూచెను.

శ్లో. తత్రైకం ద్వీపినం హత్వా సనఖం చ సవాలధిం।
గృహీత్వా చర్మవసనం సంవధార సదాశివః॥ 2౫

తా. ఆ సాంబమూర్తి యా శార్దుల సమూహమం దొకదానిని వధించి దాని చర్మమును సంతోషముతో ధరించెను.

శ్లో. తత్తరక్షు శరీరోత్థం తేజ ఏకం బభూవ హ।
తేజసా వయసా యుక్తం దివ్యం రూపం వహన్ సురః॥

తా. ఆ పులియొక్క శరీరమునుండి ఒక అద్వితీయ మైన తేజస్సు కలిగెను. ఆ తేజస్సునుండి వయస్సుతో కూడిన దివ్యరూపము వహించిన ఒక దేవత వెడలెను.

శ్లో. స్తుత్వా శివం స్వవృత్తాంతం దుర్వాసః శాపమాదితః।
వదన్ సోఽపి ముదాయుక్తః శివసాయుజ్యమాప్తవాన్॥

తా. ఆ దేవత యీశ్వరు ననేకవిధముల నుతించి తనకు దుర్వాసుడను మహాముని యొసగిన శాపము మొద

లుగాగల వృత్తాంతము నంతయును విశదపరచి సంతసమున శివలోకము నందెను.

శ్లో॥ తతోహృష్టః ప్రసన్నాత్మా శివస్తం భావనామునిం।
ఉవాచ భావనావీర త్రిలోకే నాస్తితే సమః॥ ౭౮

తా. అప్పుడు సంతోషించినవాడును ప్రసన్నుడునగు నీశ్వరుడు భావనామునీ! నీకు సాటియగు వీరుడు ముజ్జగంబుల లేడు.

శ్లో॥ అతోమమ ప్రియోఽసి త్వం మదాజ్ఞావర్తకోయతః।
ఇత్యుక్త్వా మునయే తస్మైదదౌ విష్టఫలం ముదా। ౭౯

తా. నీవు నా యాజ్ఞను పాలించితివి గాన నీవు నాకు ప్రియుడవు. అని పలికి సాంబమూర్తి యాతనికి కోరికల నిచ్చెను.

శ్లో॥ వైయాఘ్రకేతనం వ్యాఘ్రవాహనం చ తథవిధం।
చక్రాయుధం దదౌతస్మై శంభుః పరమహర్షతః ౮౦

తా. సాంబమూర్తి సంతసించినవాడై యా భావనామునికి వ్యాఘ్ర టెక్కెమును, వ్యాఘ్రవాహనమును, చక్రాయుధమును ఇచ్చెను.

శ్లో॥ స లబ్ధ్వా విజయంవీరః బిరుదాని బహూన్యపి।
తతఃశివాజ్ఞయా వ్యాఘ్రాన్ సంఘీకృత్య విచక్షణః॥౮౧

తా. వీరుడగు భావనాఋషి అనేకములగు బిరుదులను పొంది, ఈశ్వరుని ఆజ్ఞచేత పెద్దపులులను గుంపుగా చేసి,

శ్లో. స్వకీయవిద్యయా కంచి త్పుమాంసం పరికల్ప్య సః ।
స్వభృత్యం పాకసేనాఖ్యం తదధీనా న్విధాయచ॥ ౮౨

తా. అప్పుడా భావనాముని తన విద్యచేత పాక
సేనుడనువానిని సృజించి వానికి వ్యాఘ్రముల నప్పగించి,

శ్లో॥ పాకసేన మహావీర ! గృహీత్వేనాన్ మృగాదనాన్ ।
వింధ్యాటవీంప్రవిశ్యాఽథ మమస్మృతి మనువ్రజ॥ ౮౩

తా. వీరుడగు పాకసేనుడా ! ఈ పులులన్నిటిని
స్వాధీనపఱచుకొని నాయాజ్ఞ ననుసరించి వింధ్యారణ్యమున
నుండుము.

శ్లో॥ దేవదత్తా నస్మదీయాన్, ఖ్యాతిచిహ్నాన్ మనోహరాన్।
ఉపవాహ్యాస్మదీయానాం భృత్యో భవ మదాజ్ఞయా ॥

తా. భగవంతునిచే నియ్యబడిన మనోహరమైన
ఖ్యాతిచిహ్నములను ధరించి నాయాజ్ఞచే నా సంబంధమైన
వారలకు సేవకుడవగుము.

శ్లో॥ ఇత్యుక్త్వా సహశార్దూలైః ప్రేషయిత్వా చ తం పునః।
వాక్యమేతదువాచైనం శంకరం భావనామునిః॥ ౮౫

తా. అప్పుడాముని పెద్దపులులతోగూడ నా పాక
సేనుని పంపి, శివునితో మరల నిట్లనియె.

శ్లో॥ దేవ ! త్వదాజ్ఞాం శిరసి ధారయన్ సర్వతోభువం ।
వనాని దండకాదీని గిరీన్ హిమవదాదికాన్ । ౮౬

తా. ఓ సాంబమూర్తీ ! నీ యుత్తరువును శిరసా
వహించి ప్రపంచ మంతటను దండకారణ్యము మొదలైన

యరణ్యములను, హిమవంతము మొదలైన పర్వతములను జూచితివి.

శ్లో॥ నదీర్భాగీరథీ ముఖ్యా స్సంచరన్ సర్వతోదిశః ।
భువి దిక్షుచ సర్వాసు మృగయంస్తాన్ మృగాదనాన్॥

తా. దిక్కు లన్నింటియందును గంగ మొదలుగా గల నదులయందును సంచరించినవాడనై, మనుజలోక మందు పులులను వెదకితివి.

శ్లో॥ తతశ్చింతాపరో భూత్వా ప్రాప్తోహముదయాచలం।
తత్ర కాచిద్రవేః కన్యానామ్నా భద్రావతీసతీ ॥ ౮౮

తా. పులులను గానక చింతాపరుడనై యుదయాద్రిని జేరితిని. ఆ యుదయాద్రియందు సూర్యుని కుమార్తె యగు భద్రావతియను కన్యక కలదు.

శ్లో॥ తనుమధ్యా నీలవేణీ తారాధిపనిభాననా ।
తటిల్లతా సమానాంగీ తప్తకాంచన భూషణా॥ ౮౯

తా. సూక్ష్మమైన నడుము గలదియు, నల్లని వేణి గలదియు, చంద్రబింబముతో సమానమైన ముఖము గలదియు, మెరుపు తీగతో సమానమైన శరీరము గలదియు, పుటము వేయబడిన బంగారముతో చేయబడిన భూషణములు కలదియు,

శ్లో॥ హేమాంగదయుతా నారీ మనోహరపయోధరా ।
కల్హార గంధినీ చైవ ఇందీవరదళేక్షణా ॥ ౯౦

తా. బంగారు భుజకీర్తులను ధరించినదియు, మనోహరపయోధరములు గలదియు, కర్పూరమువంటి గంధము గలదియు, నల్లకలువలవంటి నేత్రములు గలదియు,

శ్లో. రంభాసమానరూపా సా దృష్ట్వా మన్మథమోహినీ।
మయ్యుత్సుకామహాదేవ! మోహితోఽ కిముగోపనే॥ ౯౧

తా. రంభతో సమాన రూపవతియు, మన్మథుని సైతము మోహింపజేయునదియు నగు నా భద్రావతి నన్ను వరించెను. నేనును ఆమెయందు మోహితుడ నైతిని

శ్లో. పాణిగ్రహం మహాదేవ! తదానాస్తి తవాజ్ఞయా।
యాస్యామ్యద్య మహాప్రాజ్ఞ! చాశీర బ్రూహిమహామహా॥

తా. ఓ సాంబమూర్తీ! నే నప్పుడు పాణిగ్రహణము చేసికొనలేదు. మీ యాజ్ఞానుసారినై వెళ్లుదును. నన్నాశీర్వదింపుడు.

శ్లో. కార్యే మహతి సంపన్నే యస్తు కార్యాంతరం విశేత్।
సఏవ కర్మవిభ్రష్ట స్తస్మాత్త్వం నాను వర్తయ॥ ౯౩

తా. చేయదగిన కార్య మాసన్నమైయుండగా నెవడితరకార్యమున ప్రవేశించునో వాడు కర్మభ్రష్టుడు. అందువలన నిపుడు నన్ను స్మరింపవలదని నా యీశ్వర కార్యమును ఆమెకు దెలిపితిని.

శ్లో. పరిపాల్య శివానుజ్ఞా మాగమిష్యామి తేఽనిశం।
ఇత్యుక్త్వా సా మయా తత్ర మామువాచ సుమధ్యమా॥

తా. భద్రావతీ! నే నీశ్వరకార్యం బొనర్చి నీ యంతి కముము జేరుదువని యచ్చట జెప్పితిని. ఆ భద్రావతియు నన్నుగూర్చి యిట్లు బదులు జెప్పెను.

శ్లో. త్వదర్థం పూర్వమేవాఽహం వ్యాఘ్రానాహరయం బహూన్ ।
ఏతన్మృగాదనాన్ గృహ్యా త్వరితం గచ్ఛసువ్రతః॥ ౯౫

తా. ఓ భావనామునీ! నీకొఱకు ముందే యీపులుల దెప్పించితిని. శీఘ్రముగా గొనిపొమ్ము.

శ్లో. గత్వా త్వం మత్సమీపంతు శీఘ్రమాగచ్ఛ హేమునే!
తథా త్వం భ్రూణహా వీర నాగచ్ఛసి యది స్వయం।
ఇత్యుక్తోఽహం తయా దేవ! సంప్రాప్తస్తవ సన్నిధిమ్॥౯౬

తా. ఓ భావనామునీ! నీవుపోయి రానియెడల భ్రూణ హత్య నొనర్చినవాడ వగుదువని చెప్పబడినవాడనై నీయొద్దకు వచ్చితిని.

శ్లో॥ యదత్రానంతరం కార్యం విధేహీమమతుష్టయే।
ఏవముక్తః పశుపతిః శ్రుత్వాతద్వచనం శుభమ్। ౯౭

తా. "ఇచ్చట తర్వాత జరుగవలసిన కార్యమును, నా తృప్తికొఱకు తెలుపుము" అని భావనాఋషి చెప్పిన మాటను విని,

శ్లో। గౌరీం స్మేరాననః పశ్యన్ వాక్యమూచే శుభాక్షరం।
నాస్త్యన్యైవ కృతం దేవి చారిత్రం వీరక ర్త్మకమ్॥ ౯౮

తా. అప్పుడు సాంబమూర్తి పార్వతీదేవిని జూచి యో పార్వతీ! భావనాముని యొనర్చిన కార్యమును మఱి యొకడొనర్పలేడు.

శ్లో॥ బ్రహ్మాద్యైరమరై ర్వాపి సేంద్రై ర్వా రక్షోమహర్షిభిః ।
కర్తుం నశక్యం గిరిజే! కర్మే తన్మహావమ్భుతం॥ ౯౯

తా. ఓ పార్వతీ! ఇప్పుడు భావనాముని యొనర్చిన కార్యము త్రిమూర్తులచేతనైనను, ఇంద్రాది దేవతల చేతనైనను, మహర్షులచేతనైనను ఒనర్పబడలేదు.

శ్లో॥ అతోనః ప్రీతిపాత్రోஉసౌ సురాణాం భావనామునిః ।
తం దృష్ట్వా ప్రాహ గిరిజా భావనామునిమాదరాత్॥

తా. "భావనాఋషి దేవతలకు మనకు ప్రీతిపాత్రుడయ్యెను" అని ఈశ్వరుడు చెప్పగా అప్పుడు పార్వతీదేవి యిట్లనియె.

శ్లో. హేమదంత ఇతిఖ్యాంతు త్రిషులోకేషు విశ్రుతః ।
సర్వత్ర తే సమానాస్తి సుధాంశురివ భూతలే॥ ౧౦౧

తా. వీరుడా ఇక నీవు హేమదంతుడను పేరుచేత ప్రసిద్ధిగాంచి భూలోకమున సాటిలేక చంద్రునివలె వెలుగగలవు.

శ్లో. ఇతి బ్రువంత్యాం పార్వత్యామాగతే దివ్యకన్యకే ।
సఖ్యౌ భద్రావతీ ప్రేష్ఠా ప్రణమ్య శివమవ్యయమ్ ౧౦౨

తా. ఈ ప్రకారము పార్వతీదేవి మాటలాడుచుండగా భద్రావతి చెలికత్తెలగు నిరువురు దేవకన్యలు వచ్చి శివునకు ప్రణామము నాచరించి,

శ్లో. ఊచతు ర్గిరిజానాథం సర్వదేవ సమన్వితం ।
దేవదేవేశ గౌరీశ సూర్యపుత్ర్యా చ ప్రేషితే ॥ ౧౦౩

తా. అప్పుడు వారిరువురు సమస్తదేవతల మధ్యంబున నున్న యీశ్వరుని జూచి గౌరీనాథా! మేము సూర్యపుత్రికయగు భద్రావతీదేవిచేత నంపబడినవారము.

శ్లో. వైయాఘ్రచర్మవసనం లబ్ధుం వై భావనామునిః ।
ప్రాప్తవా నుదయాద్రించ తం దృష్ట్వా మోహితాసఖీ ॥

తా. ఓ శంకరా! భావనాముని పులిచర్మముకొఱకు ఉదయాచలమునకు వచ్చెను. అప్పుడు మాసఖి వానినిజూచి ప్రేమించెను.

శ్లో. స తు తాముక్త్వాగ దేవ! పునరేష్యామి వై ప్రభో ।
నాగతం తం మునిం జ్ఞాత్వా ప్రేషితే తవ సన్నిధిమ్ ॥

తా. భావనాముని మరల వత్తునని రానందున మీయొద్దకు వచ్చితిమి.

శ్లో. ఇత్యుక్తః పరమప్రీతో దధ్యౌ సూర్యం తదా శివః ।
ఆగతం ప్రణతం సూర్యం దృష్ట్వా సవినయాన్వితమ్ ॥

తా. భద్రావతి చెలికత్తెలు ఇట్లు చెప్పగా, ఈశ్వరుడు మిక్కిలి సంతోషించినవాడై సూర్యుని తలంచెను.

తలంచిన వెంటనే తన ఎదుట ప్రత్యక్షమై, వినయముతో నమస్కరించుచున్న సూర్యుని జూచి.

శ్లో. ఉవాచ శంకరః ప్రీత్యా దీయతాం పుత్రికా త్వయా।
భావనాముని యేప్యస్మై స్త్రలోకానాం హితకామ్యయా॥

తా. అప్పుడు శంకరుడు సూర్యునితో "లోకహితార్థము నీ పుత్రిక నీ భావనామునికిమ్ము" అని పలికెను.

శ్లో. శంకరేణైవ ముక్తస్తు రవి రోమిత్యథాబ్రవీత్ ।
తతో దేవగురుం శంభుర్మనసా సమచింతయత్ ॥ ౧౦౮

తా. శంకరుడు చెప్పిన మాటకు రవియు సరే యనగా సాంబమూర్తి మనంబున బృహస్పతిని దలంచెను.

శ్లో. తతో నిమిషమాత్రేణ సమాగత్య బృహస్పతిః ।
వవందే శిరసా దేవం పార్వతీపతి మవ్యయమ్ ॥ ౧౦౯

తా. శివుడు ధ్యానించిన మాత్రముననే బృహస్పతి వచ్చి యీశ్వరునికి నమస్కరించెను.

శ్లో. తత స్తమాహ భగవాన్ సురాచార్యం హితం వచః ।
భావనాభాను పుత్ర్యోస్త్వం సుముహూర్తంచ
గీష్పతే। ౧౧౦

తా. అనంతరము ఉత్పత్త్యాది గుణములచేత ప్రకాశించు నా సాంబమూర్తి బృహస్పతితో భావనా భద్రావతుల వివాహమునకు సుముహూర్తమును నిశ్చయింపుమని చెప్పెను.

శ్లో. అవదన్మాఘమాసేతు శుక్లపక్షే విరాజితే।
విహాహం మకరే లగ్నం సప్తమ్యాం భానువాసరే॥౧౧౧

తా. అప్పుడు బృహస్పతి మాఘ శు॥ సప్తమీ భాను వాసరమునందు మకరలగ్నమున శుభముహూర్తమును నిశ్చయించెను.

శ్లో. తథేతి త్వరితం గత్వా సర్వానాహూయవై సురాన్ ।
స్వయం నందిన మారుహ్య పార్వత్యా సహితః శివః ॥

తా. అప్పు డీశ్వరు డీసమాచారమునువిని త్వరగా బయలుదేరి దేవతల నందరిని పిలిచి తాను పార్వతితో గూడ నందివాహనారూఢుడై బయలుదేరెను.

శ్లో. తతస్తు గరుడారూఢో లక్ష్మీనారాయణో యయౌ ।
హంసవాహన మారుహ్య సరస్వత్యా చతుర్ముఖః ॥౧౧౩

తా. లక్ష్మీసహితుడగు నారాయణమూర్తి గరుడు నెక్కి వెళ్ళెను. బ్రహ్మ సరస్వతితో హంసనెక్కి వెళ్ళెను.

శ్లో. భావనామునినా సాకం ప్రయయుః పూర్వపర్వతం।
ప్రమథా గుహ్యకాశ్చైవ మాహేశ్వర్యాది మాతరః ॥

తా. అప్పుడు బ్రాహ్మీ మొదలగు సేడ్గురు తల్లులు, గుహ్యకులును ప్రమథగణములును భావనామునితోగూడ నుదయ పర్వతమునకు పయనమైరి.

శ్లో. కిన్నరా గరుడాశ్చైవ యక్షకింపురుషాస్తథా।
విద్యాధరాశ్చ గంధర్వా స్సిద్ధా శ్చాప్సరసస్తథా॥ ౧౧౫

తా. కిన్నరులు, గరుడులు, యక్షులు, కింపురుషులు, విద్యాధరులు, అప్సరసలుకూడ పయనమైరి.

శ్లో. సురైస్సహర్షిభిర్దేవ్యః శచ్యాసహాపురందరః ।
సుముహూర్తం కారయితుం సంప్రాప్తా ఉదయాచలమ్॥

తా. అప్పుడు దేవతాస్త్రీలు దేవతలతోడను, ఋషిస్త్రీలు ఋషులతోడను, శచీదేవితో నింద్రుడును బయలుదేరి ఆ సుముహూర్తమునకు నుదయపర్వతము చేరిరి.

శ్లో. స్థాపయిత్వా మహావీరం మంత్రైస్తైః శ్రుతిచోదితైః ।
ప్రవయా వేదికాం కృత్వాస్థాపయిత్వా హుతాశనమ్ ॥

తా. పెద్దవాండ్రు వేదచోదితములైన మంత్రముల చేత మహావీరుడైన భావనాఋషిని కూర్చుండబెట్టి అరుగు నేరపరచి, అగ్నిహోత్రుని ఉంచిరి.

శ్లో. జాతనామాదికం కర్మస్వస్తివాచన పూర్వకం ।
వేదోక్త విధినాకృత్వా చౌలోపనయనం తథా ॥ ౧౧౮

తా. స్వస్తివాచన పూర్వకముగా జాతకర్మ, నామకరణము మొదలగు కార్యములను, అట్లే వేదచోదిత విధిచేత చౌలోపనయనము కార్యమును చేసి,

శ్లో. వసిష్ఠ ప్రముఖైర్విప్రైర్మార్కండేయశ్చకారహ ।
యథాక్రమం యథాన్యాయం యజ్ఞ సూత్రంచ
మేఖలామ్ ॥ ౧౧౯

తా. అప్పుడు యాజ్ఞికుడగు మార్కండేయుడు వసిష్ఠాది మహర్షులతో గూడుకొన్నవాడై జందెమును మొలత్రాడు? యును చేసెను.

శ్లో. దండాజినేచ సావిత్రీ ముపదిశ్య సహోమకం ।
కృత్వోపవయనం విప్రా శ్చక్రు ర్బహ్వాశిషం శుభామ్ ॥

తా. అప్పుడు విప్రోత్తములు భావనామునికి కృష్ణాజినము, దండము మొదలగువాటి నిచ్చి సావిత్రీదేవి నుపదేశించి హోమపూర్వకముగా నుపనయనమును జేసిరి.

శ్లో. అనంతరం శచీముఖ్యాః దివ్యనార్యః సుతాం రవేః ।
అలంకృత్య సుభూషాభిర్దివ్యాభిశ్చాంగరాగకైః ॥ ౧౨౧

తా. తరువాత శచీదేవి మొదలగు దేవతాస్త్రీలు సూర్యపుత్రికను, దివ్యాలంకారముల చేతను, మంచిగంధపు పూతల చేతను అలంకరించిరి.

శ్లో. నిన్యుర్వివాహవేదింతాం బధ్వా యవనికాంతయోః ।
తదాచోద్ఘుష్యమాణేషు దేవానాం దుందుభీషుచ॥ ౧౨౨

తా. అప్పుడు దేవతాస్త్రీలు తెర చీరలయొక్క కొంగులను పట్టుకొని యామెను వివాహవేదికకు చేర్చిరి. అప్పుడు దుందుభివాద్యములు మ్రోగుచుండగా,

శ్లో. పతత్సు పుష్పవృష్టీషు నృత్యం తీష్వప్సరస్సుచ ।
ఆశీర్వాదేషు సర్వేషు సురేషు చ మహర్షిషు ॥ ౧౨౩

తా. పుష్పవర్షములు కురియుచుండగా, అప్సరసలు నృత్యములు చేయుచుండగా దేవతలు ఋషులు ఆశీర్వాదములు చేయుచుండగా,

శ్లో. తదా భద్రావతీం కన్యాం భావనామునయే రవిః ।
అలంకృత్య దదా తస్మై హిరణ్యోదక పూర్వకమ్ ॥

తా. అప్పుడు మంగళవాద్యములు మ్రోగుచుండగా పుష్పవర్షములు కురియుచు అప్సరసలు నాట్యము చేయుచు బ్రాహ్మణులు ఆశీర్వదించుచు నుండుసమయంబున సూర్యుడు తన పుత్రిక నలాకరించి హిరణ్యోదకములతో భావనాముని కొసంగెను.

శ్లో. భూషణాని చ దివ్యాని రత్నాని వివిధానిచ ।
భావనాముని మభ్యర్చ్య పాణిం జగ్రాహ పాణినా ౧౨౫

తా. అప్పుడు భావనాముని నర్చించి యనేక యాభరణములొసంగెను, తరువాత పాణిగ్రహణ మొనర్చెను.

శ్లో. అరణార్థమనేకాంశ్చ దాసీదాసాం శ్చహర్షితః ।
అనలోరణ శూరశ్చ విజయో రణపాలకః ॥ ౧౨౬
గంధర్వా కంపవీరశ్చ సాహసీహరివిక్రమః ।
వీరావతారః పరహాచంద్రికాలోల ఏవచ ॥ ౧౨౭
మందరోమందర స్వాంతో విక్రమో రాజవల్లభః ।
విచిత్రాంబరధారీతి షోడశైతేఽనుయాయినః ॥ ౧౨౮
రవిదత్తా మహావీరం కించ భద్రావతీం సతీం ।
వవందే భావనావీరస్స్వవధూ కశ్చ భాస్వరమ్ ॥ ౧౨౯

తా. మఱియు లెక్కలేని దాసదాసీ జనమ్ములను సంతోషముతో నిచ్చెను. అనల, రణశూర, విజయ, రణపాలక, గంధర్వ, అకంపవీర, సాహసి, హరివిక్రమ, వీరావతార, పరహ, చంద్రికాలోల, మందర, మందరస్వాంత,

విక్రమ, రాజవల్లభ, విచిత్రాంబరధారి అను పదునార్గురును సూర్యునిచే అరణముగ నియ్యఁబడి భద్రావతీ భావనా మునుల ననుసరించిరి. అప్పుడు భార్యతో గూడిన భావనా ముని సూర్యునకు నమస్కరించెను.

శ్లో॥ ఆమంత్ర్యాఖిల దేవాంశ్చ సమావిష్టశ్శివేనచ ।
యయౌ సభార్యో మునిరాడ్దాసదాసీసమావృతః॥ ౧౩౦

తా. ఈశ్వరుని సమీపముననున్న యా భావనా ముని ఋషులవద్ద సెలవు పుచ్చుకొని భార్యతోను, పరివారముతోను బయలుదేరెను.

శ్లో॥ పుండరీకం సమారూఢ స్తదంకధ్వజలాంఛనః ।
ఆరుహ్య కనకాందోళీం సుకతీ రవిపుత్రికా ॥ ౧౩౧

తా. భావనాఋషి బెబ్బులిని ఎక్కి, బెబ్బులి ధ్వజమును ధరించెను. భద్రావతి బంగారు పల్లకిని ఎక్కెను.

శ్లో॥ వీజ్యమానా చామరాభ్యాం శంఖాన్ దధ్మాప
యన్మ్మహుః ।
శ్వేతాతపత్ర సహితస్తూయ మానేషు వందిషు ॥ ౧౩౨

తా. కొందఱు చామరములు వీచుచుండిరి. మఱి కొందరు శంఖములను పూరించుచుండిరి. తక్కినవారు స్తోత్రములు చేయుచుండిరి. భావనాముని తెల్లని గొడుగుతో ప్రకాశించినవాఁడై.

శ్లో॥ ప్రవివేశపురీం రమ్యాం కనకాద్ర్యభిధానికాం ।
పాతివ్రత్యేన మహతావిద్యయా శివదత్తయా ॥ ౧౩౩

తా. ఆ యుమామహేశులచే బాతివ్రత్య విద్యను బొంది కనకాద్రియను పేరుగల యందమైన పట్టణమును బ్రవేశించిరి.

శ్లో॥ విరేజతుః క్రీడమానౌ సఖ్యేన మహతావృభౌ ।
సుఖేనైవం గతేకాలే తస్యాం సత్యామజాయత॥ ౧౩౪
పీవర్యాం వేదశిరసః పుత్రావంశకరాశ్శతం ।
మార్కండేయ సమాఖ్యాశా ఋషయో వేదపారగాః॥

తా. ఆ భద్రావతీ భావనామునులు మిక్కిలి యన్యోన్యముగా నుండిరి. ఇట్లు సుఖముగా కొంతకాలము గడువగా, పీవర్తియందు వేదశిరునకు మార్కండేయునితో సమానులైన, వేదపారగులైన, వంశము నభివృద్ధిచేయు నూరుగురుపుత్రులు కలిగిరి.

శ్లో॥ ఏకదా భావనా వీరస్తాన్ గృహీత్వా ప్రమోదతః ।
కైలాసశిఖరే దేవం సహపుత్రైరవందత॥ ౧౩౬

తా. ఒక సమయమునందు భావనాముని పుత్రుల దోడ్కొని మిగుల సంతోషముతో కైలాసమునకు వెళ్లెను. అచ్చటవున్న శివున కందఱును నమస్కరించిరి.

శ్లో॥ తతః ప్రసన్నో భగవాన్ ప్రోవాచవచనం శివః ।
శృణుధ్వమృషి సంభూతాః మయోక్తంవోహితంవచః॥

తా. అప్పుడు భగవంతుడగు సాంబమూర్తి ఋషివర్యులారా! మీకు హితకారియైన మాట నుడివెద నాల కింపుడు.

శ్లో॥ త్వత్పిత్రే భగవాన్విష్ణు రదాత్పద్మతంతుకాన్ ।
తేన సర్వే భవంతశ్చ పద్మశాలీయకా ఇతి ॥ ౧౩౮

తా. షడ్గుణైశ్వర్యయుక్తుడగు హరి మీ తండ్రికి పద్మతంతువుల నొసగినందున మీరందరు పద్మశాలీయులనబడుదురు.

శ్లో. యూయం ఖ్యాతిం సంపదంచ గమిష్యథ జగత్త్రయే ।
త్వత్పితుః ప్రాప్తవాన్ విష్ణుః పీతాంబరమహంతథా ।
వ్యాఘ్రాజినం ధ్వజపటం తస్మాద్యూయ మతిప్రియాః ॥

తా. మీరందరు ముల్లోకములందు మిక్కిలి కీర్తి నందగలరు. మీ తండ్రియగు భావనామునివలన హరిపీతాంబరమును, నేను పులిచర్మమును కేతనమును పొందితిమి. అందువలన మీరు నాకు ప్రియులు.

శ్లో, అస్మిన్ కృతే యుగే సృష్టం మనసా పద్మతంతుభిః ।
కార్పాస తంతుభిః కార్యం త్రేతా ద్వాపరయోః కలౌ ।
దృష్ట్యా భవేద్ధి త్రేతాయాం ద్వాపరే వాగ్బలేనచ ॥ ౧౪౦

తా, కృతయుగమున మనస్సుతోడను పద్మతంతువులతోడను వస్త్రములు సృష్టింపబడినవి, త్రేతా ద్వాపర యుగములందు ప్రత్తినూలుతో వస్త్రములను కల్పింపవలయును, త్రేతాయుగమునందు దృష్టిచేతను, ద్వాపరంబున వాగ్బలముచేతను జేయవలయును.

శ్లో. కర్మణా కాయకేన స్యాత్కలౌ వాం వస్త్ర నిర్మితం ।
ఇత్యుక్త్వా గిరిజానాథ స్సహితః పరమేష్ఠినా ॥ ౧౪౧

తా. కలియుగమునందు మీకు వస్త్రనిర్మాణము శరీరముచేతను, కర్మచేతను అగునని శివుడు పలికి బ్రహ్మతో కూడినవాడై,

శ్లో. పుత్రైస్సాకం సమాజగ్ముః హరిందుగ్ధాబ్ధిశాయినం।
ఉవాచ చానతః శంభుర్వాక్యం లోకోపకారకమ్ ॥౧౪౨

తా. అప్పుడు భావనాముని పుత్రులగు పద్మశాలీయులను తీసికొని బ్రహ్మాదులతో ఈశ్వరుడు హరియొద్దకేగి నమస్కరించి లోకోపకారకమగు వాక్యము నుడివెను.

శ్లో. భగవాన్ భవతా దత్తాః నాభీకమల తంతవః।
భావనామునయే పూర్వం ఏతైవముని పుత్రకాః। ౧౪౩

తా. షడ్గుణైశ్వర్య యుతుడవగు నో విష్ణుమూర్తీ! పూర్వము నాభికమల తంతువులు మీచే భావనామునికివ్వబడియెను. వీరు భావనాముని పుత్రులు.

శ్లో. అత స్తంతు జనేర్బీజం దేహి తేభ్యో హ్యనశ్వరం॥ ౧౪౪

తా. అందువలన వీరికొరకు నాశనములేని తంతువులు పుట్టుటకు బీజమును యివ్వవలసినది అని ఈశ్వరుడు ప్రార్థింపగా,

శ్లో. లోకాఽనుగ్రహ మన్విష్యన్ తాన్వీలోక్యకృపాపరః।
దదౌ నాభి సరోజాత కోశ బీజానిచాపరమ్। ౧౪౫

తా. శ్రీమన్నారాయణమూర్తి లోకానుగ్రహార్థమై వారిని దయతో వీక్షించి తన నాభికమలకోశమున నుండిన బీజములను వారి కొసగెను.

శ్లో. ఉవాచ పరమప్రీత్యా శంకరం భక్తవత్సలః ।
బీజేష్వేతేషు సంభూతో బ్రహ్మాణ్యాం శోపి తత్పరః ।

తా. అప్పుడు భక్తవత్సలుడగు శ్రీమన్నారాయణ మూర్తి శంకరునితో శ్రీకంఠా! పరమేష్ఠి యంశము నా నాభికమలమందలి బీజములతో గూడుకొనియున్నది.

శ్లో. స్థాప్యతే పూర్వమేతేషు మదంశో విద్యతే యతః ।
త్వత్కృపాచ విశేషేణ విద్యతే యేషు తేనవై ॥ ౧౪౭
కార్పాసఫలినో వృక్షాః జాయంతే నాత్ర సంశయః ।
తైరేవ తంతవో లోకే జాయంతే చిత్రవర్ణకాః ॥ ౧౪౮

తా. పూర్వ మీ బీజములు నాయంశతో గూడి యున్నవి. నా నాభికమలమం దుత్పన్నమైనవిగాన నా కరుణ గలదు. సర్వేశ్వరుడవగు నీయంశము నిందుండ గలదు. కనుక వీనిచేతనే ప్రత్తి నూలు కలుగును.

శ్లో. మనసా జాయతే సృష్టిః కృతే నీరజ తంతుభిః ।
త్రేతాదిషు యుగేష్వేవ ధ్రువం వాక్కాయ కర్మభిః ॥ ౧౪౯

తా. కృతయుగంబున కమల తంతువులతోను, తదితర యుగములందు మనోవాక్కాయ కర్మములచేతను సృష్టి జరుగును.

శ్లో. తదర్థం వా మయాదత్తం బీజం కార్పాసకారణాత్ ।
తస్మాడ్డిండీర శుభ్రాశ్చ తంతవః పద్మతంతువత్ ॥ ౧౫౦

తా. ప్రత్తినూలు లేక వస్త్రములు కల్పించుటకు కష్టమైనందున మీకీ బీజముల నిచ్చితిని. అందుచే పద్మ

తంతువులవలెను సముద్రపు నురుగులవలెను తెల్లనైన తంతువులు గలుగును.

శ్లో॥ అతః శుద్ధగుణోపేతాః భవిష్యంతి సుతా మునేః ।
ఇత్యుక్త్వాన్తర్దధే విష్ణుస్తదాస్తుతిభిరీడితః ॥ ౧౫౫

తా. ఓ మునికుమారులారా! అందువలన మీరు నిర్మలగుణులు గాగలరు. అని చెప్పగా స్తోత్రముచేత నారాయణమూర్తిని ధ్యానించిరి. పిదప విష్ణుమూర్తి అంతర్హితుడాయెను.

శ్లో॥ ఏవం దత్వా మహాదేవః పద్మబీజాని సాదరం ।
అతోహి పద్మశాలీయం శ్రీమన్నారయణోదితమ్॥ ౧౫౬

తా. నారాయణు డట్లు పద్మబీజముల దయతో నొసగినందున పద్మశాలీయమని పేరు పెట్టెను.

శ్లో॥ మూర్తిత్రయాంశ సహితాన్ వృక్షాన్ కార్పాససంచయాన్ ।
ప్రపద్యంతేహ్యతో యూయం ....................ప్తాః ।

తా. మూర్తిత్రయాంశముతో గూడిన కార్పాస వృక్ష సమూహములను పొందుటచేత కీర్తిని సద్గుణముల నందుదురు.

శ్లో॥ గత్వాచ స్వాం పురీం రమ్యాం హిత్వా శత్రూన్ దినే దినే ।
పితృమాతృ సుహృద్భిశ్చయూయం యుక్తా భవిష్యథ॥

తా. వీరు పట్టణముజేరి క్రమక్రమముగ శత్రువుల జయించి మాతృ, పితృ సుహృద్బంధువులతో గూడి యుండ గలరు.

శ్లో॥ శృణ్వన్ని దేశాన్గిరి శస్యశంభోః ।
నిజాలయం ప్రాప్యశుభైః ప్రహృష్టాః ।
విద్యాం పితుః ప్రాప్యగిరీశదత్తాం ।
శ్రీ భావనామౌని సుతావిరాజతే ॥ ౧౫౫

తా. అప్పు డీశ్వరాజ్ఞను తలదాల్చి భావనాముని పుత్రులు స్వగృహమున కేగిరి. పిదప తండ్రివలన ఈశ్వర దత్తమగు విద్యనంది శుభములతోఁ బ్రకాశించిరి.

శ్లో॥ తతోవృతః సద్గుణశాలిభిస్సుతైః ।
ప్రమోదమానః పరమం ప్రకృష్టధీః ।
స్థితోవితన్వన్ గమనాగతే స్వయం ।
సదా శివాశంకర సన్నిధిం మునిః ॥ ౧౫౬

తా. అనంతరము భావనాముని సత్పుత్రులతో గూడి సంతోషించుచు, సదా పార్వతీపరమేశ్వరుల సన్నిధి కేగు చుండెను.

ఇతి వ్యాసప్రోక్తే, మార్కండేయ పురాణాంతర్గతే
భావనాఋషిమాహాత్మ్యే
భద్రావతీభావనామున్యోః పాణిగ్రహణం,
మార్కండేయానాం జననం, షష్ఠోఽధ్యాయః

—()—

# భావనాఋషి మాహాత్మ్యమ్

## సప్తమోఽధ్యాయః

ఋషయఊచుః —

శ్లో॥ విచిత్రం యత్కథా ఖ్యాతా భవతా రోమహర్షణే।
తత్కథాశ్రోతు కామానామస్మాకం వదవిస్తరాత్॥ ౧

తా. అప్పుడు మును లిట్లనిరి. ఓ సూతా! ఆకథ మిక్కిలి విచిత్రమైనది. మఱల విన నిచ్ఛగల మాకు సవిస్తరముగా నెఱిగింపుము.

శ్రీసూతః

శ్లో॥ అతఃపరం ప్రవక్ష్యామి శ్రృణుధ్వం సావధానతః।
భావనాముని మాహాత్మ్య మతిచిత్రమతః పరమ్॥ ౨

తా. సూతుఁడు-ఇకముందు భావనాముని చరిత్రము మిక్కిలి విచిత్రముగా నుండును. నేను చెప్పబోవుచున్నాను. సావధానముగా వినుడు.

శ్లో॥ ఆసీద్విశాలానగరే శంబరాసుర గోత్రజః।
శాళువా సైనికోనామ దుర్జయస్సురాసురైః॥ 3

తా. విశాలానగరమునందు శాళువా సైనికుడను శంబరాసురగోత్రోద్భవుడు గలడు. వాఁడు సురాసురులకు దుర్జేయుఁడై యుండెను.

శ్లో॥ అభూవన్ రాక్షసస్యాస్య భాగినేయా స్తథా విధాః।
అంధకస్తారకశ్చైవ సింధురో౽జిహ్వ ఏవచ । ౪
భాస్కరాసుర ఇత్యేతే పంచ పంచాస్య విక్రమాః।
పంచైతే జాతు చిత్కాలే గర్వితా బలసంపదా॥ ౫

తా. ఈ రాక్షసునకు సింహమువంటి పరాక్రమము గలవారు ఐదుగురు, అంధకుడు, తారకుడు, సింధురుడు, అజిహ్వుడు, భాస్కరుడు అనువారు మేనల్లుండ్రుండిరి. వారు బలసంపదచేత గర్వించిరి.

శ్లో॥ చరిత్వా సర్వలోకేషు ప్రాప్తా మాతుల సన్నిధిం।
ఊచుశ్చానర్థకం వాక్య మసూయానోపరూపితాః॥ ౬

తా. ఈ యేవురు రాక్షసు లంతటను సంచరించి మేనమామయొద్ద కేగి యొక నిరర్థక వాక్యమును పలికిరి.

శ్లో॥ శ్రుణుమాతుల సర్వేషాం రాక్షసానాం మహేశ్వర ।
పరిధాయచవాసాంసి సురా వై భావనామునేః । ౭
విచిత్రాణి చ దివ్యాని విరాజంత్యే౽ఖిలాన్యపి ।
విశ్రుతశ్చపుమాన్ లోకే నాస్తినస్సదృశః పుమాన్ ॥౮

తా. సమస్తమైన రాక్షసులకు ప్రభువగు నో మేన మామా! మేము చెప్పునది శ్రద్ధగా వినవలసినది. దేవతలు భావనామునిచేత తయారుచేయబడిన వస్త్రములను కట్టుకొని ప్రకాశించుచున్నారు. అవి చిత్రవర్ణముగలవై ప్రకాశించు చున్నవి. లోకమున మాతో సమానమైన పురుషుడు లేడు,

శ్లో॥ అస్మాకం న సావిద్యా తాదృశీ రోచితా ప్రభో ।
అతో౽స్తి తే ప్రేమయా త్వం సమీపస్య కారం విభో॥
తత్ర సర్వే మరాస్సంతి తద్వాసాంసి నిమేషతః ।
దర్శయిత్వా యిష్యామో యది తేనోచ తేమనః ౧౦

తా. ఓ దేవేంద్రా! మనకు శాంభవి యను విద్య లేదు. నీకు నిష్టమున్న యెడల నీవు మమ్ము నీశ్వరసాన్నిధ్యమున కంపుము. అచ్చట ననేక దేవతలు గలరు. వారల వస్త్రముల నిమేషమాత్రమున దెచ్చెదము.

శ్లో॥ ఇత్యుక్తః కాళీవాసేనః ప్రత్యువాచా సురాన్ప్రతి ।
యూయమస్మిన్ మహాకార్యే ప్రవృత్తాస్సాహసే కథమ్ ॥ ౧౧

తా. కాళీవాసుడను రాక్షసరాజు ఈ ప్రకారము మేనల్లుండ్రు చెప్పగా విన్నవాడై యీ మహాకార్యముఁ జేయ నెట్లు సాహసించిరనియెను.

శ్లో. యుష్మాకం మనుష్యమాత్ర చాంతరం విద్యతే ఖలు ।
తస్మాదహం గమిష్యామి తద్వోద్వాసంగ్రహాయవై ॥ ౧౨

తా. ఈ కార్యమునకు మీరు ప్రవేశించుట యుక్తము గాదు. మీకును నాకును చాల తారతమ్యము గలదు. కనుక నేను పోయి యా శాంభవీవిద్యను తెత్తును.

శ్లో. [illegible] సాక్ష్యేన మహాత్మా [illegible]॥
[illegible] నేయ [illegible]

తా. అందువలన మీరు గొప్ప సౌఖ్యముతో కూడిన వారలై పరిపాలన చేయుడు అని యితర రా[illegible]సులతోడను మేనల్లుండ్రతోడను పలుమారు పలికెను.

శ్లో. సంకోచయన్ తదా త్మానం మాయావీ గిరిమధ్యగాత్ ।
తత్ర దృష్ట్వా మహావీరం భావనామునిమాదరాత్ ॥ ౧౮

తా॥ అనేక మాయలుగల కాలువాసేనుడు తన శరీరమును తగ్గించుకొని కైలాసపర్వతమును చేరెను. అచ్చట ఆదరముతో మహావీరుడగు భావనామునిని చూచి,

శ్లో. విచిత్రాంబర సంవీతం చిత్రాభరణ భూషితం ।
దివ్యాంగరాగ సంయుక్తం సేవయంతం సదాశివమ్ ॥ ౧౯

తా. విచిత్రవస్త్రముల ధరించినవాడును, ఆభరణముల నలంకరించికొనినవాడును, దేహకాంతిచే ప్రకాశించువాడును, సదాశివుని సేవించువాడును,

శ్లో. షోడశైర్దినకృద్దత్తైః సేవకైరుపశోభితం ।
స్వప్రతాపాంచితైర్వీరైః శతసంఖ్యాత్మజైర్వరైః ॥ ౨౦

తా. సూర్యునిచే నొసంగబడిన పదునారుమంది సేవకులతోడను ప్రతాపముతో నొప్పుచున్న వీరులగు నూరుమంది కుమారులచే సేవింపబడుచున్నవాడును,

శ్లో. దదంతం దివ్యవాసాంసి త్రిద[illegible]ర్యా ముపాహృ[illegible] ।
విరాజంతం విద్యయా చ శాం[illegible]వ్యా శివమ[illegible] ॥ ౨౧

తా. దేవతలకు దివ్యవస్త్రములను పలుమారు ఇచ్చు చున్నవాడును, ఈశ్వరసాన్నిధ్యమున 'శాంభవి' యను విద్యచేత ప్రకాశించుచున్నవాడునైన,

శ్లో. దృష్ట్వావిస్మయ మానస్సన్ లబ్ధం మేనే స్వనిశ్చితం।
తతః కతిపయాహస్సుగతేషు స నిశాచరః। ౧౮

తా. భావనామునిని చూచి ఆశ్చర్యము నొందినవాడై తాను తలంచిన కార్యము పూర్తియైనట్లుగానే భావించెను. తరువాత కొన్ని దినములు గడుచుచుండగా, ఆ రాక్షసుడు.

శ్లో. శాంబర్యా విద్యయా గత్వా సాన్నిధ్యం భావనామునేః।
ప్రవిశ్యైవ పరోక్షేణ తస్య విద్యామపాహరత్। ౧౯

తా. కాళివాసురుడు శంబరీమాయచే భావనాముని సమ్ముఖమున కేగి, యాతనికి దెలియకయే యతనివిద్య నపహరించెను.

శ్లో. మత్వాకృతార్థ మాత్మానం సవేగః స్వపురీం యయౌ।
గత్వా ఽనీకైః పరివృతశ్చరిత్వా సర్వతోదిశమ్। ౨౦

తా. అట్లు కాళివాసురుడు వస్త్రనిర్మాణవిద్యను హరించి, తనకు తాను కృతార్థుడైనట్లుగా భావించి, తన పట్టణమునకు పోయెను. తన పట్టణమును చేరి, సేనలతో చుట్టుకొనబడినవాడై, అన్ని దిక్కులయందును తిరిగి,

శ్లో. మృణాళతంతూన్న ప్రాప్య విచింత్య చ పునః పునః ౨౧

తా. అంతట కాలువాసేను డన్నిదిక్కుల సంచ
రించి పద్మతంతువుల గానక విచారపడి,

శ్లో. తైరేవ కృత్వా వాసాంసి శనైరేవచ తంతుభిః।
రక్షోభ్యో భాగినేయేభ్యస్స్వకీయేభ్యః దదౌ తదా॥ ౨౧

తా. జపపనారచే వస్త్రముల నిర్మించినవాడై వారికి
వాని నొసగెను.

శ్లో. తస్థే శూరం మన్యమానః సర్వైరుపనిషేవితః।
తతస్సభావనావీరః కైలాసాదవరుహ్యాచ। ౨౩

తా. అప్పుడా రాక్షసేంద్రుడు తనను శూరునిగ
భావించుకొనుచు రాక్షస సమూహములచే గొలువబడు
చున్నవాడాయెను. అనంతర మా భావనాముని కైలాసము
నుండి క్రిందికి దిగి,

శ్లో. ప్రవిశ్య స్వపురీం రమ్యాం దివ్యవస్త్రచికీర్షయా।
స్వనివేశం ప్రవిశ్యైవస్రష్టుం వాసాంసి సత్వరమ్॥

తా. భావనాముని దివ్యవస్త్రములచేయు నిచ్ఛతో
సుందరమైన తన పట్టణమును చేరి, వస్త్రములను నిర్మించు
టకు తన గృహమున ప్రవేశించెను.

శ్లో. పూర్వవద్విద్యయా మేనే స్వకీయైస్సహ భావనః।
పూర్వవత్క్రియమాణం తన్నాభూత్తస్యతదాంబరమ్

తా. భావనాముని మునుపటివలె తన వారితోగూడ
వస్త్రమును నిర్మింపబోగా నది సాధ్యము కాలేదు.

శ్లో॥ తతోఽభవత్తస్యచిత్తే కిమేతదితి విహ్వలః।
ఇతి కర్తవ్యతామూఢః నిర్వేదమగమత్పునః॥ ౨౮

తా. అట్లు తాను ప్రయత్నింపగా వస్త్రములు గానం దున విక్కలి విషాదము నొందినవాఁడాయెను.

శ్లో. బ్రహ్మవిష్ణు మహేశాశ్చ మనోజిజ్ఞాసయా మమ।
అన్యేతస్మిన్ తథాకింవా సురాన్వాకిం బ్రవీమ్యహమ్॥

తా. త్రిమూర్తులు నామనం బెరుగగోరి యేమి చేసిరో, ఇంద్రాది దేవతలతో నేమని మనవిచేయుదును.

శ్లో॥ విచింత్యైవ చిరంవీరః ప్రతీచ్యాలోకయన్ దృశా।
అవగమ్య తతో దార్ష్ట్యం కాళువాసైనికం మహాత్॥

తా. దీనికి కారణ మేమని చింతించి, జ్ఞానదృష్టిచే నంతయు తెలిసికొనియెను. తరువాత

శ్లో॥ గత్వాసపుత్రస్సబలో విశాలాం ప్రావిశన్మునిః।
ఆగతం భావనాపీరం శ్రుత్వాఽమన్యత రాక్షసః॥ ౨౯

తా. అప్పు డాముని తన పుత్రులతోడను, సైన్యము తోడను నా రాక్షసుని పత్తనమగు విశాలానగరమును జేరెను. వాఁడా మునిరాకను తెలిసికొని యిట్లు తలచెను.

శ్లో॥ ఇంద్రాదయశ్చ దిక్పాలాః తదా బ్రహ్మాదయః సురాః।
మత్పురం నేక్షితుం శక్తాః కథం మాని రిహాగతః॥ ౩౦

తా. ఇంద్రాది దిక్పాలురు, బ్రహ్మాది త్రిమూర్తులు నా పురమును జూడజాలరు. ఈ భావనాముని యెట్లు వచ్చెను!

శ్లో. శౌర్యం నజ్ఞాతవాన్ పూర్వం తస్మాన్మునిరిహాగతః ।
శౌర్యం మే జ్ఞానినోమర్త్యాః స్పర్ధాంకర్తుం న చాశకన్ ॥

తా. నా ప్రతాప మెట్టిదియో యీముని యెఱుగడు. నాశౌర్యము తెలిసిన మానవులు నాతో స్పర్థ వహించుటకు శక్తులు గారు.

శ్లో॥ ఇదానీ మేషవై వీరః కోవా జ్ఞాస్యామి సంయుగే ।
ఇత్యేవం మనసాలోచ్యవాదయామాస దుందుభీన్. ౩౨

తా. అప్పుడా కాళివాసురుడు యుద్ధరంగమున భావనావీరుని శౌర్యమును తెలిసికొన నెంచి, రణభేరి మ్రోగించెను.

శ్లో॥ సేనాం పర్యాప్య సహసా నిర్యయౌ నగరాత్స్వయం ।
పంచభిర్భాగినేయైశ్చమహాబల సమన్వితైః ॥ ౩౩

తా. మహాబలయుతులగు తన మేనల్లుండ్రతో గూడి సేనలను సిద్ధపఱచుకొని బయలుదేరెను.

శ్లో॥ రాక్షసై శ్చాత్మసదృశైరనే కైరుపసేవితః ।
ధనుర్బాణైః సమాయుక్తః ఖడ్గఖేటక సంయుతః॥ ౩౪

తా. తనతో సమానులైన అనేక రాక్షసులచే సేవింపఁబడుచున్న రాక్షసేంద్రుడు ధనుర్బాణాదులతో గూడినవాడై,

శ్లో॥ కాద్యశైః ష్వపులోగైశ్చ పృష్ఠ గైశ్చ సమావృతః ।
పరిఘైః పట్టిసైః ఖడ్గైః ముసలై స్సహూలోమరైః॥ ౩౫

ఖండివాలై స్త్రిశూలైశ్చ గదాతోమరశక్తిభిః
పరశ్వక్షైశ్చ ప్రాసాద్యైశ్చక్రై రిష్టిభిరేవచ ।
అంకుశాద్యైశ్చ సంయుక్తః సర్వరాక్షస [illegible] ।
ఏకద్విత్రి చతుః పంచముఖైర్దశ ముఖైర్యుతః ॥ 32

తా. తనతో సమానులగు బంధువులతోడను సమస్తాయుధములతోడను, సమస్త రాక్షసవీరులతో గూడినవాడై,

శ్లో. లంబజిహ్వై ర్మహాజిహ్వైః బహుజిహ్వైర్విరాజితః ।
తాళాకారైర్గజాకారైః పర్వతాకార శోభితః ॥ 33.

తా. వ్రేలాడు నాలుకలుగలవారిచేతను, గొప్పనాలుకలు గలవారిచేతను, పెక్కు నాలుకలు గలవారిచేతను, తాళాకారులచేతను, పర్వతాకారులచేతను, గజాకారులచేతను,

శ్లో. సూక్ష్మాస్యైర్విశాలాస్యైశ్చగజాస్యైర్వ్యాఘ్రతుండకైః ।
దంష్ట్రానఖాయుధైశ్చైవ మదోన్మత్తైర్మహాసురైః ॥ 34.

తా. సూక్ష్మముఖములుగల, విశాలముఖములుగల, ఏనుగుముఖములుగల, బెబ్బులివంటి ముఖములుగల, కోరలు నఖములు ఆయుధములుగాగల, మదోన్మత్తులగు గొప్ప రాక్షసులచేతను,

శ్లో. [illegible] సంయుక్తం స్వర్ణస్తంభ విరాజితం ।
రత్నాంబ [illegible] కల్పితం [illegible] ॥ 35

శ్లో. కర్ణాంతం చ సమాకృష్య ముక్తవాన్ సధనుర్గుణం।
తదా బభ్రామ ధరణీ సశైలవనకాననా॥ ౨౫

తా. ఆరీతి వింటినారిని నాకర్ణాంతములాగి వదలగా కొండలు వనములు నరణ్యములుగల భూమి వణకెను.

శ్లో. నిపేతుశ్చ దివస్తారా స్సాగరా స్సప్తపంకిలాః।
సూర్యచంద్రమసౌ చైవ మండలే విషమంగతే॥ ౨౬

తా. అప్పుడాకసమునుండి నక్షత్రములు రాలెను. సప్తసముద్రములు కలతబడి బురదలైనవి. సూర్యచంద్రులు గతితప్పిరి.

శ్లో. శ్రుత్వా తం కాళువాసేనః చకార స్వధనుర్గుణం।
కారయామాస దైతేయాన్ యుద్ధాయ చ ధనుర్గుణాన్॥

తా. కాళువాసురుడా భావనామునిచేత భీకరంబైన గుణటంకారమును విని గుణధ్వని జేసెను. రక్కసులను ధనుర్గుణధ్వనులు గలవారిగా జేసెను.

శ్లో. తతో౽ర్ధచంద్రనారాచైర్మునిం విద్ధ్వాశ పంచభిః।
తానశైకేషునైవాశు చూర్ణయిత్వా విచక్షణః॥ ౨౮

తా. ఆ రాక్షసుడు ధనుస్సునందర్ధచంద్రాకారములైన బాణముల సంధించి భావనామునిని నొప్పించెను. భావనామునియును వాని నొక్కొక్క యమ్ముచే చూర్ణము చేసెను.

శ్లో. తేనైవ రాక్షసేశస్య లలాటం విద్ధ్య దేవపునః।
స తేన పవమానుద్ధశ్చలత్సాన్ద్రసుసంభ్రమైః॥ ౨౯

తా. ఇట్లు భావనాముని యా రాక్షసుని బాణముల నన్నిటి నొక్క యమ్ముచే చూర్ణముచేసి వాని నొక్క యమ్మున నొప్పించెను. వాడు క్రుద్ధుడై,

శ్లో. వివ్యాధ నిశితైర్బాణై స్సతాన ప్యాశ్వఖండయత్ ।
తతో వవర్ష దైతేయశ్శరవృష్టిం తథామునిమ్ ॥ ౫౦

తా. అట్లు పెక్కు సంఖ్యలుగల బాణవృష్టిచే నా భావనామునిని నొప్పింపగా, నన్నింటి నతడు ఖండించి వానిపై బాణవర్షమును కురియించెను.

శ్లో. సచైకేనైవ బాణేన తత్కిరీటం చ తద్గుణం।
సారథిం హయసాహస్రమభిన త్కర లాఘవాత్ ॥ ౫౧

తా. భావనామునియు బాణములు ప్రయోగించి యొక్క బాణముచే వాని కిరీటమును సారథిని యల్లెత్రాటిని వేయి గుఱ్ఱములను నేలపాలు జేసెను.

శ్లో. తం దృష్ట్వా దివిజాస్సర్వే స శబ్దమహార్షన్ దివి
తతఃపర మతి క్రుద్ధో భ్రుకటీకుటిలేక్షణః । ౫౨

తా. ఇట్లు కాళివాసురుని విచ్ఛిన్నముచేయు భావనామునిని గాంచి, దేవతలు మిక్కిలి హర్షించిరి. తరువాత నా రాక్షసుడు మిక్కిలి క్రుద్ధుడై,

శ్లో. ప్రోవాచ భావనావీరం దంతాన్ కటకటాప్యచ ।
క్షణం తిష్ఠ మహావీర ! ప్రేష్యామి త్వాం యమాంతికమ్ ॥

తా. ఇట్లు కోపించినవాడై భావనామునిని జూచి యోవీర ! క్షణమాగుము. నిన్నిదె యమునికడ కంపుదును.

శ్లో. నజానాసి హి మేవీర్యం బ్రహ్మాద్యైరపి దుర్జయం ।
సచేలామవనీం చాపి గగనంచ నవగ్రహమ్॥ ౫౪

తా. బ్రహ్మ మొదలైన దేవతలచేత జయింపరాని నా ప్రతాపమును నీవు ఎఱుగవు. సముద్రములను వస్త్రములుగా గలిగిన భూమిని, శుక్రాది నవగ్రహములను, ఆకాశమును,

శ్లో. విలంఘ్య తేన భింద్యామి మృత్యుం హన్యామ్యహం ధ్రువం ।
ఇత్యుక్తో మునిరూచేదం వదంతం గర్వితం వచః ॥ ౫౫

తా. రాక్షసుడు భూమ్యాకాశములను లంఘింపగలననియు లోకాలోకముల భేదింపగలననియు జెప్పగా భావనాముని ఈ గర్వపుమాటలు విన్నవాడై యా రాక్షసునితో నిట్లనియెను.

శ్లో. శూరో౽సి యది యుధ్యస్వ కింవచోభిర్నిరర్థకైః ।
ఏవ ముక్త్వా మహావీరశ్చంద్రార్థ కృతసాయకైః॥ ౫౬

తా. అప్పుడు భావనాముని రాక్షసుని జూచి నీవు శూరుడవైనయెడల యుద్ధ మొనర్పుము. వ్యర్థమైన మాటలచే నేమి ప్రయోజనమని బాణమును వింట సంధించెను.

శ్లో. రథంచతురగాంశ్చైవ సారథీం శ్చాప్యఖండయత్ ।
తతో౽న్యం రథమాస్థాయ దైత్యః పరమకోపనః॥ ౫౭

తా. అట్టి యర్ధచంద్ర బాణములచేత రథమును, గుఱ్ఱములను, సారథులను ఖండించెను. తరువాత నా రాక్షసుడు మరియొక రథము నెక్కెను.

శ్లో. యోజయామాస సశరాన్మునిరప్యతి దుష్టధీః ।
నాగాస్త్రంగారుడాస్త్రేణ, వాయవ్యేన చవారుణమ్॥ ౫౮

తా. దైత్యు డట్లు కోపించినవాడై బాణముల ప్రయోగించెను. భావనామునియు గారుడముచే నాగాస్త్రమును, వాయవ్యాస్త్రముచే వారుణాస్త్రమును నివారించెను.

శ్లో. ఐంద్రేణ రాక్షసం చైవ వారుణేన చపావకం ।
బ్రాహ్మ్యం పాశుపతాస్త్రేణ సర్వానేవమఖండయత్ ॥

తా. ఇంద్రాస్త్రముచే రాక్షసమును, వారుణంబున నాగ్నేయంబును, పాశుపతంబున బ్రహ్మాస్త్రమును నీలాగు నన్నింటిని నశింపజేసెను.

శ్లో. తతో మునిసుతాశ్చాపి దృష్ట్వా తం రాక్షసాంబుధిం ।
వివశాః పరమక్రుద్ధాస్తే సర్వే పితురాజ్ఞయా ॥ ౬౦

తా. అనంతర మా ముని కుమారులు సముద్రము వలె విస్తరించి యుండు రాక్షససైన్యమునుజూచి పరవశులై తండ్రి యనుమతిచే,

శ్లో॥ దనుజం దనుజేనైవ తురంగం తురగేనచ ।
. కరిణం కరిణాచైవ కరవాలేన ఖడ్గినమ్ ॥ ౬౧

తా. రాక్షసుని రాక్షసునితోను, గుఱ్ఱమును గుఱ్ఱముతోను, ఏనుగును ఏనుగుచేతను, ఖడ్గాయుధుని కరవాలముచేతను,

శ్లో. ప్రాసేన ప్రాసహస్తంచ గదయాచ గదాధరం ।
రథం రథేన రథికం రథికేన తథాశ్వినమ్ ॥ ౬౨

తా. ప్రాసహస్తుని ప్రాసముచేతను, గదచే గదా ధరుని, రథముచే రథమును, రథికునిచే రథికుని చంపిరి.

శ్లో॥ ధనుషాచైవ ధానుష్కం పదగం పదగేచన ।
సంబృంహితేషు కరిషు హేషాశబ్దేషు వాజిషు ॥ ౬౩

తా. ధనుర్ధారిని ధనుస్సుతోను, పదాతిని పదాతితోడను, సంహరించి ఏనుగులు గర్జించుచు, గుఱ్ఱములు సకిలించుచుండగా,

శ్లో॥ వాద్యమానేషు వాద్యేషు సశబ్దై స్సైనికైరపి ।
భిద్యమానేషు దేహేషు త్రుటితేషు కరేషుచ ॥ ౬౪

తా. గొప్ప ధ్వనులతో గూడిన సైనికులచేత వాద్యములు వాయింపబడుచుండగా, శరీరములు చీల్చివేయబడుచుండగా, హస్తములు తుంటలగుచుండగా,

శ్లో॥ ఖండ్యమానేషు పాదేషు కర్ణేష్వపి గళేషుచ ।
శిరస్సు స్ఫుట్యమానేషు దావత్స్వశ్వగణాదిషు ॥ ౬౫

తా. కాళ్లు చెవులు కంఠములు నఱకబడినవగుచుండగా, తలలు బ్రద్దలు చేయబడుచుండగా గుఱ్ఱములు పరుగెత్తుచుండగా —

శ్లో॥ పతత్స్వరక్షో దేహేషు కబంధేషూత్పతత్సుచ ।
ప్రవహంతిష్వసృక్పూరనదీషు సకరోటిషు ॥ ౬౬

తా. రాక్షసదేహములు భూమిపై బడుచుండగా, మొండెములు భూమిపై వ్రాలుచుండగా, పుఱ్ఱెలతో గూడి

నవియును, నెత్తుటిలో నిండినవియు నగు నదులు ప్రవ హించుచుండగా,

శ్లో॥ తదా హసంతో భూతాశ్చ గర్జితాః శాకినీముఖాః ।
చరంతః సర్వతో యుద్ధే గృధ్రాద్యాపక్షిణోఽదనాః ॥

తా. అప్పుడు సమస్త భూతములు సంతసించినవి. శాకినీ, ఢాకిని ప్రేత భేతాళములు, పిశాచములు, కాక ఘూక గృధ్రాది పక్షి విశేషంబులు నంతటను సంచ రించినవి.

శ్లో॥ రక్షసా హతశేషాశ్చ రేజుర్భ్యాసహతాయుధాః ।
తే భావనాముని సుతాః కలభా ఇవ పద్మినీమ్ ॥ ౬౮

తా. చావగా మిగిలిన రాక్షసులు భూమియందు బడి నిరాయుధులై ప్రకాశించిరి. భావనాముని పుత్రులు కమలా కరంబును గలచు నేనుగుగున్నల తెఱగున ప్రకాశించిరి.

శ్లో॥ గజానివ మహాసింహాః నిజఘ్నుస్తస్య వాహినీం ।
మమంథుస్సత్వరం జన్యం క్షీరోదమివ నిర్జరాః॥ ౬౯

తా. భావనాముని కుమారులు సింహము గజము లను హింసించు చందమునను, రాక్షసులు క్షీరసముద్రమును మథించు తెఱగునను, యుద్ధమున నయ్యాసుర వాహినిని మథించిరి.

శ్లో॥ తత్తైన్యాస్తు మహావీరాః ప్రాణలోభాత్పలాయితాః ।
ఏవంగతేషు సైన్యేషు రాక్షసాధిపతిస్తదా ॥ ౭౦

తా. గొప్ప వీరులును జగజ్జెట్టులునగు రాక్షససైన్యములు ప్రాణలోభముచే పారిపోవుచుండగా కాళువాసేనుడు

శ్లో॥ తాన్ దృష్ట్వా పరమక్రుద్ధో ఊచేదం వచనం తదా।
ప్రాణలోభేన గచ్ఛంతాం తేషాం హి నరకం ధ్రువమ్॥

తా. అపుడు పరుగులిడు సైన్యమును జూచి ప్రాణలోభమున దొలగు వారికి నరకము తప్పదనియెను.

శ్లో॥ సర్వే ప్రాంజలయః స్థిత్వా ఊచతుః ప్రగతజానుకం।
రాక్షసాధీశ సర్వజ్ఞ నగతాః ప్రాణలోభతః ॥ ౭౨

తా. హతశేషసైన్యము లాకాళువాసేనుని మాటవిని నిలువబడి యంజలి బద్ధులై యిట్లనిరి. సర్వజ్ఞుడవగు నో దనుజేంద్రా! మేము ప్రాణభీతిచే వెన్నిచ్చి పోవువారము గాము.

శ్లో॥ భావనాముని పుత్రాణాం చిత్తం శోధయితుం మనః।
ప్రవృత్తంతు మహారాజ! క్షమ్యతాం యది కిల్బిషమ్॥

తా. భావనాముని పుత్రుల మనం బెరుగుటకు నిత్తెఅంగున నొనర్చితిమి. తప్పెని క్షమింపబడుగాక.

శ్లో॥ తతోఽతితుములం ఘోరం మహాయుద్ధం జగద్భయం।
భావనాకాళువాసేనౌ యుద్ధ్యేతాం కరిణావివ ॥ ౭౪

తా. అప్పుడు భావనాకాళువాసేనులు ఏనుగులవలె జగద్భయంకరమైన యుద్ధ మొనర్చిరి.

శ్లో॥ భగ్నా పరస్పరం శస్త్రైస్తాడ్యమానౌ ముహుర్ముహుః।
రేజతుః పుష్పకాలేతు శాల్మలీకింశుకావివ॥ ౭౫.

తా. భావనా కాళువా సైనికులు పరస్పరము బాణ ములచే గొట్టుకొని పుష్పకాలము నందు పూచిన మోదుగు బూరుగు చెట్లవలె ప్రకాశించిరి.

శ్లో॥ ధాతునిర్ఝర ధారాభిః సంపన్నా వివభూధరౌ ।
విజయోపజయోపేతౌ నరనారాయణావివ ॥ ౭౬

తా. గైరికాది ధాతువులచేతను, ఉదకధారలతోను, కూడిన పర్వతములవలె నరనారాయణులవలెను ప్రకా శించిరి.

శ్లో॥ తదాచ భావనావీరశ్చంద్రార్ధ కృతశేఖరైః ।
పృషత్కైశ్ఛేద్యమానం యత్తచ్ఛిరో న్యపతద్భువి॥ ౭౭

తా. అప్పుడా భావనాముని యర్ధచంద్రాకారబాణ ములచేత నతనిశిరము ఖండింపబడి, భూమిపై బడెను.

శ్లో॥ తదా చచాల ధరణీ వివేపుశ్చ దివౌకసః ।
తాదృశే నిహతే తస్మిన్ సమభూ దపరం శిరః॥ ౭౮

తా. ఆరాక్షసుని శిరము భూమిమీద బడగానే భూమి చలించెను. దేవతలు వడకిరి. అట్లు చంపబడగా వాని గళమున నొక్కశిరము మొలచెను.

శ్లో॥ విభూతి పుండ్రసంయుక్తం స కిరీటం స కుండలం ।
శ్మశ్రులంబముదంష్ట్రం చ భ్రుకుటీకుటిలేక్షణం ॥ ౭౯

తా. అట్లు రాక్షసేంద్రుని కంఠమునందు బుట్టిన వాడును, విభూతి పుండ్రములు గలవాడును, కిరీటము గల

వాడును, కోఁగులు గలవాడును, శ్రేలాడు మీసములు గల వాడును, నిలువుకోఁఅలు గలవాడును, కుటిలములగు కను బొమలయొక్క చూపులు గలవాడును,

శ్లో. దంతాన్ కటకటాయంతం సరోషం సర్వభీతిగం ।
తచ్ఛిరో ఖండయత్తూర్ణం భావనాముని రోజసా ॥ ౮౦

తా. దంతముల పటపట కొఱుకువాడును, రోషముతోఁ గూడినవాడును, సకలమైన దేవతలకును, మునులకును, మనుజేశులకును భయమును గలుగజేయువాడును నగు నా రాక్షసుని శిరమును భావనాముని ప్రతాపముతో నఱకెను.

శ్లో. తతో౽జని శిరశ్చైకం తాదృశం తస్య రక్షసః ।
తచ్చాప్యఖండ యత్తూర్ణం భావనాముని రంహసా ॥ ౮౧

తా. తరువాత ఒక శిరస్సు కలిగెను. భావనాముని శీఘ్రముగా ఆశిరస్సును నఱకెను.

శ్లో. శిరాంసి చతురశ్శీఘ్రం దనుజస్యాచ్ఛినత్త్వథా ।
రథంచ రథవంతం చ సారథీన్ చక్రరక్షకాన్ ॥ ౮౨

తా. శాఖవాసురుని నాలుగు శిరస్సులను భావనా ఋషి ఛేదించెను. తదుపరి రథమును, రథికుని, సారథులను, రక్షకులను ఛేదించెను.

శ్లో. [illegible] హత్త్వా కేతనంచ నిమేషతః ।
చూర్ణయామాస ఝటితి భావనాముని రాత్మవాన్ ॥

తా. పరమాత్మ స్వరూపము నెఱిగిన యా భావనా మునీ ధనుర్బాణముల ధరించిన యాతని హస్తములను ఖండించి శిక్కుముక్కలను చూర్ణము చేసెను.

శ్లో. తతో జాతేన శిరసా కాళువాసైనికో బలీ।
ఉవాచ భావనావీరం నిర్భయో నిష్ఠురం వచః॥ ౧౮

తా. మరల మొలచిన శిరముతో బలవంతుడును, నిర్భయుడునగు కాళువాసేనుడు, భావనామునిని గూర్చి యిట్లు పలికెను.

శ్లో. శూరో౽సి భావనావీర! గ్రహణే మాంగదాంమమ।
అద్యైవ హన్యమానస్త్వం గమిష్యసి యమాలయమ్॥

తా. ఓ భావనావీరా! నన్ను, నా యాయుధమును తీసికొనగలిగితివేని, నిన్నిప్పుడే యమాలయమున కంపెదను.

శ్లో. ఇత్యుక్త్వా పరమక్రుద్ధో ముమోచా౽శని సన్నిభాం।
ఘంటా సహస్రసంయుక్తాం కాలదండ శతోపమాం।
జ్వాలాజాల సమాయుక్తాం బ్రహ్మదత్తాం మహాగదామ్॥

తా. ఇట్లు పలికి మిక్కిలి కుపితుడై, పిడుగుతో సమానమైనదియు, వేయి ఘంటలతో గూడినదియు, యముని దండమువంటి నూరు దండములతో గూడినదియు, మంటల సమూహముతో గూడినదియు, బ్రహ్మచే నీయబడినదియు నగు గదను వదలెను.

శ్లో. తాం దృష్ట్వా భావనావీరః రక్షోముక్తా మహాగదాం।
అఖండయుత్తథామధ్యే విష్యాధో౽పి-చ తం పునః॥ ౨౭

తా. ఆగదను భావనావీరుడు మధ్యముననే ఖండించెను.

శ్లో. తతః ఖడ్గం సమాదాయ దుష్టం రాక్షసపుంగవం ।
అభ్యుపేత్య మహావీరం తం మూర్ధ్ని ప్రజఘాన తం ॥ ౮౮
తేన సంవిద్ధ మూర్ధాచ భావనామునిరాట్స్వయం ।
జానుభ్యా మవనీంగత్వా సంజ్ఞ తః పునరోజసా ।
రమాదత్త సుధాస్వాద మహిమ్నా పునరుత్థితః ॥ ౮౯

తా. మఱియు నా భావనాముని ఖడ్గము గైకొని మిక్కిలి పాపుడును, బలిష్ఠుడునగు నారక్కసు నెదుర్కొని శిరంబున మోదెను. మరల వానిచే గొట్టబడినవాడై యా ముని మూర్ఛనొంది లక్ష్మీదేవి యొసగిన యమృత మహిమచే లేచినవాడాయెను.

శ్లో. అసినా హన్యమానోఽపి సజీవ ఇవ రోషితః ।
తతో దైతేయ నాథోఽపి స్వయ మప్యన్వతప్యత ।
శాంబర్యాఽత్మ సమాన్ దైత్యానసంఖ్యేయాన్ తదాఽసృజత్ ॥ ౯౦

తా. ఆ రాక్షసుడు కత్తిచే నరకబడియు, ప్రాణము వీడక మిక్కిలి కోపించి కొంతతడవు చింతించి, శాంబరీ మాయచే తనవంటివారి ననేకులను సృష్టించెను.

శ్లో. ఆత్మానం దుష్టబలం మత్వా స్మృత్వా స్మృత్వా చ తద్బలం ।
శివోవా పరమేష్ఠీవా హరిర్వా నైవ శక్నుయాత్ ॥ ౯౧

మాంమజేయం విజేత్యేషస్త్రి మూర్త్యాత్మక ఏవసః।
ఇతిసంచిత్యభూయో౽పి ప్రోవాచ స మునిం పునః॥ ౬౨

తా. అంత నా రాక్షసుడు తనను దుర్బలుగా నెంచి యా భావనాముని మహాబలంబును దెలిసికొని త్రిమూర్తులైనను నన్ను జయింపజాలరు. ఎట్టివారలకు నజేయుఁడనైన నన్నీముని జయించెను. ఇతడు త్రిమూర్త్యాత్మకుడు కాబోలును. కాకున్న నెట్లు జయించునని మనంబున నెంచి, యమ్మునిని కిట్లనియె.

శ్లో. కాళువాసైనికం జేతుం త్వం త్రిమూర్త్యాత్మకః ప్రభుః।
నచేద్భేత్స్యతి లోకేషు కోవా శీర్షాణి మే పరమ్॥ ౬౩

తా. ఓ మునీంద్రా! నన్ను జయింప నెంచి త్రిమూర్తి స్వరూపుడవై సకలాధిపతివై నీవరుదెంచితివి. అట్లు గాకున్న సమస్త లోకంబుల నాశిరంబుల నెవ్వఁడు ఖండింప నోపును?

శ్లో. మన్వంతరేషు చతృషు ఏకైకంశిర ఆదరాత్।
హుత్వాగ్నౌ బ్రహ్మణః ప్రీత్యై సమర్త్యైవశిరాంసిచ।
తావ్యహం ప్రాప్తవాన్వీర! చత్వార్యపి శిరాంస్యథ॥ ౬౪

తా. ఓ భావనామునీ! నేను నాలుగు మన్వంతర కాలంబుల నా శిరంబుల నొక్కొక్కటి యగ్నిలో హోమంబుగావించి యా బ్రహ్మవరంబున మరల నా నలుమొగంబుల నొందితిని.

శ్లో. తాని శీర్షాణి సర్వాణి త్వయా భిన్నాని విక్రమైః।
విద్యతేఽత్రాధునావీర దుర్ధర్షం పంచమం శిరః॥ ౬౫

తా. ఓ భావనాముని! అట్టి నాశిరంబుల నీవు విక్రమంబున ఖండించితివి. అట్లయినను యిప్పుడు జయింప నలవి గాని పంచమశిరం బున్నది.

శ్లో॥ మాదృశారాక్షసాశ్చైవ విద్యంతే హిపరశ్శతం ।
గచ్ఛప్రాణైరితః శీఘ్రం యదిచ్ఛేత్తేజిజీవిషా ॥ ౯౬

తా. ఓ భావనాముని! మఱియు నావంటి రాక్షసులనేకులు గలరు. ప్రాణంబులతో నుండగోరితివేని మఱలి పొమ్ము.

శ్లో॥ శ్రుత్వైవం గర్వితం వాక్యం రాక్షసస్యమునిస్స్వయం॥
అసంఖ్యేయం చ తత్సైన్యం దృష్ట్వా చింతాపరోఽభవత్ ॥ ౯౭

తా. భావనాముని యిట్లు గర్వించి పలికిన యామాటను విని వాని సైన్యమును గాంచి మిక్కిలి చింతించెను.

శ్లో॥ కథమేనం విజేష్యామి రక్షోఽధిపతిమద్యవై ।
రథాగజాహయాశ్చైవ పదాతయ హతా మయా ।
ప్రభవంతి పునస్సర్వే తాదృశారాక్షసాః పరం॥ ౯౮
భిన్నాన్యపిచ శీర్షాణి చత్వారి చ దురాత్మనః ।
తాన్యప్యుద్భవంతి క్షిప్రం కిం కరోమి ప్రతిక్రియా॥ ౯౯

తా. ఈ కాళువాసైనికు నిపు డెట్లు జయింపగలను? ఇతని రథములు, ఏనుగులు, పదాతులు, అశ్వములు, రాక్షసులు నాచే జయింపబడియు, మరల నుత్పత్తి యగుచున్నారు, ఈ దుర్మార్గుని తలలు నాచే ఖండింపబడియు,

తెలుచుచున్నవి. దీనికేమి ప్రతిక్రియ చేయుదునని చింతించెను.

శ్లో॥ ఇతి సంచిత్య మనసా ప్రోవాచ మునిపుంగవః ।
శృణుష్వ రాక్షసాధీశ ! నాహం దేవో నచాసురః॥ ౧౦౦
బాలేందుమౌళేర్దాసోఽహం విశేషేణ హరేః స్వయం ।
బ్రహ్మణః సర్వదేవానాం ప్రీతిపాత్రం హి మాం విదుః॥

తా॥ భావనాముని యిట్లాలోచించి, "ఓ రాక్షసేశ్వరా ! నేను దేవుడనుగాను. రాక్షసుడనుగాను. శంకర భక్తుడను. బ్రహ్మ విష్ణువులకు ప్రీతిపాత్రుడను" అని యీ రీతిగా వానితో ననెను.

శ్లో॥ భ్రాన్త్యా భయేన మామేవ మావమంస్థా నిశాచర ।
మృకండుసుతయాగాగ్నౌ జనితో భవనాముని: ౧౦౨

తా. ఓ రాక్షసుడా! భ్రాంతిని భయంబునను నన్నట్లు తలపకుము. మార్కండేయుని యాగకుండంబున బుట్టినవాడను, భావనాముని యనబరంగుదును.

శ్లో॥ ప్రతార్య విద్యాం గృహ్ణీషే మామకీం రాక్షసాధమ ।
అతస్త్వాం నహి జీవన్తం ముంచామి క్వగతోఽపివా ।

తా. ఓ రాక్షసాధమా! నా సంబంధమైన విద్యను మోసముతో నెత్తుకొనిపోతివి. అందువలన నీవెచటి కేగినను ప్రాణముతో విడువను.

శ్లో॥ ఏవం బ్రువతి వీరేఽస్మిన్ జగామాస్తాచలం రవిః।
క్రోధాగ్నిజ్వాలికేవాస్య బభౌ సంధ్యారుణచ్ఛవిః ॥

తా. ఇట్లు భావనాముని చెప్పుచుండగా సూర్యాస్త మయ మాయెను. సంధ్యాకాల మరుణంబై ప్రకాశించెను.

శ్లో॥ పుష్పాణి దివ్యాన్యాసీయద్దైవ తైరభివర్షితుం ।
వీరస్య విజయే సర్వైర్నక్షత్రాణి చకాశిరే ॥ ౧౦౫

తా. దేవతలు భావనాముని జయమునకు మెచ్చి దివ్యములైన పుష్పంబుల వర్షించిరో యన నక్షత్రంబులు వెలిగెను.

శ్లో॥ తతః సదైత్యో మాయావీ బలం నిర్మాతు మభ్యగాత్ ।
దిశో ధవళయన్ సోమ శ్చకోరానభినందయన్ ।
నందయన్ కుముదాన్యాశు జజృంభే పూర్వభూధరే॥

తా. పిమ్మట మాయావియైన రక్కసుడు తన మాయచే రాక్షసబలంబుల బుట్టింప నారంభించెను. అంతే చంద్రుడు తన ధవళకిరణంబుల దిశల వెలిగించుచు చకోరా నందకారియై కుముదవనంబుల వికసింపజేయుచు ప్రకాశించెను.

శ్లో॥ భావనామునిరాలోక్య త్ర్యంబకాచ్చ జయాయచ ।
దివ్యాయు ధాన్యాది దిత్సుర్యయౌ దైత్య జిగీషయా ।

తా. భావనాముని రాక్షసుని జయించవలెనను కోరికతో ఈశ్వరునివలన ఆయుధములను పొందుటకు వెళ్ళెను.

శ్లో॥ కైలాసం ప్రాప్య పుత్రైశ్చ దృష్ట్వా బాలేందుమాళినం।
ప్రణమ్య దేవదేవేశం స్తోతుం సముపచక్రమే । ౧౦౮

తా. ఆ భావనాముని నిజకుమారులతో గూడి కైలా సము జేర మహాదేవునకు నమస్కరించి స్తుతింప నారం భించెను.

శ్లో॥ నమోస్తు రుద్రాయ జగన్మయాయ।
నమోస్తు సాంబాయ సదాశివాయ।
నమో గిరీశాయ నమోహరాయ।
నమో నమో మన్మథ భంజనాయ॥ ౧౦౯

శ్లో॥ నమస్సహస్రార సమాన నేమినే।
నమస్సహస్రార్క సమానభాసినే।
నమష్షడాధార షడింద్రియాత్మనే।
నమష్షడూర్మి ప్రభవే నమోనమః॥ ౧౧౦

తా. రుద్రరూపియు, జగన్మయుడును, పార్వతీ సమేతుండును, సదాశివుడు, గిరీశుడును, మన్మధనాశకుడును, సహస్రదళ పద్మముతో సమానమగు చక్రంబును నిర్మించి విష్ణుదేవున కొసగినవాడును, వేయిసూర్యుల కాంతి గలవాడును, మూలాధారాది షట్చక్రంబు లాధారముగా గలవాడును, మనఃప్రధానాది షడింద్రియాత్మకుండును, బ్రహ్మజ్ఞానంబను సముద్రమునకు తరంగభూతములగు శమదమాది షట్తరంగములకు హేతుభూతుడునగు శంకరునకు నమస్కారము.

శ్లో॥ జయదేవ! మహాదేవ! భక్తప్రియ! జగత్పతే!
ప్రసాద్య దేవదేవేశ విజ్ఞప్తి మవధారయ॥ ౧౧౧

తా. దేవా, మహాదేవా, భక్తప్రియా, జగన్నాయకా! నాపై ననుగ్రహించి నామొర యాలింపుము.

శ్లో॥ ఇత్యుక్త్వా విరతో మౌని ర్దీనాస్య శ్శివసన్నిధౌ।
కృతాంజలిపుటః ప్రహ్వో వీక్షమాణో ముహుర్ముహుః॥ ౧౧౨

తా. ఆ భావనాముని యీలాగున జెప్పి విరమించి యీశ్వరుని మ్రోల కృతాంజలియై విన్నబోయిన మోముతో నిలిచి యుండెను.

ఇతి వ్యాసప్రోక్తే మార్కండేయాంతర్గత భావనాఋషి మాహాత్మ్యే యుద్ధాదికథనం నామ సప్తమోఽధ్యాయః।

# భావనాఋషి మాహాత్మ్యమ్

## అష్టమోఽధ్యాయః

(శ్రీ) సూతః॥

శ్లో॥ తతః ప్రసన్నో భగవాన్ భావనాముని మాదరాత్ ।
విలోక్య దయయా ప్రాహ పార్వతీవల్లభః శివః । ౧

తా. పిమ్మట పార్వతీ ప్రియుడైన పరమేశుడు ప్రసన్నుడై దయతోను, ఆదరణముతోను భావనాముని కిట్లనియెను.

శ్లో॥ కిం మునే భావనావీర! దీనో మాం దృశ్యసే కుతః ।
కుశల్యపి సపుత్ర స్త్వం కస్మా ద(గ్లా)హీదృశీ వ్యథా॥ ౨

తా. ఓ భావనామునీ! నీవేల దీనుడవై నన్ను చూచెదవు. కుమారులతో గూడి క్షేమముగనున్న నీకీ దుఃఖం బేల కలిగెను?

మునిః॥

శ్లో॥ దేవ గౌరీశ సర్వేశ దేవదానవ వందిత ।
బిభ్రత్ త్వదాజ్ఞాం మూర్ధ్నాఽహం కనకాద్రిపురీం గతః॥

తా. ఓ సాంబమూర్తీ! మీయాజ్ఞను తలదాల్చి కనకాద్రి నగరము చేరితిని.

శ్లో॥ తస్యాం కశ్చిన్మహాదేవ! కాళువాసైనికోఽసురః ।
మాయావీమాం ప్రకాశ్యైనాం విద్యాం జగ్రాహ దుష్టధీః ॥ ౪

తా. ఆ పట్టణమునందు మాయావియు దుష్టుడునగు కాళువాసైనికుడు నన్ను ధిక్కరించి నావిద్య నపహరించెను.

శ్లో॥ తద్విద్యా యాహమగమం పురీం తేనయుయుత్సునా ।
బ్రహ్మాద్యైరపి దేవైర్వాహతోఽపి సవినశ్యతి ॥ ౫

తా. తర్వాత నేనా విద్యకొరకు యుద్ధముచేయు నిచ్ఛతో నాపురి కేగితిని. వాడు బ్రహ్మాది దేవతలచేత జంపబడియు నాశన మొందడు,

శ్లో॥ తస్మై దత్తాని విధినా చత్వారి చశిరాం స్యపి ।
భేదయన్నపి దేవేశ ! పున రుత్పద్య తేశిరః ॥ ౬

తా. ఓ సాంబమూర్తి ! వానికి బ్రహ్మచే నాలుగు శిరంబు లియ్యబడినవి. నఱుకబడియు, మరల నాశిరంబులు మొలచుచున్నవి.

శ్లో॥ శాంబర్యా రాక్షసాధీశః సృజతేహ్యాత్మనః సమం ।
అతోఽహం తవ సాన్నిధ్య మగమం తజ్జిగీషయా॥ ౭

తా. ఆ రాక్షసేంద్రుడు శాంబరీ విద్యచే నాతో సమంబుగ సృష్టిచేయగలడు. వానిని జయింప నిచ్ఛచే నీయొద్దకు వచ్చితిని.

శ్లో॥ స దురాత్మా తవద్రోహీ భవాన్యేత్రకారణం ।
ఏవముక్తో మహాదేవో విచిన్త్యారం మునేస్తదా ॥ ౮

తా. ఆ దురాత్ముడు శివద్రోహి. ఇందులకు నీవే కారణము. ఈరీతి భావనాముని విజ్ఞాపింపగా సాంబమూర్తి చక్కగా నాలోచించి,

శ్లో దదావప్రతిమం శస్త్రం చంద్రహాసాంచితం శివః।
దుర్ధర్షం సర్వలోకేషు సేంద్రైరపి సురాసురైః॥ ౯

తా. అప్పుడు సాంబమూర్తి యింద్రాదులచేతను, దేవదానవులచేతను ప్రతిఘటింపరాని చంద్రహాసమను ఖడ్గాయుధము నొసంగెను.

శ్లో. ఉవాచ ప్రకృతం వాక్య మాదరాద్భావనాముని౦।
వీరవీరాధివీరేశ! శస్త్రేణానేన రాక్షసమ్॥ ౧౦

తా. ఆ భావనామునిని గూర్చి మిక్కిలి యాదరముతో బలికెను. ఓ భావనామునీ! యీ యాయుధముచేత,

శ్లో హత్వా జయిష్యసే త్వంతు త్వద్విద్యాద్రోహిణం ధ్రువం
గృహాణచక్రం శూలంచ సర్వరక్షో వినాశనం।
బ్రాహ్మ్యమస్త్రంచ మాహేంద్రమేతైః ఖండయ సత్వరమ్॥ ౧౧

తా. నీవిద్య నపరించినవానిని జయింపచలవు. ఇవిగో యీ చక్రాయుధమును, సకల శత్రు సంహారియగు శూలమును, ఇంద్ర బ్రహ్మాస్త్రములను తీసికొనుము. వీనిచే నో భావనావీరా! శత్రువుల సంహరింపు మనియెను.

శ్లో. సంహృత్య సమరేదైత్యం తద్బలంచైవ సంయుతి।
సంసృజ్య నాడీవాసంచ ఝడిత్యర్పయ మే మునే॥ ౧౨

తా. ఓ మునీంద్రా! ఆ రాక్షసేంద్రుని, వాని సైన్యమును సంహరించి, వారి నాడులతో వస్త్రమును సృజించి నాకిమ్ము.

శ్లో. ఇత్యుక్తో భావనావీరః ప్రణమ్య శివమంజసా।
అనుమ * ృచతస్యైవ యయౌవాదె త్యజిగీషయా॥ ౧౩

తా. ఈలాగున నీశ్వరుడు చెప్పగా, భావనాముని ఈశ్వరునకు నమస్కరించి శీఘ్రముగా నసురుని జయింప నేగెను.

శ్లో. సగచ్ఛన్ పథి వీరేంద్ర స్తదాగ్రజమలోకయత్।
తమువాచ మహావీరో వీర! పంచపుటే! శ్రుణు॥ ౧౪

తా. వీరోత్తముడగు భావనాముని దారియందు పోవు తన యన్నయగు పంచపుటిని జూచి ఓ యన్నా! పంచపుటీ! వినుమని చెప్ప నారంభించెను.

శ్లో. తవాజ్ఞయాఽహంవాసాంసి శాంభవ్యావిద్యయాసృజం।
బ్రహ్మ విష్ణు మహేశాది నిర్జరేభ్యోఽదదంపునః॥ ౧౫

తా. ఓ యన్నా! నీయాజ్ఞ ననుసరించి శాంభవీ విద్యచే వస్త్రముల సృజించి త్రిమూర్త్యాది దేవతల కొసగితిని. మఱియు

శ్లో. వ్యాఘ్రాజినం విశేషేణ శివస్య పరమాత్మనః।
తతో లబ్ధం మయా శంభోర్వ్యాఘ్ర వాహంచ భౌతికమ్॥

తా. వీరల కిచ్చిన వస్త్రములుగాక సాంబమూర్తికి వ్యాఘ్రాజినము నిచ్చితిని. ఆ శివునివలన వ్యాఘ్రవాహనము, సమస్తైశ్వర్యముల నందితిని.

శ్లో. తతస్తు దుర్దిష్టా యాంతు నగర్యామాస్థితం విభో।
తతః కదాచిద్దైతేయః కాలువాసై నిశాహ్వయః॥ ౧౬

తా. అనంతరము బహు విశాలమగు కనకాద్రిపురి యందు నేనుంటిని. ఇట్లుండగా నొకనాడు కాళువాసేనుడను రాక్షసుడు,

శ్లో. మాం ప్రతార్య చ మాయావీ మద్విద్యామాహతఃఖలుః।
తజ్జిగీషా పరో౽హం తు తేన యుధ్యన్ రణాజిరే॥ ౧౮

తా. ఇట్లు కనకాద్రిపురియందు దారాపుత్రాదులతో నింద్రభోగుండనై యుండ నొక సమయంబున మాయావియగు నా రక్కసుడు నన్ను మోసపుచ్చి నావిద్యను హరించెను. నేను వానితో యుద్ధరంగమున సంగర మొనర్చితిని.

శ్లో. బ్రహ్మదత్త వరత్వేన నమయా౽సౌ హతో ధ్రువం।
అతః ప్రాప్య మహేశానం వినివేద్య కథామిమామ్॥౧౯

తా. ఆ రాక్షసుడు బ్రహ్మవలన వరము నొందుట చేత నాచే జయింపబడనందున యీశ్వర సాన్నిధ్యమునకేగి ఈ వృత్తాంత మెఱిగించితిని.

శ్లో. తేన లబ్ధః దురాధర్షం చంద్రహాస మహం విభో।
భవానేత్య మహాజన్యం విలోకయమహామతే॥ ౨౦

తా. ఓయన్నా! ఈశ్వరుడు నాయందనుగ్రహించి సహింపరానిదగు చంద్రహాసమను నాయుధము నిచ్చెను. నాచే నొనరింపబడు గొప్పయుద్ధమును చూచుటకు రమ్ము.

శ్లో. తత్రైనవ్యం శోణితం యావద్వసుమత్యాం పతేద్యది।
తావదేవమహావీర! జాయంతే తాదృశాసురాః॥ ౨౧

తా. ఆ రాక్షసుని సైన్యముయొక్క రక్త మెంత త్వరలో భూమిపై బడునో యంత త్వరలో ననేక సేనలు కలుగుచున్నవి.

శ్లో. ఏవముక్తో మునీశేన వాక్యమూచే తదగ్రజః ।
అహంప్రాప్తుం జయంవీర తథాలోకోపకారణమ్ ॥ ౨౨

తా. ఋషివర్యుడగు భావనామునిచేత నీలాగు చెప్ప బడినవాడై, ఇట్లు పలికెను. శూరుడవగు భావనామునీ! నీతోగూడ లోకోపకారమగు జయము నందుటకై వచ్చి యున్నాను.

శ్లో. సంభూయ యోద్ధు మన్విచ్ఛన్ యాతోఽస్మితవ సన్నిధిం ।
త్వదధీనాన్ మహాక్రూరాన్ వ్యాఘ్రానాహూయ సత్వరమ్ ॥ ౨౩

తా. నీతో జేరి, వారితో యుద్ధము చేయుటకు వచ్చి తిని. నీయధీనములగు పెద్దపులులను పిలిచి,

శ్లో॥ చరంతు తే రణే రక్తస్యా సురస్యాఽభవాయచ ।
ఏవముక్తం వచశ్శ్రుత్వా జ్ఞాత్వా ప్రముము దేవిభుః ।

తా. ఆ వ్యాఘ్రములను దనుజులరక్తము పునర్జన్మ లేకుండునట్లు తిరుగ (పానముఁజేయ) నిమ్ము. అని నుడువగా భావనాముని మిక్కిలి సంతసించెను.

శ్లో. అగ్రజ! త్వత్ప్రభావేనజయం ప్రాప్తం మయాఽధునా
త్వదాశిషా జయిష్యామి రాక్షసావళదంరణే॥ ౨౪

తా. ఓ యన్నా! పంచపుటీ! నీ ప్రభావముచేత జయమును పొందితిని. నీ యాశీర్వచనముచేత నసేక రాక్షసోత్పత్తికి కారకుడగు నా రాక్షసుని జయింపబోవుచున్నాను.

శ్లో॥ యాహి త్వత్కార్య సిద్ధ్యర్థం పూజ్యోఽసి మమ సర్వదా।
ఇత్యుక్తః స హితం మత్వా జగామ స్వపథాఽగ్రజః॥

తా. ఓ యన్నా! నీవు నీ కార్యసిద్ధికొరకు నేగుము. నీ యాశీర్వచనముచే నా రక్కసుల వధించుటకై నేను పోయెదను. నీవు లోకులచేతను, నా చేతను పూజనీయుడవు కమ్ము. ఇట్లు తమ్ముని వాక్యంబులు విహితంబుగా నెంచి పంచపుటి యథేచ్ఛముగా నేగెను.

శ్లో॥ తతః సస్మార స మునిః పాకసేనం మహాభటం।
స్మరణాదాగతః శీఘ్రం పాకసేనో మహాబలీ॥ ౨౭

తా. అనంతర మా భావనాముని తన భటుడగు పాకసేనుని తలచెను. అప్పుడా పాకసేనుడు వచ్చెను.

శ్లో॥ శార్దూలైస్సహ ఆయాతః తత్రకంచి త్సమాహరన్।
వీరోవ్యాఘ్రం సమారుహ్య తద్ధ్వజేన సమన్వితః॥ ౨౮

తా. ఆ పాకసేనుడు కొన్ని పులులతో గూడి వచ్చెను. భావనాముని యందొక భయంకర వ్యాఘ్రము నెక్కి పులి ధ్వజమును పట్టించుకొనెను.

శ్లో॥ బలిభిః స్వసుతైస్సార్థం వీరైః షోడశభిర్వృతః।
ప్రయయౌ విజయాకాంక్షీ శార్దూలై పరివారితః॥ ౨౯

తా. బలవంతులును, శూరులును నగు పుత్రులతోఁ గూడినవాడును, పదునార్గురు సేనకులు గలవాడును, పెద్ద పులుల సైన్యము గలవాడునై యుద్ధమున కేగెను.

శ్లో. ఏతస్మిన్నంతరే భాను రుదయాద్రిము వాప్తవాన్ ।
తదాదైతేయనాథోఽపి రాక్షసైః పరితోవృతః ।
స్వవిద్యయాఽత్మ సదృశాన్ సృష్ట్వా దైత్యాంశ్చ కృత్రిమాన్ ॥ 30

తా. ఇంతలో సూర్యు డుదయించెను. దానవేంద్రుడును గొప్ప సైన్యముతోఁ గూడినవాడై మఱియు తన సాటి రాక్షసుల ననేకుల సృజించెను.

శ్లో. పూర్వ వద్రథ మాస్థాయ సాయుధస్సపరశ్వథః ।
విలోక్య భావనావీరమూచే వాక్యం మహాసుమ్ముఖః ॥ 31

తా. దానవేంద్రుడు పూర్వమువలెనే రథ మెక్కినవాడై, ఆయుధములను గండ్రగొడ్డలిని ధరించి భావనా ముని కిట్లనియె.

శ్లో. గచ్ఛ గచ్ఛ మునే పుత్ర జీవితం నాస్తి సంయుగే ।
జీవితాశా తే యద్యస్తి ప్రతినిర్గచ్ఛ సంయుగాత్ ॥ 32

తా. ఓ ఋషివర్యా! నీవు బాలుడవు, యుద్ధమునందు బ్రతుకుట దుర్లభము. నీకు ప్రాణేచ్ఛ గల్గినయెడల యుద్ధమునుండి మరలుము.

శ్లో. ఇతి బ్రువంతం దైతేయం ప్రోవాచవదనం మునిః ।
కిం వ్యర్థైర్బహుభిర్వాక్యై ర్యుధ్యస్వయుధి సాంప్రతమ్ ॥

తా. ఈవిధముగ పలుకుచున్న రాక్షసునిజూచి శవనాముని యో నీచా! పలుమాటలేల? నాతో యుద్ధ మొనర్పుము.

శ్లో. యుధ్యతాంశూరతా తే చ నచ జీవన్ ప్రయాహిభో ।
దివి సింధౌ విశేద్వాపి పాతాళేవాఽపి దిక్షుచ ॥ 38

తా. ఓరి రాక్షసుడా! నీకు శౌర్యమున్న యెడల యుద్ధ మొనర్పుము. నీవు సముద్రము జొచ్చినను విడువను.

శ్లో. మమదృష్టి పథం గత్వా జీవన్న ప్రతియాస్యసి ।
మార్వ్యేవం ధను రాయమ్యశరవృష్టిం ససర్జ సః ॥ 39

తా. నీ వెక్కడనున్నను వెదకి చంపుదు నని చెప్పి యల్లెత్రాటిని ధనుస్సున జేర్చి బాణవర్ష ము గురియించెను.

శ్లో. తత స్త ద్రాక్షసానీకం శాంభవీసంభవం భువి ।
ఖండితం చాఽపతత్సర్వం భిన్నశీర్ష గళోదరమ్ ॥ 3౽

తా. శాంభవీ విద్యచేత సృజింపబడిన సకల రాక్షస సైన్యము ఖండింపబడిన తలలు, మెడలును, కడుపులును గలదై భూమిపైని బడెను.

శ్లో. భిన్నబాహూరు పాదం చ శకలీకృత విగ్రహం ।
బభూవు ర్ద్వీపిన స్సర్వే పిబం తశ్శోణితం తదా ॥ 32

తా. అప్పుడు రాక్షసుని సైన్యమంతయును వేర్వేరుగా జేయబడిన తలలు, తొడలు, పాదములు, ముక్కలు, చెక్కలు, పిక్కలు గలవయ్యెను. అందలి రక్తమును పులులు భూమిపై బడకుండ పానము చేసినవి.

శ్లో. ఏవం తన్మాయయా జాతే ష్వఖిలేష్వసురేషుచ ।
మునినాహన్యమానేషు పీతేషు ద్వీపిభిష్వసృక్ ॥ 3౮

తా. ఈ భావనాముని చేత నా కాళువాసురు మాయచే బుట్టు రక్కసులు చంపఁబడుచుండగా, వారి నెత్తురు వ్యాఘ్రములు పానము చేయుచుండగా,

శ్లో. కాళువాసైనికో దైత్య శ్చుకోప మునినే మునిం ।
ఖడ్గ త్రిశూల పరిఘు పరశ్వథముఖాయుధైః ॥ 3౯

తా. కాళువాసేనుడను రాక్షసుడు మునివలన మిక్కిలి కుపితుడై త్రిశూలాద్యాయుధములచేత

శ్లో. కరవాలగదా భిండివాల తోమరశక్తిభిః ।
యష్టిభల్లక నిస్త్రింశ ముద్గర క్షురసాధనైః ।
నిజఘాన మహావీరం యుగపద్దనుజాధిపః ॥ ౪౦

తా. రాక్షసేంద్రుడును మునిపై నలిగి కరవాలాది సమస్తాయుధ విశేషములచేత మునిని నొప్పించెను.

శ్లో. తానాగతాన్ తదాదృష్ట్వా భావనాముని రాత్మవాన్ ।
నిజఘాన శరైః సర్వైః సాయుధాన్ రాక్షసాధమాన్ ॥

తా. అప్పుడు భావనామునియు నాయుధములతో గూడుకొన్న యా రాక్షసులను జూచి సమస్తాయుధములతో వారిని నొప్పించెను.

శ్లో. చక్రుశుర్దనుజాః కేచిత్ నిపేతుశ్చమృతాః పరే।
బిభ్యశ్చాన్యే రణే దైత్యా వివిలుశ్చ వనాంతరే॥ ४२

తా. ఇట్లు భావనాముని కొట్టగనే కొందరు కోపించిరి. మఱికొందరు మృతులైరి. ఇతరులు వనాంతరముల దాగుకొనిరి.

శ్లో. నిహతాహ్యాహవే శస్త్రైః భావనామునినా సురాః।
పునర్జాతైః సదాజన్యే సంకులోమునిరాట్స్వయమ్। ४३

తా. అప్పుడు భావనామునిచేత రాక్షసులు చంపబడిరి. అట్లు చంపబడియు మరల పుట్టు రాక్షసులతో దొమ్మి యుద్ధ మాయెను.

శ్లో. ససర్జ బ్రాహ్మ్యమస్త్రం చ తత్తేనైవజఘాన సః।
పునశ్చ పరమక్రుద్ధో వైష్ణవం చక్రమత్యజత్। ४४

తా. అప్పుడు భావనాముని బ్రాహ్మాస్త్రమును బ్రయోగింపగా, నా రక్కసుడు దానిని ద్రిప్పికొట్టెను. మరల భావనాముని వైష్ణవసంబంధమైన చక్రమును వదలెను.

శ్లో. తత్తస్య కంఠదేశంతు నైవ వేద్ధు మశక్నువత్।
స తతో భావనావీరః పరంకుప్య రణాజిరే। ४५

తా. తాను ప్రయోగించిన విష్ణుచక్రము వాని కంఠ మును ఛేదింపలేకపోగా భావనాముని మిక్కిలి కోపించి,

శ్లో. సస్మార గిరిజానాథ ప్రసాదిత వరాయుధం ।
చంద్రహాసాఖ్యమపరం కోటిసూర్య సమప్రభమ్ । ౭౬

తా. అప్పుడు భావనాముని కీశ్వరు డనుగ్రహించి నట్టిదియు, మిక్కిలి శ్రేష్ఠమైనదియు, కోటిసూర్యుల కాంతి గలదియు నగు చంద్రహాసమును దలచెను.

శ్లో॥ ప్రళయాంబుద నిర్ఘోషం భీషయన్ సకలం జగత్ ।
అనేక మృత్యుసదృశం గ్రసన్ లోకానివాఖిలాన్ ౭౦

తా. ప్రళయకాల మేఘమువలె గర్జించు నదియు, ప్రపంచమును భయపెట్టునదియు, అనేక మృత్యువులతో తుల్యమైనదియు, లోకాలోకములను మింగివేయునదియు,

శ్లో॥ బ్రహ్మాస్త్ర శతసంకాశం చక్రానేక సముజ్జ్వలం ।
సస్ఫులింగ శిఖాకోటి సంవృతానిల సన్నిభమ్ । ౭౧

తా. నూఱు బ్రహ్మాస్త్రములతో సమానమగు నదియు, ననేక చక్రములతో సాటి యగునదియు, మిణు గురులుగల జ్వాలతో గూడిన యగ్నితో దుల్యమగునదియు,

శ్లో। తమాదాయ జఘానైషః మూర్ధ్ని దుష్టస్యరక్షసః ।
తేనతస్య శిరోహ్యాశు సకిరీటం సకుండలమ్ ॥ ౭౨

తా. అట్టి చంద్రాయుధమును వాని శిరస్సునం దుంపగనే, వానిశిరము కుండలములతో గూడినదియు, కిరీ టముతో గూడినదియు,

శ్లో॥ సదంష్ట్రం శ్మశ్రులం భీమ మపతత్కంపయన్ మహీం।
తతో వవర్షు ర్దివ్యాశ్చ సుమనోవృష్టి మంజసా। ౫౩

తా. కోరలతో గూడినదియు, భయంకర మీసములతో గూడుకొన్నదియునై భూతలమును కంపింపజేయుచు అది క్రిందబడెను. అప్పుడు దేవతలు పూలవానను గురియించిరి.

శ్లో॥ జహర్షుర్మున యస్సర్వే ననృతుశ్చాప్సరోగణాః ।
సుప్రసన్నా దిశస్సర్వా శ్చకాసే సర్వతో జగత్॥ ౫౪

తా. అప్పుడు ఋషులందరును సంతసించిరి. అప్సరసలు నృత్య మొనర్చిరి. దిక్కులు ప్రసన్నము లయ్యెను. జగమెల్ల ప్రకాశించెను.

శ్లో॥ తతోమృగాదనాః సర్వే పపుః శోణితమాసురం ।
కేచిత్కళేబరా త్తస్య సరక్తస్యాస్య రాక్షసాః॥ ౫౫
జాతః కేచిద్వికారాంగా హీనశస్త్రాస్త్ర తేజసః ।
తం దృష్ట్వా సహసా వీరం భావనాముని మగ్రతః॥ ౫౬
బాణబాణాసనకరం ప్రళయాంతిక సన్నిభం ।
దుద్రువు స్సర్వతో దిక్షు భీతాస్సర్వే సురారయః ౫౭

తా. అనంతర మాపులులు వాని రక్తమును పానము చేసినవి. ఆకాళువాసేనుని కళేబరమునుండి యనేక కురూపులును, సాయుధులు నగు రాక్షసు లుదయించిరి. వారా భావనామునిని జూచి భయము నొంది పరుగెత్తిరి.

శ్లో॥ సాంద్రాటకాఖ్య సంతానసాంద్రదృష్ట్యా దయో
ఽసురాః ।
శతపుత్రైశ్చ సంభూతాన్ విచార్య చపరస్పరమ్॥ ౫౮
నిర్వీర్యా నిష్కళాః పాపాహతాశ్చ స్యుర్మునేస్సుతైః ।
విరుధ్యసహాత్తైర్నష్టా భవిష్యన్తి చ భూతలే । ౫౯

తా. సాంద్రాటకుడు, సంతానుడు మొదలైన రాక్షసులు శతపుత్రులచే హతులగుదురు. భావనాముని పుత్రులతో విరోధించి నష్ట మొందగలరు.

శ్లో॥ అతస్సర్వేఽమరాస్తం తు భావనామునిమాదరాత్ ।
తుష్టువుః పరమప్రీత్యా నిర్భయత్వాన్మహర్షయః॥ ౬౦

తా. ఆవిధముగా రాక్షసులను సంహరించుటవలన మహర్షులు, దేవతలు నిర్భయులై మిక్కిలి సంతసించినవారలగుచు నా భావనామునిని కొనియాడిరి.

శ్లో॥ మునిరప్యతి హర్షేణ హత్వైవం దుష్టరాక్షసాన్ ।
అగ్రహీత్పరమాం విద్యాం తేజోరూపాం దురాస
దామ్ । ౬౧

తా. అంతట భావనాముని సంతోషముతో దుష్టరాక్షసుల చంపి యితరులకు పొంద శక్యముకానిదియు, తేజోరూపమైనదియు నగు శాంభవీ విద్యను గ్రహించెను.

శ్లో॥ మేనే కృతార్థ మాత్మానం కృతకృత్యం ముహు
ర్ముహుః ।
మునిస్తత్రైవ సమరే శంకరోక్తి మనుస్మరన్ । ౬౨

తా. అంతట నా భావనాఋషి యా యుద్ధమునందు సాంబమూర్తి చెప్పిన మాటను స్మరించి తనను ధన్యుని చేయదగిన కార్యము చేసినవానినిగా దలచెను.

శ్లో. తస్యాంత్రైర్నాడిభిః ర్వీరఉత్కృత్య సచరాక్షసం ।
నిర్మాయ వసనం శీఘ్రం దాతుం రుద్రప్రియంకరం ।
రుధిరాక్తం తదాదాయ శివసామీప్య మాయయౌ ॥

తా. ఆ భావనాముని యావిధమున నా రాక్షసుని సంహారించి యా రక్కసుని ప్రేగులచేతను నాడులచేతను వస్త్రమును నిర్మించి శివసాన్నిధ్యమున కేగెను.

శ్లో. స్థాప్య తత్పురతో నీత్వా వీరో వాక్య మథాఽబ్రవీత్ ।
కైలాసాధిప! దేవేశ! శివ! తం రాక్షసాధమమ్ ౬౮
త్వయా దత్తేన ఖడ్గేన ఖండయిత్వా తు సంయుగే ।
తస్యాన్త్రైర్నాడి భిర్దేవ వస్త్రం వ్యసృజ మంజసా ।
గృహాణైతన్మహాదేవ! మత్కర్మసఫలం కురు ॥ ౬౯

తా. అట్లు కొనివచ్చిన వస్త్రమును శివునియెదుట బెట్టి యా భావనావీరు డిట్లనియె. కైలాసాధపతియగు నో శంకరా! ఆ రాక్షసాధముని వధించి వాని ప్రేగులచేతను, నాడులచేతను వస్త్రమును నిర్మించి నీయొద్దకు వచ్చితిని. దీనిని గైకొని నా కార్యమును సఫల మొనర్పుము.

శ్లో. ఏవముక్తో మహాదేవః ప్రత్యువాచ మునీశ్వరం ।
వీరోఽసి భావనావీర! మహాశ్చోసి మమసాంప్రతమ్ ౭౦

యత్త్వయా నిహతో యుద్ధే దుర్ధర్షః క్షుద్రరాక్షసః ।
అతో జగన్తి సర్వాణి నిర్భీకాన్య భవన్మునే ॥ ౬౭

తా. ఈ విధముగా భావనాముని వాక్యములు విని యోగీశ్వరు డిట్లనియె. భావనావీర! నీవు నాకు మాన్యుడ వైతివి. నీచేత ఖలుడును, లోకకంటకుండును నగు నీచ దానవుడు సశించెను. అందువలన లోకములు భీతిలేని వయ్యెను.

శ్లో. కాళువాస్తైనిక శిరః ఖండితో ఒఖండ విక్రమః ।
సాంద్రాటక శిరః ఖండశ్చైలాఖండల విక్రమః ॥ ౬౮
శార్దూల బృందశ్శైలేశః పుండరీక గతిధ్వజః ।
హేమదంష్ట్రో జగద్వ్యాస మూలహేతుః క్రతూద్భవః ॥
పద్మకోశీయాధిపతిర్దివ్యాంబర విధాయకః ।
దశైతాని మహాభాగ మనుష్యాశ్చామరా అపి।
జగత్త్రయే త్వదీయాని కీర్తయంతు వరం మునే। ౭౦

తా. మహానుభావుడవగు భావనామునీ! మానవుల చేతను దేవతలచేతను, (1) సాంద్రాటకుని శిరస్సును ఖండించినవాడును, (2) కాళువాస్తైనికుని ద్రుంచినవాడును, (3) శార్దూల బృందశ్శైలేశుడు, (4) శార్దూల ధ్వజుడు, (5) హేమదంష్ట్రుడు, (6) జగద్వ్యాస మూలకారుడు, (7) క్రతూద్భవుడు, (8) హరినాభిసహోద్భూతతంతు సంతానకౌశలుడు, (9) పద్మకోశీయాధిపతి, (10) దివ్యాంబర విధాయకుడు అను ఈ పది పేర్లు నీకు ఎల్లలోకములందును కీర్తనీయములై యుండునుగాక!

శ్లో॥ ఉక్త్వేవం గిరిజానాథ శ్చేలం రక్షోంగ సంభవం ।
జహార పరమప్రీత్యా సర్వేషా మపి సన్నిధౌ ॥ ౭౧

తా. పరమేశ్వరుడు ఈవిధముగా బలికి సమస్తదేవతల సన్నిధియందు నత్యధికమైన సంతోషముతో రాక్షస శరీరమువలన బుట్టిన యావస్త్రమును గ్రహించెను.

శ్లో॥ అబ్రవీచ్చ పునర్వీరం జగద్ధితకరం వచః ।
కనకాద్రిపురీం గత్వా సుఖేన విహరస్వభో ॥ ౭౨
పుత్రాన్ భద్రగుణోపేతాన్ స్థాప్య దేశేషు సర్వతః ।
కృతకృత్యః కృతార్థ స్త్వం సమాప్నుహి మమాంతికమ్ ॥ ౭౩

తా. ఆ పరమేశ్వరుడావిధముగా దేవతలయొక్కయు, ఋషులయొక్కయు, సాన్నిధ్యమున ఆ వస్త్రమును గ్రహించి మరల లోకహితమగు వాక్యమును పలికెను. ఓ భావనాముసీ! పుత్రులను, భార్యను వెంట నిడికొని కనకాద్రిపురమున కేగి యక్కడ సుఖముగా విహరింపుము. మరియును సద్గుణులగు నీ పుత్రులను సమస్తదేశములయందును నిలిపి కృతార్థుడ వగుము. కృతకృత్యుడవై నాలోకమునకు రమ్ము.

శ్లో॥ ఏవముక్తో మహావీర స్తస్యాజ్ఞాం గిరిజాపతేః ।
శిరసా ధారయన్ హృష్టో వామదేవాలయాద్బహిః ।
అవతీర్య యయౌ స్వీయైః లక్షణైరుపలక్షితః ॥ ౭౪

తా. ఈవిధముగా పరమేశ్వరుడు చెప్పిన పిదప మహావీరుడైన భావనాముని ఈశ్వరు నాజ్ఞను శిరమున ధరించి సంతసించి యతిశీఘ్రముగా పరమేశ్వరాలయము నుండి దిగి నిజచిహ్నములతో గూడుకొని పోయెను.

శ్లో. కనకాద్రిపురీం ప్రాప్యసపుత్రస్సహ సేవకైః।
శూరేణ సహభృత్యేన శార్దూలైశ్చ విరాజితః॥ ౭౫
వింధ్యాటవీం యథాపూర్వం రేమయిత్వా
మృగాదనాన్।
తతోఽహన్య హని ప్రీతః పుత్రేభ్యః ప్రదదౌస్వకమ్॥

తా. అంతట నా భావనాముని కనకాద్రిపురి కేగి పుత్రులతోను, సేవకులతోను, పాకసేనుడను భృత్యుని తోడను మునుపటివలె వింధ్యారణ్యమున కేగి పులుల దరిమి పిమ్మట దినదినమున సుఖముగనుండి యావల తన సర్వస్వ మును బుత్రుల కొసగెను.

శ్లో. విద్యాంతాం శంభునాదత్తాం సర్వలోకోపకారిణీం।
పుత్రేషు కృత విద్యేషు పండితేషు తతోమునిః॥ ౭౭
విలోక్యతనయాన్ సర్వాన్ శివోదిత మనుస్మరన్।
నాటఘోటమరాటేషు కర్ణాట కరహాటయోః। ౭౮
లాటకోంకణ బంగాళకరూశ ద్రవిడేషుచ।
మత్స్య మాళవ నేపాళ విదేహ మగధేషుచ॥ ౭౯
కాశ్మీరగౌడ వంగాంగ కళింగ కురుపాండుషు।
సంచార్య తనయైః సాకం విచార్య చ ముహుర్ముహుః।

వానప్రస్థాశ్రమస్థాన సద్బ్రహ్మ మునికన్యకాః ।
సమ్మతైస్తత్ర వేదోక్త విధినాకృత కౌతుకాః ॥ ౮౧
తత్తద్దేశేషు తనయాన్నివేశ్య ముదితః పునః ।
ప్రవిశ్య స్వపురీం వీరో శిష్టాన్ పుత్రాన్వివాహయన్ ।

తా. ఆవిధముగా పరమశివునిచే నియ్యబడినదియు, సర్వలోకోపకారియునగు విద్యను పుత్రుల కిచ్చి, వారిని పండితులను గావించి, శివుని వాక్యమును స్మరించి, యా పుత్రులతోడ నన్నిదేశములను చరించి, వానప్రస్థాశ్రమ వాసులగు బ్రాహ్మణ కన్యలను పుత్రులకు యథోక్తవిధి వివాహము చేసి, యా యా దేశములయందు నిలిపి, మిగిలిన పుత్రులతో తన పురియగు కనకాద్రికి వచ్చి యందు తన పుత్రులకు వివాహము చేసెను.

శ్లో. నా సత్యదేవ దుహితౄరూప యౌవనశాలినీః ।
వేదోక్త సద్విధానేన శుభలగ్నే శుభేదినే ॥ ౮౩
వివాహంకారయామాస మునిస్సజ్జన సమ్మతః ।
తేషాంపుత్రైః ప్రపౌత్రైశ్చ స్వవిద్యాకుశలైర్యుతః ।
భుక్త్వా భోగానవనేకాంశ్చ చిరకాలం స్థితోభువి ॥ ౮౪

తా. మంచి రూపముతోడను, యౌవనముచేతను ఒప్పుచున్న అశ్వినీదేవతల పుత్రికలను ఒకానొక శుభదినమున శుభలగ్నమున వేదములందు చెప్పబడిన విధముగా వివాహము చేయించెను. విద్యాకుశలులైన వారి పుత్ర

పౌత్రులతో భోగముల ననుభవించుచు చిరకాలము భువిని వసించెను,

శ్లో. ఏకదా తనయాన్ దృష్ట్వా ప్రోవాచ మునిపుంగవః ।
ఆదౌ భృగుమునిః పశ్చాన్మార్కండేయః పరంత్వహమ్॥
అస్మదీయాని నామాని గోత్రే సంసూచ్యయత్నతః।
త్ర్యార్షేయంగోత్ర మిత్యుక్త్వా కురుధ్వం కర్మసంతతిమ్॥
మార్కండేయ ప్రసాదాద్ధి కుల మేతదభూత్సుతాః ।
మార్కండేయాఖ్య గోత్రం హి సర్వేషాం విహితం
తతః ॥ ౮౭

శాఖాతు యాజుషీ పుత్రా వదధ్వం భృగుసూత్రికమ్ ।
గోత్ర మేతద్ధివక్తవ్యం కృతజ్ఞస్య చ సూచకమ్ ॥ ౮౮
సంబంధేషు చ సర్వత్ర యథాకామం ప్రకల్ప్యతాం ।
గోత్రమన్యచ్చయద్దేశేసాధవః కల్పయంతియత్ ॥ ౮౯
తద్దేశే తచ్చ వక్తవ్యం వివాహాదిషు సర్వదా ।
మత్కుల ప్రభావానాంతు మార్కండేయాఖ్య
గోత్రకమ్॥ ౯౦

సర్వసాధారణం భూయాదితి మచ్ఛాసనం హితమ్ ।
ఇత్యేవ ముక్త్వా సమునిః పునః ప్రోవాచ సాదరమ్॥ ౯౧
ఋషిభ్యో బ్రహ్మణా పూర్వం ప్రోక్తాన్ ధర్మాన్
వదామిచ ।
గృహస్థస్య పరో ధర్మో దేవతాభ్యర్చనం తథా ॥ ౯౨

వైవాహ్య మగ్నిమింధీత సాయం ప్రాతర్యథావిధి ।
దేశాంతరగతో వాఽథ మృతపత్నీక ఏవవా । ౯౩

త్రయాణా మాశ్రమాణాం తు గృహస్థో యోనిరుచ్యతే।
అన్యే తమనుజీవంతి తస్మాచ్ఛ్రేయాన్ గృహాశ్రమీ ॥
ఐకాశ్రమ్యం గృహస్థస్య వర్ణానాం శ్రుతిదర్శనాత్ ।
తస్మాద్గార్హస్థ్య మేవైకం విజ్ఞేయం ధర్మసాధనమ్ ॥ ౯౫
పరిత్యజే దర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ।
సర్వలోక విరుద్ధంచ ధర్మమప్యాచరేన్నతు॥ ౯౬
ధర్మాత్సంజాయతే హ్యర్థో ధర్మాత్కామోఽభిజాయతే।
ధర్మాదేవాఽపవర్గోఽయం తస్మాద్ధర్మం సమాచరేత్ ।
ధర్మశ్చార్థశ్చ కామశ్చ త్రివర్గస్త్రిగుణో మతః ।
సత్వం రజస్తమశ్చైవ తస్మాద్ధర్మం సమాచరేత్ । ౯౮
ఊర్ధ్వం గచ్ఛంతి సత్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛంతి తామసాః । ౯౯

యస్మిన్ ధర్మసమాయుక్తౌ వర్థకామౌ వ్యవస్థితౌ ।
ఇహలోకే సుఖీభూత్వా ప్రేత్యానంత్యాయ కల్పతే ।
ధర్మాత్సం జాయతే మోక్షో హ్యర్థాత్కామోఽభిజాయతే
ఏవం సాధనసాధ్యత్వం చాతుర్విధ్యే ప్రదర్శితమ్॥ ౧౦౧

య ఏవం వేద ధర్మార్థ కామమోక్షాంశ్చ మానవః।
మాహాత్మ్యం చానుతిష్ఠేత సచానంత్యాయ కల్పతే ।
తస్మాదర్థంచ కామంచత్యక్త్వా ధర్మం సమాశ్రయేత్ ।

ధర్మాత్సంఖ్యాయతే సర్వమిత్యాహుర్బ్రహ్మవాదినః ।
ధర్మేణ ధార్యతే సర్వం జగత్స్థావరజంగమమ్ ।
అనాదినిధనాశక్తిస్సైషా బ్రాహ్మీ ద్విజోత్తమాః ।
కర్మణా ప్రాప్యతే ధర్మో జ్ఞానేనచ న సంశయః ।
తస్మాజ్జ్ఞానేన సహితం కర్మయోగం సమాచరేత్ ।
ప్రవృత్తంచ నివృత్తంచ ద్వివిధం కర్మవైదికమ్ ।
జ్ఞానపూర్వం నివృత్తం స్యాత్ప్రవృత్తం యత్తతో
ఽన్యథా । ౧౦౬
నివృత్తం సేవమానస్తు యాతి తత్పరమం పదమ్ ।
తస్మాన్నివృత్తం సంసేవ్య మన్యథా సంసరేత్పునః ।
శమోదమోదయా దాన మలోభస్త్యాగ ఏవచ ।
ఆర్జవం చానసూయాచ తీర్థానుసరణం తథా । ౧౦౭
నిత్యసంతోష ఆస్తిక్యం శ్రద్ధా చేంద్రియనిగ్రహః ।
దేవతాభ్యర్చనం పూజా బ్రాహ్మణానాం విశేషతః ।
అహింసా ప్రియవాదిత్వం శుచిత్వ మకలంకతా ।
ఇత్యాది ధర్మవ్యూహంతు సమ్యగ్జ్ఞాత్వా స్మృతీరితం ।
తథా ప్రవర్తితవ్యా హి యూయం పుత్రాశ్చిరం భువి ।

తా. ఒకనాడు మునిశ్రేష్ఠుడు తన కుమారులతో నిట్లు పలికెను. నేను మొదట భృగు మహర్షిని, పిదప మార్కండేయుడనైతిని. మాపేర్లను గోత్రమునందు నిలిపి, ముగ్గురు ఋషుల గోత్రముగ కర్మకలాపము జరుపుడు.

మార్కండేయుని యనుగ్రహముచేతనే ఈకులము కలిగినది. కాబట్టి కుమారులారా! మీ కందరకు మార్కండేయ గోత్రమే చేయుబడినది. శాఖ మాత్రము యజుశ్శాఖ. సూత్రము భృగుసూత్రము. ఇతర దేశములలో ఏగోత్రము పెద్దలు కల్పింతురో ఆగోత్రమునే వివాహాది కార్యములలో వ్యవహరింతురు. నా వంశములో పుట్టినవారికి మార్కండేయ గోత్రము సర్వసాధారణముగ నుండవలెనని నేను శాసించుచున్నాను.

ఈవిధముగ ఆముని చెప్పి, సాదరముగ మరల ఇట్లు చెప్పదొడంగెను. బ్రహ్మదేవుడు పూర్వము ఋషులకు చెప్పిన ధర్మములను చెప్పెదను, వినుడు. గృహస్థునకు దేవతార్చనయు, ఉభయ సంధ్యలయందును, అగ్నిహోత్రము చేయుటయు ముఖ్యధర్మములు. మూడు ఆశ్రమములకును గృహస్థుడు మూలాధారము. కాబట్టి గృహస్థుడు శ్రేష్ఠుడు. గృహస్థాశ్రమము ధర్మసాధనము. ధర్మహీనములైన అర్థకామములను పరిత్యజింపవలెను. లోకవిరుద్ధమైనయెడల ధర్మమునైనను చేయకూడదు. ధర్మమువలన అర్థము కలుగుచున్నది. ధర్మముచేతనే కామమోక్షములు కూడ కలుగుచున్నవి. కాన ధర్మము సమాచరింపవలెను. ధర్మార్థ కామములకు త్రివర్గ మనిపేరు. సత్వరజస్తమములకు త్రిగుణములనిపేరు. సాత్వికులు ఊర్ధ్వలోకమునకు పోవుదురు. రాజ

సులు మర్త్యలోకములో నిలుతురు. కామసులు అధములై అధోలోకమునకు పోదురు. ఎవడు ధర్మముతో కూడిన అర్థ కామములను సేవించునో వాడు ఇహలోకములో సుఖించి మరణించిన పిదప మోక్షము నొందును. ధర్మముచే మోక్షము కలుగుచున్నది. అర్థముచే కామము కలుగు చున్నది. ధర్మార్థకామమోక్షములను ఆరాధించినవాడు మోక్షగామి యగుచున్నాడు.

సర్వమును ధర్మముచేతనే కలుగుచున్నది. స్థావర జంగమములతో కూడిన జగత్తు సర్వమును, ధర్మముచే ధరింపబడుచున్నది. కర్మచేతను, జ్ఞానముచేతను, ధర్మమును సంపాదింపవచ్చును. కాన జ్ఞానసహితమైన కర్మను ఆచరింప వలెను. వేదవిహితమైన కర్మ ప్రవృత్తమని, నివృత్తమని రెండు విధములు. జ్ఞానపూర్వకమైనది నివృత్తము. దానికి విరుద్ధమైనది ప్రవృత్తము. నివృత్తమును సేవించినవాడు పరమపదమును చెందును. ప్రవృత్తమును సేవించినవాడు మరల సంసారమునం జిక్కును. శాంతి, క్షాంతి, దయ, దానము, ఋజుత్వము, ఆస్తిక్యము మొదలైన ధర్మములను చక్కగ గ్రహించి, లోకములో నాకెల్లరు ప్రవర్తింప వలెను.

శ్లో. శివసాయుజ్యమాకాంక్షే స్వవిద్యా కుశలాః పరాః
తత్తద్దేశేషు సంస్థాప్య తంతు సంతాయకాన్ముదా ॥౧౨౦॥

మత్వా కృతార్థమాత్మానం కైలాసమపిసేవకైః ।
ప్రాప్య సర్వామరాన్మిత్రం హరిభక్తిం విశేషతః॥ ౧౧౨
భద్రావత్యా చ సహితః భావనాశివసన్నిధిః ।
ప్రీత్యా వాసాంసి దివ్యాని నిర్మలాన్యరజాంసిచ ॥ ౧౧౩
సృజన్ సౌఖ్యేన మహాత్మా దేవ సంఘైస్సమం స్థితః।
స్వాదయన్నమరైస్సాక మమృతం దేవతాప్రదం ।
ఆస్తేఽద్యాపి మహావీరః జరామరణ వర్జితః॥ ౧౧౪

తా. అంత నా భావనాముని శివసాయుజ్యమును గోరుచున్నవాడై, సకల విద్యలయందును నేర్పరులైన పుత్రుల నా యా స్థానములయం దునిచి, యధికానందము నొందెను. అంతట తనను ధన్యునిగా నెంచి సపరివారుడై భద్రావతీదేవితో కూడ కైలాసమున కేగెను. అందు డెందంబున ముకుంద చరణారవిందంబుల ననిశంబు ధ్యానించుచు దివ్యవసనంబుల నిర్మించుచు, దేవత లొసగు నమృతమును గ్రోలుచు నేటికిని జరామరణములు లేనివాడై కైలాసంబున నమరులతో సుఖంబుండెను.

ఇతి శ్రీ వేదవ్యాసప్రోక్తే మార్కండేయ పురాణే
భావనాఋషి మాహాత్మ్యే కాళువాసుర సంహారం
నా మాష్టమోఽధ్యాయః.

కాకినాడ: మాస్టర్ మన్ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె

అనుబంధము - ౧.

# శ్రీ భావనాఋషి పూజావిధానము.

గ్రంథకర్త:

కీ॥ శే॥ శ్రీమాన్, అవధానం

**కార్యంపూడి రాజమన్నారుకవిగారు**

శతావధాని.

ప్రకాశకులు:

**బహూత్తమ పబ్లికేషన్స్,**

రామారావుపేట, కాకినాడ - 4.

# ప్రస్తావన

మా చినతాతగారైన కీ॥ శే॥ శ్రీమాన్ అవధానం కార్యంపూడి రాజమన్నారు కవిగారు 1846.వ. సంవత్సరమున గుంటూరు జిల్లాలోని పేరాల గ్రామమున జన్మించిరి. వీరు శ్రీమానద్దంకి తిరుమలకుమార శ్రీ తిరుమలాచార్యులయ్యవార్లంగారివద్ద విద్యాభ్యాసము గావించిరి. 19-వ. శతాబ్దములో పద్మశాలిసంఘము విద్యాభివృద్ధియందును, సంస్కృతియందును వెనుకబడియున్న దినములలో వీరు, స్వప్రతిభావ్యుత్పత్తులచే, సంస్కృతాంధ్రములయందు కవిత్వ విద్యావిశారదులై ఆంధ్రావనిలోని ముఖ్యపట్టణములలో, వీరి సోదరపుత్రులు, మా పెదతండ్రిగారు నైన శ్రీమాన్ 'పద్మశాలి పితామహ' అవధానం కార్యంపూడి వేంకటకృష్ణ కవిగారితో కలిసి పెక్కు శతావధానములను గావించిరి. విద్యాపోషకులైన, గద్వాల వనపర్త్యాది సంస్థానాధీశులచే గౌరవింపబడి సంస్థానవార్షికములచే బహూకరింపబడిరి. వీరు విఖ్యాతులైన శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులకు సమకాలికులు. వీరికి శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులకు మైత్రి గద్వాల సంస్థానములోనే ఏర్పడినది.

శ్రీమాన్ రాజమన్నారు కవిగారు చిన్నతనము నుండియే గ్రంథరచనకు ఉపక్రమించిరి. ప్రప్రథమముగ హరిశ్చంద్రోపాఖ్యానమును బుర్రకథగా వ్రాసిరి. తర్వాత

సంస్కృతాంధ్రములయం దనేక గ్రంథములను రచించిరి. వీరి రచనలలో శ్రీ మాధవస్వామి శతకము ప్రౌఢమై వారి పాండిత్యప్రకర్షను తెలియజేయుచున్నది. రాజవంశరత్నావళి, రామభూపాల విలాసము, నీతిశతకము, పీఠికాపుర రాజ సందర్శనము మొదలైనవి వీరి మరికొన్ని రచనలు. వీరు 1915-వ. సంవత్సరమున పేరాలలోనే కీర్తిశేషులైరి. శ్రీ భావనాఋషి పూజావిధానము, రాగసంఖ్య అను రెండు చిన్న పుస్తకములనుకూడ వ్రాసిరి.

## శ్రీభావనాఋషి పూజావిధానము-రచన-ప్రకటన

కడప జిల్లాలోని మాధవరము గ్రామమున, అచటి పద్మశాలీయ ప్రముఖుడు శ్రీ మేరువ పాపయ్యగారి వేంకటయ్యగారు 1904-వ, సంవత్సరములో శ్రీ భావనాఋషి ఆలయమును కట్టించి ప్రతిష్ఠాపన చేయించిరి. ఆసమయమున శ్రీమాన్ రాజమన్నారు కవిగారిని అచ్చటకు ఆహ్వానించిరి. అప్పటికి ఆంధ్రావనిలో అచ్చటచ్చట శ్రీ భావనాఋషి దేవాలయములు, పద్మశాలీయులు అధిక సంఖ్యాకులుగా నున్న గ్రామములలో వెలసియున్నవి. అయినను అప్పటికి తగు పూజావిధానము లేకపోవుటచేత అర్చకులు తమ ఇష్టానుసారము శ్రీ భావనాఋషి పూజావిధానమును నడుపుచుండిరి. శ్రీ మేరువ వేంకటయ్యగారి కోరికపై శ్రీ భావనాఋషి పూజావిధానమును శ్రీమాన్ రాజ

మనార్ను కవిగారు రచించిరి. దానిని 1904-వ సంవత్సరము లో మద్రాసులోని శ్రీ కమలానంద ముద్రాక్షరశాలయందు ముద్రింపజేసిరి. ఈ పుస్తకముయొక్క ప్రతులు ఆంధ్రావని లోని అన్ని ప్రాంతముల పద్మశాలీయులకు నాడు అంది యుండకపోచ్చును. దీనిని రచించి, ఇప్పటికి 65 సంవత్స రములయినది. 40 సంవత్సరములనాడు "పద్మశాలి పితామహ" శ్రీమాన్ కార్యంపూడి వేంకటకృష్ణకవిగారు శ్రీమాన్ రాజమన్నారు కవిగారి రచనలను సంపుటముగా ప్రకటింప ప్రయత్నించిరి. కాని కారణాంతరములచే నాడా పని పూర్తి కాలేదు.

నేను విశాఖపట్టణమునకు జిల్లాపరిషత్తు ఉపకార్య దర్శిగా వెళ్ళిన సందర్భమున అచ్చటి పద్మశాలీయులచే ఆహ్వానింపబడి శ్రీ భావనాఋషిస్వామివారి ఆలయమునకు వెళ్ళితిని. అప్పుడు, అక్కడ కళ్యాణోత్సవములు జరుగు చున్నవి. శ్రీ భావనాఋషి స్వామివారి కళ్యాణోత్సవములు అన్నిప్రాంతములలో ఒకే సమయమున జరుగుటలేదు. నేను అచ్చటి అర్చకులను పూజావిధానమునుగూర్చి ప్రశ్నించితిని. ఈ పూజావిధానము వారికి తెలియదు. నేను విద్యాశాఖలో విద్యా పరీక్షాధికారిగా, ఆంధ్ర దేశములోని పెక్కు ప్రాంత ములను గత 35 సంవత్సరములలో చూచితిని. పద్మశాలీయు లున్న ప్రతి గ్రామములోను, శ్రీ భావనాఋషి ఆలయ

మున్నది. కాని సరియైన పూజావిధానము లేదు. అందువలన శ్రీమాన్ రాజమన్నారు కవిగారిచే రచింపబడిన ఈ పూజావిధానమును ఈ "భావనాఋషి మాహాత్మ్యము"నకు అనుబంధముగా చేర్చినచో ఆయా దేవాలయములలో సరియైన పూజావిధానమును అవలంబించుటకును, ప్రతిగృహ ములోను, పద్మశాలీయులు, శ్రీ భద్రావతీసహిత భావనా ఋషి స్వాములవారిని పూజగావించుకొనుటకును, అనువుగ నుండునని భావించితిని.

ఇట్లు,

కార్యంపూడి నాగేంద్రుడు.
వ్యవస్థాపకాధ్యక్షుడు
బహూత్తమ పబ్లికేషన్స్,
కాకినాడ.

# శ్రీ భావనాముని ధ్యాన శ్లోక పంచరత్నములు.

## మందాక్రాంత వృత్తములు.

శ్లో॥ శ్రీమద్రాకావిధుమృదుముఖం ।
శ్వేతపంకేజనేత్రమ్ ।
సత్యాలంబం సమధికశమం ।
శంఖచక్రోర్ధ్వపుండ్రమ్ ।
యజ్ఞోద్భూతం గగనగమనం ।
యాయజూకార్చితాంఘ్రిమ్ ।
వందే నిత్యంవరదమజరం ।
భావనామౌనిచంద్రమ్ ॥ ౧

శ్లో॥ భ్రాజద్రత్నప్రకటమకుటం ।
ధర్మకౌశేయచేలమ్ ।
స్మేరాంకూరప్రచురవదనం ।
శ్రీచతుర్బాహు యుక్తమ్ ।
శార్దూలాంకం సహజకవచం ।
శార్ఙ్గఖడ్గప్రశస్తమ్ ।
వందే నిత్యంవరదమజరం ।
భావనామౌనిచంద్రమ్ ॥ ౨

శ్లో॥ సమ్యగ్భావం సరసవచనం ।
సాధుమందారభూజమ్ ।
విశ్వానందం విజయశరధిం ।
వీరసింహాసనస్థమ్ ।
దానేశౌండం దనుజహరణం ।
తప్తచామీకరాభమ్ ।
వందే నిత్యం వరదమజరం ।
భావనామానిచంద్రమ్ ॥ 3

శ్లో॥ కారుణ్యాబ్ధిం గజకరభుజం ।
కాళువాసేనకాలమ్ ।
సాంద్రాటాగ్ని ప్రశమనఘనం ।
సర్వశాస్త్ర ప్రవీణమ్ ।
పారావార ప్రభుహరిహర ।
ప్రాంచితోద్యద్యశస్కమ్ ।
వందే నిత్యం వరదమజరం ।
భావనామానిచంద్రమ్ ॥ ౪

శ్లో॥ శ్రీభద్రేశం జితరిపుతతిం ।
శ్రీనివాసాంశజాతమ్ ।
వేదవ్యాసప్రణుతచరితం ।
వేదవేదాంతవేద్యమ్ ।
ధీరోదాత్తం ద్విజకులవరం ।
దివ్యతేజస్స్వరూపమ్ ।
వందే నిత్యం వరదమజరం ।
భావనామానిచంద్రమ్ ॥ ౫

# నీరాజన పంచరత్నములు

శ్లో, మంగళం విష్ణురూపాయ । మణికోటీరహారిణే ।
భద్రావతీసమేతాయ । భావనామునయేసదా । ౧

శ్లో। మంగళం యజ్ఞజాతాయ । మానవావనమూర్తయే ।
మార్కండేయ తనూజాయ । మహోత్సాహాయ
మంగళమ్ ॥ ౨

శ్లో। శంఖ చక్ర గదా ఖడ్గ । శార్ఙ్గాద్యాయుధధారిణే ।
ఛిద్రోర్ధ్వ పుండ్రవక్త్రాయ । చిద్విలాసాయ
మంగళమ్ ॥ 3

శ్లో॥ పంచపుత్ర్యనుజాతాయ । భక్తౌఘామరధేనవే ।
పద్మోపమాననేత్రాయ । భవ్యాభిఖ్యాయ మంగళమ్॥ ౪

శ్లో। మణికుండలకేయూర । మండనాయమహాత్మనే ।
శ్రీ మాధవరవాసాయ । శ్రీమతే జయ మంగళమ్ ॥ ౫

## శ్రీభావనామున్యష్టోత్తర శతనామ స్తోత్రమ్

శ్లో॥ శ్రీ భావనాముని శ్రేష్ఠో । బ్రహ్మమానససంభవః ।
నారాయణాంశజోజిష్ణు । శార్ఙ్గోపమధనుర్ధరః ॥ ౧
మార్కండేయాధ్వరోద్భూతో । మహాపురుషలక్షణః ।
శారదాంభోజపత్రాక్షః । శ్శంఖచక్రోజ్జ్వలాయుధః॥ ౨
మార్కాండతనయోపేతో । మహానీయశుభాకరః ।
భద్రావతీ మనోనాథః । పర్యాప్తమృతకరాననః ॥ 3

దివ్యచందన లిప్తాంగో । దేవానాం ప్రియదర్శనః ।
సంతతాష్టలసద్భోగ । స్సామగానాభిలాషుకః ॥ ౪
విద్యుత్పుంజాశకాశేయో । విశ్వధర్మ విదుత్తమః ।
సహజానర్ఘ్యకోటీర । స్సార కేయూరకుండలః ॥ ౫
అభేద్యవజ్రవర్మోరు । హారాద్యఖిలభూషణః ।
సర్వజ్ఞ స్సర్వపాపఘ్న । స్సర్వవిద్యా విచక్షణః ॥ ౬
బహూత్తమ ప్రసిద్ధాంగో । భ్రాజత్ప్రాకారగోపురః ।
భృగుపుత్రీసుధీనప్తా । మృకండుమునిపౌత్రకః ॥ ౭
పంచపుత్ర్యనుజో దేవః । పంచానన పరాక్రమః ।
సింహసంహనన శ్శ్రీమాన్ । శ్రీగౌరీ వస్త్రదాయకః ॥ ౮
పుండరీక ధ్వజశ్చక్రీ । పుణ్యాత్మా వ్యాఘ్రవాహనః ।
కాళవాసేన సంహారీ । కల్పోపవనభాసురః ॥ ౯
కనకాద్రి పురాధీశః । కల్యాణగుణసాగరః ।
శంకరార్పితపల్యంక । చ్ఛత్రచామరవాహనః ॥ ౧౦
కుబేరదత్త నాగేంద్రః । కులదేవో గురూత్తమః ।
వాసవాప్తకులీనాశ్వో । వనమాలాభిశోభితః ॥ ౧౧
వారాశిరాజ గంభీరో । వైజయంతీ సమంచితః ।
కనకాచలరాడ్ధైర్యః । కంజబాంధవ విద్యుతిః ॥ ౧౨
పుండరీకబలాధ్యక్షః । పూర్ణ చంద్ర నిభచ్ఛవిః ।
భార్గవీ జన్మసంబంధః । పద్మాదత్తా మృతాశనః ॥ ౧౩
గిరిజాప్రాప్త సంజీవ । కరణ్యౌషధ సంగ్రహః ।
అంభోజ ప్రియజామాతా । హారిపీతాంబరప్రదః ॥ ౧౪

చతుర్గతి శ్చతుర్బాహు । శ్చతుష్షష్టికళానిధిః ।
దత్తవాగ్విశ్వ సృడ్విష్ణుః । దానధర్మపరాయణః ౧౫
త్రివిక్రమో జ్ఞానగమ్య । స్త్రిదశానందకారణః ।
త్రికాలజ్ఞో మహాభాగ । స్త్రయీవేద్యస్త్రిశీర్షకః॥ ౧౬
సిద్ధార్థ స్సిద్ధసంకల్ప । శ్శివవ్యాఘ్రాజినప్రదః ।
సాకార పుండరీకాక్షః । సదాచార శతాత్మజః । ౧౭
చామీకర సద్భుజాంగ । శ్శరణాగత వత్సలః ।
దీనవాంఛా దేవమణి । ర్ద్విజారి కులాంతకః ॥ ౧౮
భగవాన్ భయరాత్ర్యర్కో । భక్తానాం పుత్రదాయకః।
విహాయసగతిప్రాజ్ఞో । విశ్వదుస్స్వప్న నాశనః ॥ ౧౯
హేమదంష్ట్రో దీర్ఘబాహు । రిద్ధచారిత్ర శేవధిః ।
దైత్యారినాభి పంకేజ । తంతుసంధాన కౌశలః । ౨౦
దారిద్ర్యధ్వంసకోవిష్ణు । ర్దండనీతి విశారదః ।
సృష్టిక్రియా సురజ్యేష్ఠ । శ్శిల్పసారస్వతీశ్వరః ॥ ౨౧
పద్మశాలీయజనకో । బ్రహ్మర్షి కులసంభవః ।
గాయత్రీస్థాపనాచార్యః। కాంతా సంతానకామదః॥ ౨౨
వాజపేయ క్రతుఖ్యాతో । భాస్వద్విశ్వజిదధ్వరః ।
అఖిలాఘహరాభిఖ్యః । ఆర్యావర్తావనీశ్వరః ॥ ౨౩
కందర్పకోటి శృంగారో ॥ నందారుజనశంకరః ।
శాశ్వతార్చా శుభాగార । శ్చందనేందు యశోధనః॥ ౨౪

ఇతి శ్రీ భావనాముని ష్టోత్తర శతస్తోత్రమ్,

# శ్రీ భావనా మున్యష్టోత్తర శతనామావళిః

ఓమ్ భావనాముని శ్రేష్ఠాయనమః । ౧
ఓమ్ బ్రహ్మమానససంభవాయనమః । ౨
ఓమ్ నారాయణాంశజాయనమః । ౩
ఓమ్ జిష్ణవేనమః । ౪
ఓమ్ శార్ఙ్గోపమధనుర్ధరాయనమః । ౫
ఓమ్ మార్కండేయా ధ్వరోద్భూతాయనమః । ౬
ఓం మహాపురుష లక్షణాయనమః । ౭
ఓం శారదాంభోజ పత్రాక్షాయనమః । ౮
ఓం శంఖచక్రోజ్వలాయుధాయనమః । ౯
ఓం మార్తాండతనయోపేతాయనమః । ౧౦
ఓం మహనీయశుభాకరాయనమః । ౧౧
ఓం భద్రావతీమనోనాథాయనమః । ౧౨
ఓం పర్వామృతకరాననాయనమః । ౧౩
ఓం దివ్యచందనలిప్తాంగాయనమః । ౧౪
ఓం దేవానాంప్రియదర్శనాయనమః । ౧౫
ఓం సంతతాష్టల సద్భోగాయనమః । ౧౬
ఓం సామగానాభిలాషుకాయనమః । ౧౭
ఓం విద్యుత్సంకాశకౌశేయాయనమః । ౧౮
ఓం విశ్వధర్మ విదుత్తమాయనమః । ౧౯
ఓం సహజానర్ఘ్య కోటీరాయనమః । ౨౦

ఓం హార కేయూర కుండలాయనమః । ౨౧

ఓం అభేద్యవ్రజవర్మోరుహారాద్యఖిలభూషణాయనమః। ౨౨

ఓం సర్వజ్ఞాయనమః ! ౨౩

ఓం సర్వపాపఘ్నాయనమః । ౨౪

ఓం సర్వవిద్యావిచక్షణాయనమః । ౨౫

ఓం బహూత్తమప్రసిద్ధాంకాయనమః । ౨౬

ఓం భ్రాజత్ప్రాకారగోపురాయనమః । ౨౭

ఓం మృత్యుంజయప్రేమపాత్రాయనమః । ౨౮

ఓం మృకండుమునిపౌత్రకాయనమః । ౨౯

ఓం పంచపుట్యనుజాయనమః । ౩౦

ఓం దేవాయనమః ! ౩౧

ఓం పంచానన పరాక్రమాయనమః । ౩౨

ఓం సింహాసంహాననాయనమః । ౩౩

ఓం శ్రీమతేనమః । ౩౪

ఓం శ్రీ గౌరీవస్త్రదాయకాయనః । ౩౫

ఓం పుండరీకధ్వజాయనమః । ౩౬

ఓం [illegible]త్రిణేనమః ః ౩౭

ఓం పుణ్యాత్మనేనమః । ౩౮

ఓం వ్యాఘ్రవాహనాయనమః । ౩౯

ఓం కాళువాసేన సంహారిణేనమః । ౪౦

ఓం కల్పోపవనభాసురాయనమః । ౪౧

ఓం కనకాద్రిపురాధీశాయనమః । ౪౨

ఓం కళ్యాణగుణసాగరాయనమః ౹ ౪౩
ఓం శంకరార్పితపల్యంకచ్ఛత్రచామర
వాహనాయనమః ౹ ౪౪
ఓం కుబేరదత్తనాగేంద్రాయనమః ౹ ౪౫
ఓం కులదేవాయనమః ౹ ౪౬
ఓం గురూత్తమాయనమః ౹ ౪౭
ఓం వాసవాప్తకులీనాశ్వాయనమః ౹ ౪౮
ఓం వనమాలాభిశోభితాయనమః ౹ ౪౯
ఓం వారాశిరాజగంభీరాయనమః ౹ ౫౦
ఓం వైజయంతీ సమంచితాయనమః ౹ ౫౧
ఓం కనకాచలరాడ్ధైర్యాయనమః ౹ ౫౨
ఓం కంజబాంధవ విద్యుతయేనమః ౹ ౫౩
ఓం పుండరీకబలాఢ్యతాయనమః ౹ ౫౪
ఓం పూర్ణచంద్రనిభచ్ఛవయేనమః ౹ ౫౫
ఓం భార్గవీజన్మసంబంధాయనమః ౹ ౫౬
ఓం పద్మాదత్తా మృతాశనాయనమః ౹ ౫౭
ఓం గిరిజాప్రాప్తసంజీవకరణౌషధసంగ్రహాయనమః ౹ ౫౮
ఓం అంభోజప్రియ జమాత్రేనమః ౹ ౫౯
ఓం హరిపీతాంబర ప్రదాయనమః ౹ ౬౦
ఓం చతుర్గతయేనమః ౹ ౬౧
ఓం చతుర్బాహవేనమః ౹ ౬౨
ఓం చతుష్షష్టి కళానిధయేనమః ౹ ౬౩

ఓం దత్తవాగ్విశ్వస్పృడ్వస్త్రియనమః । ౬౪
ఓం దానధర్మపరాయణాయనమః । ౬౫
ఓం త్రివిక్రమాయనమః । ౬౬
ఓం జ్ఞానగమ్యాయనమః । ౬౭
ఓం త్రిదశానందకారయణానమః । ౬౮
ఓం త్రికాలజ్ఞాయనమః । ౬౯
ఓం మహాభాగాయనమః । ౭౦
ఓం త్రయీ వేద్యాయనమః । ౭౧
ఓం త్రిశీర్షకాయనమః । ౭౨
ఓం సిద్ధార్థాయనమః । ౭౩
ఓం సిద్ధసంకల్పాయనమః । ౭౪
ఓం శివవ్యాఘ్రపూజిన ప్రదాయనమః । ౭౫
ఓమ్ సాకార పుండరీకాక్షాయనమః । ౭౬
ఓమ్ శతాత్మజాయనమః । ౭౭
ఓమ్ చామీకర సదృశాంగాయనమః । ౭౮
ఓం శరణాగత వత్సలాయనమః । ౭౯
ఓం దీనవాంఛాదేమమణయేనమః । ౮౦
ఓం దివిజారి కులాంతకాయనమః । ౮౧
ఓమ్ భగవతేనమః । ౮౨
ఓం భయరాత్ర్యర్కాయనమః । ౮౩
ఓం భర్గప్రసాదాసాదితశాంభనీ విద్యాయనమః॥ ౮౪
ఓం భక్తానాంపుత్రదాయకాయనమః । ౮౫

ఓం ప్రాజ్ఞాయనమః । ౮౬

ఓం విశ్వ దుస్స్వప్ననాశనాయనమః । ౮౭

ఓం హోమదంష్ట్రాయనమః । ౮౮

ఓం దీర్ఘబాహవేనమః । ౮౯

ఓం ఇద్ధచారిత్ర శేవధయేనమః । ౯౦

ఓం దైత్యారినాభి పంకేజతంతుసంధాన కౌశలాయనమః । ౯౧

ఓం దారిద్ర్వంసకాయనమః । ౯౨

ఓం విష్ణవేనమః । ౯౩

ఓం దండనీతి విశారదాయనమః । ౯౪

ఓం సృష్టిక్రియా సురజ్యేష్ఠాయనమః । ౯౫

ఓం శిల్పసారస్వతీశ్వరాయనమః । ౯౬

ఓం పద్మశాలీయ జనకాయనమః । ౯౭

ఓం బ్రహ్మర్షి కుల సంభవాయనమః । ౯౮

ఓం గాయత్రీస్థాపనాచార్యయనమః । ౯౯

ఓం కాంతాసంతానకామదాయనమః । ౧౦౦

ఓం వాజపేయక్రతుఖ్యాతాయనమః । ౧౦౧

ఓం భాస్వద్విశ్వజిదధ్వరాయనమః । ౧౦౨

ఓం అఖిలాఘహరాభిఖ్యాయనమః । ౧౦౩

ఓం ఆర్యావర్తావనీశ్వరాయనమః । ౧౦౪

ఓం కందర్పకోటిశృంగారాయనమః । ౧౦౫

ఓం వందారుజనశంకరాయనమః। ౧౦౬

ఓం శాశ్వతార్భా శుభాగారాయనమః। ౧౦౭

ఓం చందనేందు యశోధనాయనమః॥ ౧౦౮

ఇతి శ్రీ భావనామున్యష్టోత్తర శతనమావళిః

సమాప్తా.

దేవాలయమున శఠగోపమునకు ప్రతిగా శ్రీ భావనామౌని పాదములు శిరస్సున ధరించునపుడు పఠించవలసిన ముక్తకము.

శ్లో॥ శ్రీ భావనామౌని సరోజభూషణం ।
భద్రావతీపాణి సరోజభూషణం ।
కోదండచక్రాబ్జ హలాదిలాంఛనం।
శఠగోతుపూతం మమమస్తకం సదా॥

అనుబంధము - ౨.

# ఈ గ్రంథముద్రణకై ఒక్కొక్కరు రు 116/- వంతున సహాయ మొనరించిన దాతల పేర్లు.

## చిరునామాలు క్రింద ప్రకటింపబడినవి.

1. శ్రీ అమృత శివరామ్‌గారు-అమృతవార్ బ్రదర్స్, ఫర్గూసన్ రోడ్డు, బొంబాయి.

2. శ్రీ గుంటక నరసయ్యపంతులుగారు - G. N. పంతులు & కంపెని, బాకారంరోడ్డు, హైదరాబాదు.

3. శ్రీ బత్తిన నారాయణరావుగారు-అఖిలభారత గ్రామోద్యోగ భాండార్, తులసిపైప్‌రోడ్డు- దాదర్, బొంబాయి.

4. శ్రీ మిట్టపల్లి మల్లయ్యగారు - మాజీ ఉపమేయర్, భవానీపేట, పూనా.

5. శ్రీ దుర్గము నరసింహులుగారు-స్వామి సోప్‌ఫ్యాక్టరి, శంకరబాగ్, హైదరాబాదు.

6. శ్రీ బర్రెంకల రామచంద్రయ్యగారు-టింబర్ మర్చెంటు & ఫారెస్టు కంట్రాక్టరు, గోషామహల్, హైదరాబాదు.

7. శ్రీ పుంజాల విశ్వనాథముగారు - ప్రొప్రయిటర్, విజయా రెస్టారెంట్, ఎబిడ్స్, హైదరాబాదు.

8. శ్రీ ధీకొండ భూమయ్యగారు - హోల్ సేల్ & రిటేల్ యారన్ మర్చెంట్, పాన్ బజార్, సికింద్రాబాదు.

9. శ్రీ తుమ్మా బుచ్చయ్యగారు - వెండి, బంగారం, ముత్యాలు, వజ్రాలు వ్యాపారం, మహాత్మాగాంధీ రోడ్డు, నిజామాబాదు.

10. శ్రీ సి. శ్రీశైలముగారు-B. Com. L.L.B. Income Tax Practitioner రాష్ట్రపతిరోడ్డు, నిజామాబాదు.

11. శ్రీ తాడిపర్తి వీరరాఘవయ్యగారిభార్య శ్రీమతి అంజమ్మగారు-వారి కుమారుడు కీ॥ శే। వేంకటసత్య నారాయణ B. E. గారి జ్ఞాపకార్థము, తెనాలి.

12. శ్రీ S. R. మల్లయ్యగారు స్టేషనరీ మర్చంట్స్. గాంధీచౌకు. నిజామాబాదు.

# గ్రంథ ముద్రణకై ద్రవ్యసహాయ మొనరించిన ఇతర అభిమానుల పేర్లు, చిరునామాలు క్రింద ప్రకటింపబడినవి.

శ్రీ సోముల స్వామిదాస్ గారు,
ఐరన్ మర్చెంట్, సికింద్రాబాదు — రు 51-00

శ్రీ గుత్తికొండ సత్తెయ్యగారు, ఎలక్ట్రిసిటీ సామానుల వ్యాపారం, సికింద్రాబాదు — రు 51-00

శ్రీ ఈపూరి రాములుగారు, కడవేరు రామ లింగయ్యగారు, హోల్ సేల్ బట్టల దుకాణం, సికింద్రాబాదు — రు 51-00

శ్రీ గోపికె లింగయ్యగారు, క్లాత్ మర్చెంట్ టుబాకోబజార్, సికింద్రాబాదు — రు 50-00

శ్రీ సామల వెంకటయ్యగారు,
C/o శ్రీ వెంకటేశ్వరా కలర్ కంపెనీ,
మహంకాళివీధి, సికింద్రాబాదు — రు 51-00

శ్రీ మంగలంపల్లి చంద్రయ్యగారి కుమారులు
టింబర్ మర్చెంట్స్, గోషామహల్,
హైదరాబాదు — రు 51-00

7. M/s శ్రీనివాస టింబర్ ట్రేడింగ్ కంపెని,
టింబర్ మర్చెంట్స్, గోషామహాల్,
హైదరాబాదు రు 51-00

8. శ్రీ కాసల శివరామయ్య, సుబ్బయ్యగార్లు,
బట్టల వ్యాపారం, పుల్లంపేట, కడపజిల్లా రు 50-00

9. శ్రీ అవ్వారు రామయ్య కుమారుడు చిన
రంగయ్యగారు, బట్టల వ్యాపారము,
పుల్లంపేట, కడపజిల్లా రు 50-00

10. శ్రీ భీమిసెట్టి వేంకటనరసయ్యగారు,
బట్టల వ్యాపారము, పుత్తనవారిపల్లె,
(Via) పుల్లంపేట, కడపజిల్లా రు 50-00

1. శ్రీ బి. యస్. వేంకటసుబ్బయ్య & సన్సు,
బట్టలవ్యాపారం, పుల్లంపేట, కడపజిల్లా రు 25-00

2. శ్రీ అవ్వారు రోశయ్యగారి పిచ్చయ్యగారు,
బట్టలవ్యాపారం, పుల్లంపేట, కడపజిల్లా రు 25-00

3. శ్రీ నూకల నారప్పగారి చెంగయ్య & సన్స
బట్టలవ్యాపారం, పుల్లంపేట. కడపజిల్లా రు 25-00

4. శ్రీ సామల తిరుపయ్య & సన్, బట్టలవ్యాపా
రము, మాధవరము, కడపజిల్లా రు 25-00

5. శ్రీ సామా గోవిందయ్య & సన్స్, బట్టల
వ్యాపారము, మాధవరము, కడపజిల్లా రు 25-00

శ్రీ బోడగల లక్ష్మయ్య & సన్సు, బట్టల
వ్యాపారము, మాధవరము, కడపజిల్లా రు 25-00

శ్రీ జొన్నాదుల నారయ్య & సన్సు, బట్టల
వ్యాపారము, మాధవరము, కడపజిల్లా రు 25-00

శ్రీ బుదారపు వేంకటసుబ్బయ్య & సన్సు,
బట్టలవ్యాపారం, పుల్లంపేట. కడపజిల్లా రు 15-00

శ్రీ అవ్వారు సుబ్బరాయుడు & సన్సు, బట్టల
వ్యాపారము, పుల్లంపేట, కడపజిల్లా రు 10-00

శ్రీ బి. వేంకటపతి & సన్సు, బట్టలవ్యాపారం
మాధవరము, కడపజిల్లా రు 10-00

శ్రీ సామల పిచ్చయ్య, వేంకటరంగయ్య &
సన్సు, బట్టల వ్యాపారము, మాధవరము,
కడపజిల్లా రు 10-00

శ్రీ బి. కోదండరామయ్య & సన్సు, బట్టల
వ్యాపారము, మాధవరము, కడపజిల్లా రు 5-00

శ్రీ సామా వేంకటరామానుజయ్య & సన్సు
బట్టలవ్యాపారం, మాధవరం, కడపజిల్లా రు 5-00

అనుబంధము - 3.

## కుల గ్రంథ సంస్కరణకమిటీ సమావేశము
## పటమట - 5-4-1959

'శ్రీ భావనాఋషి మాహాత్మ్యమ్' అనబడు పద్మశాలి కులగ్రంథ సంస్కరణ కమిటీవారు, కృష్ణాజిల్లా విజయవాడ సమీపమందలి 'పటమట' గ్రామంలో ది 5-4-1959న ఉదయం 9 గంటలకు కమిటీ అధ్యక్షులగు శ్రీ కార్యంపూడి నాగేంద్రుడుగారి అధ్యక్షతను జరిగిన సమావేశమునకు హాజరైన సభ్యులు.

1. శ్రీ కార్యంపూడి నాగేంద్రుడుగారు
2. శ్రీ దోగుపర్తి గోపాలంగారు
3. శ్రీ శిల్పాచార్య బిట్రా వేంకటసుబ్రహ్మణ్యస్థపతిగారు

ప్రత్యేకాహ్వానముపై హాజరైనవారు.

1. శ్రీ తాడిపర్తి శ్రీకంఠముగారు, B. A., L.L.B.
2. శ్రీ బిట్రా కోటేశ్వరసిద్ధాంతిగారు
3. శ్రీ కౌతరపు వేంకటరామమూర్తిగారు
4. శ్రీ మాచర్ల సీతారామకవిగారు.

వ తీర్మానము :

1939 వ సం॥లో జరిగిన అఖిలభారత పద్మశాలి
ప్తమ మహాజనసభవారి 19 వ తీర్మానము ననుసరించి
శ్రీ భావనాఋషి మాహాత్మ్యమ్'' అగు కులగ్రంథ సంస్క
ా కమిటీ సభ్యులుగా ఎన్నుకొనబడిన 11 మంది సభ్యులలో
ఁనాటికి, శ్రీ కార్యంపూడి రమాకాంతకవిగారు, శ్రీ తాడి
ర్తి శ్రీరామశ్రేష్ఠిగారు, శ్రీ రాచాబత్తుని అచ్చయ్యగారు,
ి రావీటి పరమేశ్వర సిద్ధాంతిగారు చనిపోయినందున,
ంఘువ్యవహారములు నిరాటంకముగా జరుగు నిమిత్తమై
ఁ క్రిందివారిని ఈ గ్రంథ సంస్కరణకమిటీ సభ్యులుగా
ో-ఆప్టు చేసికొనడమైనది.

శ్రీ తాడిపర్తి శ్రీకంఠంగారు, బి. ఎ., యల్. యల్. బి.
అడ్వకేటు.

శ్రీ బిట్రా కోటేశ్వరసిద్ధాంతిగారు
శ్రీ కౌతరపు వేంకటరామమూర్తిగారు
శ్రీ మాచెర్ల సీతారామకవిగారు.

వ తీర్మానము :

కులగ్రంథ సంస్కరణకమిటీవారు ఇంతవరకు చేసిన
(శ్రీ) భావనాఋషి మాహాత్మ్యమ్'' యొక్క సంస్కరింప
డిన ప్రతిని ఆమూలాగ్రము పరిశీలించి ఆమోదించడ
ునది. అచ్చున కనుకూలమగునట్లు శుద్ధప్రతిని తయారు

చేయించి, గ్రంథమును ప్రకటించుటకు ప్రసిడెంటు అధికార మియ్యఁబడినది.

1. (Sd ) కార్యంపూడి నాగేంద్రుడు
2. ,, దొగుపర్తి గోపాలం
3. ,, బిట్రా కోటేశ్వరసిద్ధాంతి
4. ,, కొత్రపు వేంకటరామమూర్తి
5. ,, మాచర్ల సీతారామకవి
6. ,, బిట్రా వేంకటసుబ్రహ్మణ్యస్థపతి
7. ,, T. Sreekantam.

శ్రీ గుంటక నరసయ్యపంతులుగారు నాటి వేళమునకు రాజాలకపోయినను, గ్రంథప్రకటనకు సంపూర్ణ అంగీకారమును, సహకారమును వెల్లడించు లేఖ వ్రాసిరి.

కార్యంపూడి నాగేంద్రుడు
అధ్యక్షుడు.